# Hamsavimsaty

by

Ayyalarazu Narayanamatya.








V. RAMASWAMY SASTRULU & SONS
292, Esplanade
Madras.

1920.

21/c

VAVILLA PRESS, MADRAS.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.



# హంసవింశతి పద్యకావ్యము.



అయ్యలరాజు నారాయణామాత్యవిరచితము

ఆయుర్వేదీయవైద్య జ్యోతిషవిద్వాన్

బొద్దికూరపాటి వెంకటరంగకవిచే

పరిష్కృతము



వావిళ్ల రామస్వామిశాస్త్రులు & సన్స్ గారిచే

ముద్రితము.



MADRAS:

PRINTED AT THE ANANDA PRESS.

1909.

# పీఠిక.

ఈహంసవింశతిని రచియించినకవి యయ్యలరాజు నారాయణామాత్యుఁడు. ఈతని కాఁపురస్థలము నెల్లూరుమండలములోఁ జేరిన కొచ్చర్లకోట జనపదంబునందలి గోరగుంతలపాడను గ్రామము. ఈతం డాదియం దాగ్రామమందుండు శ్రీయాంజనేయస్వామిపరముగ (నఖగర్తపురాంజనేయ నతజనగేయా) యనుకందపద్యశతకమునుఁ బిమ్మట హంసవింశతియు ననంతరము దశావతారకథాసంగ్రహ మను మూఁడాశ్వాసముల గ్రంథమును రచియించి యున్నాడు. ఈకవి యాప్రాంతముల ననేకభూవసతులును ధనసంపత్తియుఁ గలవాఁడగుటచే యాచకకవిగాక తనగ్రంథముల నిష్టదేవుం డగుశ్రీరామచంద్రున కంకితముఁ జేసెను. ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు, గౌండిన్యసగోత్రుఁడు, యీతని తాతకుఁ దాత పర్వతామాత్యుఁడు, ముత్తాత అయ్యలామాత్యుఁడు, తాత భాస్కరామాత్యుఁడు, తండ్రి సూరపామాత్యుఁడు, తల్లి కొండమాంబ యని తా రచించిన దశావతారకథాసంగ్రహంబునందుఁ దనతండ్రినిఁ గూర్చి.

సీ. కౌండిన్యసద్గోత్ర•కల్పకం బగు పర్వ, తప్రగ్గ డెవ్వాని•తాతతాత
కవిచకోరకనిశా•కరయశస్స్ఫురదయ్య, లామాత్యుఁ డెవ్వాని•యబ్బ కబ్బ
కుకవితాక్షుద్రద్రు•కుద్దాలసముఁడు భా, స్కరమంత్రి యెవ్వాని•గన్నతండ్రి
హంసవింశతిప్రబం•ధాకల్పనారాయ, ణాఖ్యుఁ డౌ నే నేమ•హాత్ముసుతుఁడ
నట్టియయ్యలరాజాన్వ•యాంబురాశి, భగణహృన్నాఘుఁ గొండమాం•బాసనాథు
నిఖిలకకుబంతరాళ ని•ర్ణిద్రకీర్తి, మజ్జనకు సూరపామాత్యు•మదిఁ దలంతు.

నని స్తుతించి యున్నాడు. మఱియును 1810వ సంవత్సరప్రాంతమందుండిన బ్రౌన్ దొరవారిపండితమండలిలో నొకరును, వేంకటగిరిరాజ్యమందలి దక్షిణఖండములోని మన్నారుపోలూరుగ్రామమందుండు మన్నారుకృష్ణస్వామివారి కంకితముగ;

సీ. శ్రీరుక్మిణీరహః•క్రీడాకళాసత్య, సత్యభామామనో•జలజమిత్ర
మిత్రవిందాధరా•మృతపానచాతుర్య, తుర్యకాళిందీమృ•దుప్రసంగ
సంగమనిపుణల•క్షణలక్షణాధీన, ధీనయనాగ్నజి•తిప్రసాద
సాదరసల్లాప•జాంబవతీలోల, లోలదృగ్భద్రాము•దాలవాల
వాలఖిల్యాదిమునిసం•స్తవప్రభావ, భావమున నెంతు నినునిష్ట•వప్రచారు
చారుతరమందహాసపో•లూరువాస, వారితామితతృష్ణ మ•న్నారుకృష్ణ.

*

యను సీసపద్యశతకమును, నృసింహవిలాస మను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచించినవారు నగు పైఁడిపాటి వేంకటనృసింహామాత్యుఁడు తన మేనమామ యైనట్టు దశావతారకథాసంగ్రహమునందు,

క. కామాదికషడ్వర్గ హ్రద, భీముని శ్రీపైఁడిపాటి • వేంకటనరసిం
హామాత్యకవికులేంద్రుని, నామాతులుని సన్నుతింతు • నతశీర్షుఁడనై.

యని స్తుతించియున్నాఁడు. ఈవేంకటనృసింహకవి నెల్లూరుమండలమునఁ గందుకూరుజనపదంబునందలి పైఁడిపాడుగ్రామకాపురస్థుఁడు అచ్చటికి సమీపగ్రామము లగు మేఁకపాడుమొదలగుగ్రామములందుండు సింగరాజువారును, బడుగులేరు- హాజీపురము మొదలగు గ్రామములనుండు మాచవరమువారును, శింగముపల్లివారును సమీపబంధువులు. వీరియాళ్లకు గోరుగుంతలపా డను గ్రామము కేవలము సమీపమం దున్నది. ఈగ్రామమందు పౌరుషనామధేయ మింటిపేరుగాఁగల అయ్యలరాజువా రను యాజ్ఞ్వలనియోగు లుండి దేశకాలవైపరీత్యములవల్లఁ జెదరి వంగోలుతాలూకాగ్రామములందుఁ గొందఱును వినుకొండతాలూకాగ్రామములలోఁ గొందఱునుఁ జేరి పోయి శ్రీ తిక్కనసోమయాజిగారియింటిపేరు మొదట గుంటూరువా రనియుఁ బిమ్మట నాతనిసంతతివారికి పాటూరువా రనియు మద్దాళివా రనియు నేర్పడినటులనే కొంతకాలముక్రిందటనుంచి యాయయ్యలరాజువారికి ఘూళికవివా రను నామాంతర మేరుపడి యున్నది. హంసవింశతిగ్రంథకర్త యగు నారాయణామాత్యకవి యీవంశస్థులయొక్క పూర్వుఁడే. హంసవింశతి యైదవాశ్వాసాంతమున నొకసీసపద్యమందుఁ దనయొక్కయుఁ దన మేనమామగారియొక్కయు గ్రామములకుఁ జుట్టుప్రక్కలనుండు, కంభము మారకాపురము వినుకొండ పొదిలె దర్శి కందుకూరు కల్లూరు కలువాయి తాళ్ళూరు తంగెళ్ల కూటాగుళ్ల మొదలైన గ్రామములపేళ్లను వ్రాసి యున్నందున నీతండు నెల్లూరుజిల్లావా డైనట్టుఁ దోఁచక మానదు. హంసవింశతియందును, దశావతారకథాసంగ్రహమునందునుఁ దనవంశపరంపరలోని యాదికవీంద్రుల నొకపద్యమున నిట్లు,

ఉ. "అయ్యలరాజు తిప్పసచి • వాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్ర • ధానవరుం డగు గొండధీరునిన్
జయ్యనఁ దిమ్మయప్రభుని • సత్కవితారచనాఢ్యు లైన మా
యయ్యలరాజువంశజుల • నాదికవీంద్రుల సన్నుతించెదన్.

అని నుతించి యున్నాఁడు. రాయబహదర్ కందుకూరి వీరేశలింగముపంతులవారి యాంధ్రకవులచరిత్రము రెండవభాగమునందు రామాభ్యుదయమును రచియించినయయ్యలరాజు రామభద్రునితండ్రి యక్కయామాత్యుఁడు, తాత పర్వతామాత్యుఁడు, ముత్తాత తిప్ప

యామాత్యుఁడు నని వ్రాసియున్నారు. అట్టు లైనయెడల, నీనారాయణామాత్యుని ముత్తాతతండ్రి యగు పర్వతామాత్యుఁడు రామభద్రుని పితామహుఁడే యగును. పర్వతామాత్యుని కుమారులే రామభద్రునితండ్రి యగు అక్కయామాత్యుఁడును నారాయణకవిముత్తాత యగు నయ్యలామాత్యుఁడునుఁ గావచ్చును. అయ్యలయ్యకొమారుఁడు భాస్కరుఁడు, నాతనిపుత్రుఁడు సూరనామాత్యుఁడు, నాతనిసుతుఁడు నీగ్రంథకర్త యగు నారాయణామాత్యుఁ డగును ఈతనివంశపరంపరలో రామాభ్యుదయమును రచించిన రామభద్రుఁడును, కర్ణాటకభాషలోనుంచి రెట్టమత మను జ్యోతిశ్శాస్త్రము నాంధ్రీకరించిన యయ్యలభాస్కరులుమాత్రమే కవు లైనట్టు వారు రచించిన గ్రంథములనుబట్టి తెలియుచున్నది గాని యాదికవీంద్రు లని యీ గ్రంథకర్తచే నుతింపంబడిన తిప్పయ్య, పర్వతయ్య, కొండయ్య, తిమ్మయ్య, రామభద్రునితండ్రి యగుఅక్కయ్య, నారాయణకవితండ్రి యగు సూరయ్య రచియించిన గ్రంథము లేమియుఁ బ్రస్తుతము కానము. ఈయయ్యలరాజువారివంశమందుఁ గడపటికవి నారాయణామాత్యుఁడే యనవచ్చును. ఈయనకాల మిప్పటికి రమారమి నూరు లేక నూటయిరువదిసంవత్సరములై యుండవచ్చును. ఈహంసవింశతికథలయొక్కసంగ్రహ మేమనఁగా.

ఉజ్జయనీపట్టణం బేలు చిత్రభోగుం డను రాజుకడ కొక పరివ్రాజిక వచ్చినం గాంచి యాభూబిడౌజుం డాబిడతో నీ వేయేదేశములం దిరిగితి వేయేదేశములలో వలపించు మంచిమంచి మించుబోడులుందు రని ప్రస్తావించినందు కాసిద్ధురాలు, నీపట్టణమునందే హేమావతి యను సాతానినాతి యొకతె యున్నది. యాయంచయానకు మించిన చంచలాక్షు లీప్రపంచంబున నెచ్చోఁ గాంచి యుండలేనని యుపదేశించి యరిగినంతట నానరేశ్వరుండు విరాళి గొని యాయరాళకచన్గవయ నెంచి, హేల యను తనదూతి నొకదానిని హేమావతికడకు దూత్యమున కంపిన నయ్యది కొన్నినాళ్ళు తిరిగి యింటివారలందరితోఁ జెలిమి సంపాదించి మిథ్యానమస్కారములఁ జేయుచు నమ్మకముఁ బుట్టించి వచ్చుచుం బోవుచు హేమావతికిఁ బ్రాణసఖి యై యేకాంతంబున రాజాభిమతంబునుం దెల్పి దురభిలాషకుం బురికొల్పి యున్నంతట, హేమావతీభర్త యగు విష్ణుదాసుఁ డొడబేరమునకై దేశాంతరముల కేగ నెంచి ప్రయాణమై తాఁ బెంచుచున్న హంసయున్న పంజరంబుకడ కేగుదెంచి కలహంసమా! పోయి వచ్చెద నింటికడ భద్రముగ నుండు మని చెప్పి సెల వంది పనివినిననాటిరాతిరే; యాతనికుటుంబిని యగు హేమావతి వస్త్రాభరణపుష్పసుగంధ బంధురాలంకృత యై దూతికతోడం గదలి రాజుం గవయ నేగుటకై యిల్లు వెడలునప్పుడు, హంస మా హేమావతిం గాంచి యాపెకోర్కె నడిగి తెలిసికొని యనేకసతీహిత ధర్మములం బోధించియు వినకుండుటచే అం కాడ నేర్చి నాబిడ బొంకా

డనేర్చిననే యిష్టాపూర్తి యగును గాని లేనిచోఁ గష్టములే సంభవించును గాన నట్టియు పాయము లెఱింగియుండినం జనుము. యెఱుఁగకున్న నట్టి దొకకథనుఁ జెప్పెద విని య ట్టిసమర్థత నీకుం గలిగినట్టైన రాజుకడకుం బొమ్మని యారాతిరంతయు నొకకథనుఁ జెప్పి యాదినమును దాట వేసెను. హేమావతిమగఁడు దేశాంతరముల నుంచి యిల్లుఁ జేరు వరకు నట్లే దినము నొకకథనుఁ జెప్పి దినముల నన్నిటిని గడపి యాపెను విఫలీకృతమ నోరథనుఁ జేసినట్టు లగుపడుచున్నది.

ఈగాధలవలన మనము తెలియవలసిన నీతిసార మేమనఁగా.

ఉ. ఒత్తుగ మాంసము న్మడుఁగుఁ బోగిరముల్ ఘృతశర్కరాదులుం
గుత్తుకబంటిగా మెసఁగి • క్రొవ్విన వఘూరతితంత్రలీలలన్
మత్తిలి దేహము న్మరచి • మాటికి బొంకు నృపాలకోటికిన్
సత్తుఁ దలంప నెక్కడిది • సంయమి నీకిటుఁ బల్కఁ బాడియే.

అని హరిశ్చంద్రోపాఖ్యానమునందును

సీ. ఆందోళికలయందు • నంతరచరు లైన, సవికృతాకృతుల పిశాచజనులు
పరకరాళంబులై • ప్రార్థింపఁ గనుఁగొంక, వా యెత్తకుండు జీవచ్ఛవములు
వాలపీజనములఁ • గ్రాలుచు నీగకు, నంటినిఖలవర్త • లాండసములు
వేత్రపరంపరా•విలకంటకాకృతిఁ, జేరఁ బోరాని బర్బూరతరులు

ఆ. శంఖనాగస్వరస్వర•శ్రవణసమద, విస్ఫుటచ్ఛత్రవిస్ఫారి•తస్ఫటాక
విష్టవిషవైద్యవశవర్తి•దుష్టఫణులు, ప్రభుదురాత్ముల నెవ్వాడు • బ్రస్తుతించు.

అని కవికర్ణరసాయనమునందును జెప్పంబడు నార్యోక్తిప్రకారము రాజులు పరదారా సక్తు లగు మత్తు లనియు, వారియొద్దఁ జేరు సిద్ధులుఁగూడ వారివాంఛల నెరవేర్చు వెలి గందలసన్యాసులవంటి వేషధారు లగు మోసగాండ్రే యనియు కానియెడల రాజునకుం గలిగిన యధర్మాభిలాష నుడిగింపకఁ బొడిగించి పోవుటకు హేతు వగుపడ దనియు, నట్టి వారి నెప్పుడు గృహస్థు లిండ్లకు రానివ్వఁ గూడదనియు, వచ్చిరేని, స్త్రీలు చేతులం జూపి సాముద్రికము, ఆగత అనాగతము లడుగుట, సంతానప్రాప్తి కని, గాలి, ధూళి, కని, తాయెత్తుల, రక్షరేకులం గట్టించికొనుట మొదలైన యవివేకకార్యముల కవకాశ మివ్వఁగూడ దనియు, నట్టివారితో స్త్రీలను మాటలాడనివ్వనే తగదనియు, పౌరులు రాజదూతికలనుగాని, దాసీ, ఖాసాలనుగాని, యిండ్లకు రానివ్వఁ గూడదనియు, స్త్రీల తో సంభాషణమునుఁ జెలిమిని సల్పనివ్వఁ గూడదనియు, హేమావతికిఁ గలిగిన వ్యభిచా రవాంఛను హంసము నీతులచే నుడిగించుటకు సాధ్యముగాక అంకుపురాణములనే చెప్పి బొంకాడు పాండిత్యమునుఁ గలపుదానివలె నభినయించి యాపెభర్త యిల్లుఁ జేరువఱకు

దినముల నన్నిటిని గడపి యాబిడ పాతివ్రత్యమునుఁ గాపాడె ననియుఁ దనకుఁ బండు కాయ బెట్టి సాకిన యజమానునియందు విజాతీయ మగు పక్షి కున్నంతకృతజ్ఞత యగ్ని సాక్షికముగ వివాహ మాడబడిన సజాతీయ యగు భార్యకు లేదాయెగదా యనియు, శారీరతత్వశాస్త్రప్రకారము స్త్రీలకు మెదటియందుండు బలములో సగము పిండకోశ మందును హృదయమునందుండు బలములో నర్థాంశము స్తనమండలమందును సృష్టికర్త యుంచినటులఁ జెప్పంబడియుండుటచే పురుషులకన్న స్త్రీలకుబుద్ధిబలమును ధైర్యమును చాలా తక్కువరై యుండును గనుక స్త్రీలలో విద్యావిహీనులు నబలలు నగువార లెప్పుడయిననితరుల దుర్బోధనలకు లోఁబడి దుష్ప్రవర్తనలకుఁ బాల్పడ దగిన చల చిత్త లనియు నట్టివారి నెట్టియెడలను కనిపెట్టియే యుండవలె ననియు హేమావతియం దాశఁ గొనిన చిత్రభోగమహారాజుసైతము చివరకు నిరాశుఁడై;

ఉ. మున్నల రావణాదులు స॥ముద్ధతి సాధ్వులఁ గోరి యేమిసౌ
ఖ్యోన్నతిఁ జెంది రట్లగుట॥ నుర్విజనావళు లన్యకాంతలన్
బన్నుగఁ గోరరాదు కడుఁ॥ బాతక మంచుఁ దలంచి యింతిపై
నున్నమనంబుఁ ద్రిక్కొని య॥ధోచితపద్ధతి నుండె భూవరా.

యని పశ్చాత్తప్తుఁడై జ్ఞాని యాయె ననియు నిత్యాదినీతులను బోధించుటయేగాక, యిందు పృథగ్విధము లగు నిరువది పురవర్ణనములు నిరువది సూర్యోదయ సూర్యాస్తమయ సంతమసవర్ణనములు నిరువది స్త్రీవర్ణనములుఁ దత్తత్కాలోచిత సమస్తవస్తుప్రశస్త మగు నిరువది పురుషవర్ణనములు ఋతుషట్కవర్ణనములు మొదలైనవాని నతిమనోహరముగ వర్ణింపంబడి యున్నవి. పై యట్టినీతిపాత్రము నమేయకల్పనాకౌశలము గలిగియున్న నీహంసవింశతినిగురించి రాయబహదరు కందుకూరు వీరేశలింగముపంతులవారుఁ గవులై యుండియుఁ గవితాకష్టము నెఱిగి యుండియు నతిపేలవముగ; పుస్తకమునిండ అంకుఁ బోయి బొంకాడి తప్పించుకున్న యుపాయములే వర్ణింపంబడి యుండుటచే నిది దుర్నీతి బోధకమై నీతిపరులకుఁ బఠనయోగ్యము కానిదై యున్నదని తన కవులచరిత్రమునందు వ్రాయుట కెంతయు సాహసించినందుకుఁ బ్రాచీనార్యోక్తమగు నొకపద్యము నిందుక్రి ద నేనును సాహసించి వ్రాసియున్నాడఁ గాన చదువరు లంద అవలోకించవలయును.

ఉత్పలమాలికావృత్తము.

ఓసుచరిత్రులార పర॥మోన్నతవిద్వదభిజ్ఞులార యో
భూసురవర్యులార పరి॥పూర్ణకలాకలనాభిరాములా
రా సరసంబుగాఁగ వన॥ మల్లుట యన్న పురాథవంబునన్

జేసినపుణ్యలేశమునఁ • జేసి కదా లభియించు గట్టియ
భ్యాసముఁ జేసిన న్గలుగు•నా యది వేదమ, లేక, శాస్త్రమా
రోసము లేల జన్నిదపుఁ • బ్రోగులు వ్రేళ్ళకుఁ జుట్టి చుట్టి పే
రీసునఁ గ్రిందుమీదఁ బడి • నెంతయుఁ దన్నుకఁ జచ్చుఁగాక స
న్న్యాసముఁ బుచ్చుకున్న మతి • నాలిక సత్తువకొద్ది లాగినన్
వీసముఁగాని లేక నర•వీసముఁగాని కవిత్వధార రా
దే సరి యెట్టకేలకుఁ బ•దింపదికట్టలు కాగితాల్ వృథా
జేసి కవిత్వ మల్లిన రు•చించునె యయ్యది గడ్డిపచ్చడిన్
జేసినయట్టు లుండు కదుఁ • జిన్నెలు వన్నెలు గల్గి యెంతయున్
భాసిలు బాలికామణికి • బ్రాకృతకర్మవశంబుచే రసా
భాసఁపు దున్నపోతొకఁ డ•భాగ్యుఁడు దాపుర మైనవానితో
నాసతి యాసలూరఁ దమి•నందముఁ జందముఁ జూపునే వృథా
యాస మటంచు నూరకొను • సంతియగా కొకవేళఁ జూపినన్
రోసి యసహ్య మూని యిసి • రోయిది సిగ్గరి యంచు నెంచి యా
కాసరమార్చుఁగాని యిది • కామకళాకుశలప్రవీణురా
లౌ సరి యంచు మెచ్చునె య•హంకృతిఁ బండితమాత్రుఁ డిద్ధరన్
వేసరి గద్యపద్యముల • వేలుఁ బఠించినఁగాని కబ్బముల్
జేసినఁగాని సత్కవులు • జెప్పినకావ్యములన్ రసంబుఁ బే
రాస గ్రహింపలేక మరి • యందలినీతులు బోధఁగాక హా
వ్యాసముఁ జెంది స్వాజ్ఞతబ•యల్పడఁ జేయుచు సత్కృతు ల్గనన్
దోసము లేనిచోటులను • దోసము లున్న వటంచు నెంచుచున్
దోసము లున్నచోటులను • దోసము లేదని సంతసింపుచున్
హాసముఁ జేసినంతనె మ•హామహుఁ డౌనె ధరిత్రి బాల్యమా
ఘాసముకు న్వచస్సులకుఁ • గాటక మున్నదె యన్న సామితన్
వాసిగ విన్నచో ననునె • భాసురసత్కవితావివేచనా
భ్యాస మనంగ నంత పయి • పైఁ బడియున్నదె యద్దియున్ జను
ర్వాసనయే సుడీ యదియు • వారును వారునుఁ జేయుభాగ్యమున్
జేసి లభించుఁ గాన పరి•శీలనఁ గల్గి గుణగ్రహీతశా
భూసుర లన్యపర్ణులును • బూజ్యులుగారె ధరాతలంబునన్.

మఱియు నీనారాయణామాత్యుని కవితయందుఁ గొన్నిదోషము లున్నవని చెప్పెడుపండితులు చేసియున్న దోషములలో శతాంశముసైత మీకవి చేసియుండలేదు. ఈతనికవిత్వము రసవంతముగను, హృదయరంజకముగను, ప్రౌఢముగను, చమత్కారముగ నుండుటయేగాక దేశ్యపదభూయిష్ఠమై కృష్టిజనులకు సంతుష్టి నిచ్చుచున్నది.

ఇట్లు

తేది 12-8-09 సం॥
మదరాస్.

బొద్దికూరపాటి- వేంకటరంగము.
ఆయుర్వేదీయ వైద్యజ్యోతిష విద్వత్కవి.





శ్రీ ర స్తు.

శ్రీ రామచంద్రాయ నమః.

# హంస వింశతి

## ప్రథమాశ్వాసము.



శ్రీరామాంశజ యైనజానకి యుర•స్సీమాంతరాత్యంతవి
స్తారప్రోజ్జ్వలహారనాయకమణీ • సందర్శితంబౌనిజా
కారంబారసి యన్యకాంత యను శం•కం జెందు నం చొంచి త
న్నారీ రత్నము నంకపీఠి నిడు సీ•తాభర్త నన్ బ్రోవుతన్. 1

చ. తన కిది కేళిసద్మమయి • తద్దయుఁ బద్దు వహించి తొల్లి లో
చనముఖహ స్తపాదయుగ•సామ్యముఁ జెంది సుగంధసంపదన్
దనరఁ దొడంగె నిప్పు డని • తా దయ మీఱఁగఁ జేతఁ బట్టెనో
యన వనజాతపాణి యగు•నట్టిమహీసుత మమ్ముఁ బ్రోవుతన్. 2

క. యమునాగంగాఝరసం, గమవిభ్రమ మాత్మ సేవ•కప్రవితతికిన్
దమరుచు లిడ నెడయక లో, కము లేలు భవానిశివుఁడు • గడు మముఁ బ్రోచున్.

ఉ. మేరునగప్రపాతమున • మించి రహించుకనన్మణిప్రభాం
కూరకదంబకం బనగ • కుంకుమగంధరసంబు భారతీ
క్రూరకుచద్వయీనిహతి • గొప్పయురంబు నడంబు జూప బొ
ల్పారు సరోజపీఠి గొలు • వయ్యెడు దేవుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 4

తే. వాణి నజురాణి ఘననీల•వేణి మధుర,వాణిఁ బల్లవసంకాశ•పాణిఁ బృథుల
సైకతశ్రోణి నాత్మలో • సన్నుతింతు, సుమధుమధురసుధావచ•స్స్ఫూర్తి కొఱకు. 5

శా. లీలాకేళికృతస్వకందుకము లై • లెక్కింపఁ గారాఁనియు
ద్వేలాత్మశ్రవణద్వయప్రచలనా•విర్భూతవాతోత్థగో
త్రాళు ల్భూమి నభోంతరాళమున నృ•త్యం బాడ నర్తించుగా
రీలీలావతిపట్టి మత్కృతికి ని•ర్విఘ్నత్వ మిచ్చుం గృపన్.

ఉ. తావకపాదపద్మములు తాడన మొక్కటి దక్క నేపనుల్
గావు మదీయపాణులకుఁ గావునఁ జూడుము వీని నంచు నీ
తావిభుమ్రోల నిల్చి ప్రమదంబునఁ జూపెడురీతి మోడ్పుకే
ల్పావనభక్తిఁ బూనెడుకృపావని పావని నెంతు నామదిన్. 7

చ. తనతనుకాంతి కాంచనకృతంబులరీతి రహించ మాయతా
శనవరభూషణౌఘములు సారెఁ గనుంగొని చేయి సాఁచి కై
కొనఁ బటుఫూత్కృతుల్ నిగుడ ఘోరఫణావళు లెత్త భీతిచా
లనము వహించునైజసతులం గని నవ్వు సుపర్ణువేఁడెదన్. 8

తే. ఆత్మఁ బ్రహ్లాదరుక్మాంగదాంబరీష, శౌనకవ్యాసశుకపరాశరవిభీష
ణార్జునవసిష్ఠపుండరీకాఖ్యభీష్మ, దాల్భ్యనారదముఖ్యులఁ దలఁతు భక్తి. 9

సీ. వాక్యనిర్జితశేషు వాల్మీకి వాల్మీకి, హరిభక్తియుక్తిధీవ్యాసు వ్యాసు
ఘనభావకాళిదాసును గాళిదాసును, జాయమాధుర్యవాచోరుఁ జోరు
దివిజేంద్రధనదవైభవభూతి భవభూతి, ధర్మబుద్ధి నవీనదండి దండిఁ
గవితాభ్రహృష్టమాధవమయూరు మయూరు, భాసురాకృతి బుష్పబాణు బాణు

తే. మానితాచారమథితాసమాఘు మాఘు, ధ్యానబద్ధమురారి మురారి గాత్ర
పటువిభారవి భారవిఁ బ్రస్తుతింతు, సర్వశబ్దార్థవిజ్ఞానసరణికొఱకు. 10

ఉ. నన్నయభట్టు శ్రీసుకవినాథుని దిక్కనసోమయాజిఁ బె
ద్దన్నను ముక్కుతిమ్మసచివాగ్రణి బమ్మెరపోతరాజు గో
రన్నను రంగనాథుని మహామహుఁ బిల్లలమఱ్ఱిపీరభ
ద్రు న్నుతియింతు నాంధ్రకవిరుద్రుల సత్కరుణాసముద్రులన్. 11

ఉ. అయ్యలరాజుఁ దిప్పసచివాగ్రణిఁ బర్వతరాజురామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుం డగుకొండధీమణిం
జయ్యనఁ దిమ్మయప్రభుని సత్కవితారచనాఢ్యులైనమా
యయ్యలరాజవంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్. 12

చ. సరసులు గద్యపద్యములచాతురికిం దల లూఁచి మెచ్చఁగా
విరసు లసూయచేఁత మఱి వేడ్క వహింపరు తేఁటిమొత్తముల్
శరదరవిందబృందఘనసారమరందసుగంధసంగ్రహ
స్ఫురణవహించుఁ గాని పురసూకరపంక్తులు చెంద నేర్చునే. 13

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవిస్మరణంబును గుకవితిరస్కరణంబునుం గావించి
తదనంతరంబ. 14

సీ. ఎవని కీరితి శుభ్రద్ధవశుభ్రద్ధరబుధ, కరిసైంధవసమిద్ధహరిణరుచిర
మెవని మేధంబు రుడ్భవకభుగ్ధవవిధూ, ద్భవమరుద్ధవగురుప్రతివిఘాతి
యెవనియీావహిమ రుగ్భవసరిద్ధవలస, ద్భువనభృత్త్రిపురభిద్భూరిమహిమ
యెవనిరూపమ్మృతభుగ్ధవసుతోడ్విద్రతీ, డుడ్విడ్భ్వదాప్తపుత్రోల్లసనము
తే. మంత్రిమాత్రుండె యతఁడు దుర్మంత్రిమంత్ర
తంత్రసంత్రాసకరణస్వతంత్రుఁ డయల
రాజవంశసుధావార్ధి రాజసూర
యార్యనారాయణామాత్యవర్యుఁ డలరు. 15

వ. వెండియు నఖండతేజఃకాండమార్తాండమండలప్రచండుండును నిజవితరణాకర్ణనకృశీభూతపారావారపునరభ్యుదయకారణానూనదానధారాప్రవాహసంజాతమహావాహినీవ్యూహుండును నిస్తులప్రశస్తసమస్తసద్గుణరత్నరత్నాకరుండును గౌండిన్యసగోత్రపవిత్రుండును గొండమాంబాగర్భవారాశిచంద్రుండును నగునయ్యలరాజు నారాయణామాత్యదేవేంద్రుండు గొండొకశుభవాసరంబున నత్యంతసంతోషితాంతఃకరణుండై.

--•••◆ షష్ఠ్యంతంబులు. ◆•••--

క. వారణభయ వారణజయ, కారణ చక్రాహతారికరవారుననుర్
నీరాకర ధారాధర, భారాజీ భాసురప్రభాపూరునకున్. 17

క. భీషణ ఖరదూషణ పరి, శోషణ సురపోషణోగ్రశోభనమతికిన్
శేషాహిప భాషాధిప, యోషాహిపరాన్యకీర్తి యోగోన్నతికిన్. 18

క. సింధుసుపుత్రీకుచధర
కంధరశుభవిగ్రహునకుఁ గమలజసురరా
ట్సింధురముఖసింధురముఖ
బంధురజాతస్తవార్హపదనివహునకున్. 19

క. తక్షక కులశిక్షక చల, పక్షకళాత్యరుణహేమపటసంభృతికిన్
దక్షాధ్వర శిక్షాకర, రక్షాచరణప్రవీణరాజద్గతికిన్. 20

క. వక్రత్రయచక్రకుచా, వక్రతనూరూపవైభవదచారునకున్
జక్రాహిత చక్రాహిత, శక్రమహాపక్రమోపసంహారునకున్. 21

క. భామాయుతకామాయిత, కోమలసుందరశరీరగురుధామునకున్
భీమరిపుస్తోమపవి, స్థేమతమస్సోమసూనుసమ శ్రీరామునకున్. 22

## కథాప్రారంభము.

వ. అంకితంబుగా రచియింపం బూనిన హంసవింశతి యనుమహాప్రబంధంబునకుఁ గథా
క్రమం బెట్టి దనిన. 23

సీ. నానాగమస్ఫూర్తిఁ • బూని హంసాళ్వస, న్మహిమంబుఁ గనుధరా•మరులు హరులు
తేజోమదంబుల • దిక్కుంభినీశుల, నురుమాడ నోపు భూవరులుఁ • గరులు
మణిచక్రములు భూరి•గుణకోటికేతువు, లలరఁగా నొప్పువై•శ్యులు రథములుఁ
బరజీవజీవనో•ద్ధరణధర్మఖ్యాతి, విలసిల్లు శూద్రులు • వీరభటులు

తే. విమలసుమనః ప్రమోదరా•గములఁ దనరి, పల్లవప్రాప్తి చేమించు•ప్రౌఢవార
వనిత లారామములుఁ గల్గి • వినుతి కెక్కు, భూమిరత్నంబు నైషధ•పురవరంబు.

క. కలితమహాబలసఖ్యో, జ్జ్వలవిక్రమనిహతవిమత•సాలోరుయశో
నలరాజభరితె మప్పుర, తిలకము సమ మనఁగ వచ్చుఁ • దేజోవతికిన్. 25

క. ఆపురము ధరాలలనా, నూపుర మై రత్నసౌధ•నూతనరుచిరా
దాఁపుర మై యభ్రంకష, గోపుర మై పొగడ నెగడుఁ • గుంభినిలోనన్. 26

వ. మఱియు నప్పట్టణంబు దివ్యసాలోచ్ఛ్రియకలితంబు గావున నాకలోకంబును మహాశు
ద్ధాంతరంగంబు గావున యోగిజనంబును నీలగవాక్షప్రబలంబు గావునఁ గిష్కింధాన
గరంబును గుంభీనసరభసంబు గావున రసాతలంబును గంధర్వప్రచురంబు గావున దే
వలోకంబును గురుకవిబుధద్విజరాజభాసమానంబు గావున గ్రహమండలంబును ననుక
రించి మత్స్యకూర్మాదిమహిమంబులు వహించి కమలాలంకృతంబులై శ్రీమహావిష్ణువుం
బురుడించుసరోవరంబులు గలిగి యొప్పు నెప్పుడు. 27

ఉ. ఆపుర మేలు మేలు భళి • యంచు నుతింప జను ల్ననవ్యయ
ద్వీపవసుంధరాస్థలి ను•దీర్ణజయాంకలిపుల్లిఖించి బా
హాపటుశక్తి నిల్పినమ•హారజతద్యుతు లొల్కుకంబము
ల్పాౘిపితశౌర్యరేఖ లయి • భాసిలఁ గానలనాముఁ డున్నతిన్. 28

తే. ప్రబలరాజాధిరాజవీ•రప్రతాప, రాజపరమేశ్వరాష్టది•గ్రాజకులమ
నోభయంకరబిరుదైక•వైభవా య, టంచు మాగధు లెంచంగ • మించు నతఁడు. 29

వ. ఇట్లు మహీశాసనంబు సేయుచు నొక్కనాఁడు. 30

ఉ. ఆతరణిప్రభుండు గొలు•వై చెలువై బలవైరి భోగసం
ప్రీతి దలిర్పఁగా నృపవ•రేణ్యులు మాన్యు లగణ్యపుణ్యసం
ఘాతు లమాత్యు లార్యు లధి•కారులు వీరులు చారు లప్పది
జ్ఞాతవిచిత్రవస్తువులు • గానుక దెచ్చినవారు కొల్వఁగన్. 31

క. ఉన్నయెడ నాల్గువేదము, లెన్నఁగఁ దగుశాస్త్రచయము • లితిహాసాదుల్
పన్నుగఁ దెలిసిన ప్రత్యు, త్పన్నమతి యనెడుపురోహి•తద్విజుఁ డెలమిన్. 32

ఉ. వచ్చి ఫలోపవీతములు • స్వస్తిచతేస్త్రీతిసూక్తి మున్నుగా
నిచ్చిన నాదరించి వశీ•యింపఁగఁ జేసి నృపాలుఁ డెంతయున్
ముచ్చటలుం బ్రసంగములు • మున్నటిరాజులచర్యలుం గథల్
చెచ్చెర నానతి మ్మనినఁ • జిత్తము రంజిల నాతఁ డత్తఱిన్. 33

ఉ. చెప్పఁ దొడంగెఁ దేనియలు • చిల్కఁగ ద్రాక్షలు రాలఁగ బ్రపుం
డిప్పలు చిమ్మ రేఁగ గడుఁ • దీయనియిక్షురసప్రపూరముల్
చిప్పిలిపర్వఁగా నమృత•శీకరము ల్వడిఁ గ్రుమ్మరింప న
ప్పప్ప యి డార యంచు జను • లందఱు నౌఁదల లూఁచి మెచ్చఁగన్. 34

తే. చెప్పుచుండంగ భామల•చిత్తవృత్తి, తెలియ బ్రహ్మకు నైనను • గొలఁది గాదు
ధాత్రిఁ జిత్రవిచిత్రంబు•దలఁచి చూడ, దాని నెఱిఁగింపు బ్రాహ్మణో•త్తమమృగాంక.

వ. అని యడిగిన నతనికిఁ బురోహితుం డిట్లనియె. 36

క. మంతులు మాయోపాయలు, బొంకులపుట్ట లతిపాప•పుంజగజంతల్
జంకెనలు సేయు యువతులు, శంకరుఁడుం దగఁడు వారి•చర్యలు దెలియన్. 37

తే. అయిన నొకకథ గలదు రా•జాగ్రగణ్య, తొల్లి పరమేశ్వరుండు సం•తోష మొదవఁ
బార్వతీదేవి కెఱిఁగించె • బాగుమీఱ, నది యెఱింగింతు వినుము నీ • వవధరించి. 38

వ. అని యిట్లనియె. 39

సీ. మంజులమాణిక్య•పుంజరంజితఘన, ప్రాకారచుంబితా•భ్రస్థలంబు
చంద్రకాంతోపల•సౌధపాండురకళా, మ్రేడితప్రాలేయ•ఘృణికరంబు
రత్నకుడ్యావళీ•రమ్యాంశుసందోహ, బహుళీకృతార్క•ప్రభాచయంబు
గంభీరపరిఘాసి•తాంభశ్ఛటాతమో, లోకీకృతాధర•లోకవితతి

తే. యామికాహతిజాతది•శాధినాథ, పురభయంకరభేరికా•భూరిదంధ
ణంధణధణధ్వనిప్రతి • నాదదాయి, గోపురం బొప్పు నుజ్జయి•నీపురంబు. 40

క. ఆపుటభేదనమునకు ది, శాపుటభేదనకఠోర•సంగరజయభే
రీపటలధణంధణుఁ డొక, భూపాలుఁడు గలఁడు చిత్ర•భోగుం డనఁగన్. 41

సీ. వెలయహరిశ్చంద్రు•విధమున నలునిపీఁ, కను బురుకుత్సుచా•డ్పునఁ బురూర
వునిలీలసగరులా•గునఁ గార్తవీర్యుమ, ర్యాదను గయుక్రియ • నంబరీషు
మతమున శశిబిందు•మహిమనంగునిఠేవఁ, బృథునిమాడ్కి మరుత్త•వృత్తిభరతు
నీతిసుహోత్రుని•భాతి భార్గవుబలె, రాముపోలిక భగీ•రథునిపోలుపు

తే. నళిబిసంగతిమాంధాత • నయమునను య, యాతికరణి దిలీపుని • యట్ల రంతి
రీతి నాచక్రవాళప • రీతభూత, ధాత్రిఁ బాలించుసవిభుండు • దద్విభుండు. 42

తే. ఆతఁ డంతిపురంబులో • హావభావ
విభ్రమవిలాసవైఖరు • ల్వి స్త్రరిల్లు
మరునిసామ్రాజ్యలక్ష్ముల • హరువుఁ జెందు
చెలులు గొలువంగఁ గొలు వుండెఁ • జెలువు మీఱ. 43

వ. ఉన్నసమయంబున. 44

సీ. పాడ వైనజిలుగుఁ గెం • జడలకీల్గంటును, నిండా రెడువిభూతి • పెండెకట్లు
వీనులపటికంపు • పింత కామాత్తులు, గనుబొమ ల్నందునఁ • గావిబొట్టు
కుచములపైఁ గావి • కుబుసంబు గళమున, వలరారు రుద్రాక్ష • హారతతులు
కేే నాగబెత్తంబు • చిన్నికృష్ణాజిన, మక్షిగోళంబుల • నంజనంబు

తే. కావివస్త్రంబు పావాలు • కక్షపాల, తామ్రకటకంబు సింగినా • దంబు గ్రోవి
పొందు సిద్ధక్రియలు చిదా • నందభూతి, యొనరఁ బూనుక నొకమహా • యోగురాలు. 45

తే. చెట్టు డిగి వచ్చినట్టులఁ • జెంత నిలువఁ, జూచి లేచి నృపుండు సం • స్తుతుల మ్రొక్కి
పీఁట వ్రేయించి కూర్చుండఁ • బెట్టి తా సు, ఖాసనాసీనుఁడై యున్న • యవసరమున.

సీ. శ్రీ రస్తు శుభ మస్తు • ధీ రస్తు విజ యోస్తు, పుత్రరంజన మస్తు • పుణ్య మస్తు
ధన మస్తు ధాన్య మా • స్త్వనవద్య సుఖ మస్తు, చిరతరసంకల్ప • సిద్ధి రస్తు
సత్య మస్తు మ హోస్తు • శౌర్య మస్తు య శోస్తు, స్వ స్త్యస్తు సుగ ణోస్తు • శ క్తి రస్తు
సామ్రాజ్య మస్తు శా • శ్వతధర్మ ఫల మస్తు, వృద్ధి రస్తు మహాప్ర • సిద్ధి రస్తు

తే. జ్ఞాన మస్తు శ్రీయుఃపతి • ధ్యాన మస్తు, గురుచరణభ క్తి రస్తు స • త్కుశల మస్తు
శాంతి రస్తు నిరంతరై • శ్వర్య మస్తు, భాగ్య మస్తు మహాసార్వ • భౌమ నీకు. 47

క. అని దీవిం చక్షతపు, ష్పనిచయము విభూతిపండ్లు • ఫలముల దివ్యాం
జనములు సిద్ధక్రియలును, దనరఁగ శివస క్తిభూమి • ధవున కొసంగెన్. 48

వ. ఇ ట్లొసంగిన వినయంబున లేచి కైకొని స్వాగతం బడిగిన సంతోషించి మనోరంజనార్థంబు ధర్మార్థకామమోక్షంబులు రాజ్యలక్షణంబులుఁ బురాణేతిహాసంబులుఁ గొన్ని లోకాభిరామంబులు ననాగతవర్తమానంబులు నుచితానుచితకథాస్వారస్యంబులుఁ దెలిపిన విని మహాత్మురాలా మీరు వినని కనని కార్యంబులు ముల్లోకంబుల నెవ్వియు లే వైన నొక్కటి యడిగెద నానతి మ్మని యి ట్లనియె. 49

క. ఏయేభూములఁ జూచితి, వేయేరాజ్యములఁ గలవు • శృంగారకళా
ప్రాయ లగురూపరేఖా, శ్రీయుతి గలకన్నె లనిన • శివస క్తి యనెన్. 50

మ. మది రంజిల్లఁగఁ జెప్పెద న్వినుము ప్రేమన్ సచ్చిదానందసం
పదచేతం గరజం బలంబుగతిఁ గన్పట్టున్ ధరాధీశ యీ
యుదయాస్తాచల సేతుశీతనగమధ్యోద్యద్ధరాచక్ర మిం
పొదవన్ దేశములందు నుండుదురు విద్యుద్వల్లికాభాంగనల్. 51
ఉ. డెబ్బదిరెండుపాళెములు • తీవిఁ దలిర్చు సమస్తదుర్గముల్
జొబ్బిలు కల్మిఁ బట్నములు • జొక్కపుఁ బేటలుఁ బాతకంబు పోఁ
ద్రొబ్బెడులీలఁ జాత్రిపతు ల్గనఁగొంటిని నుండు రందులన్
సిబ్బెపునిబ్బరంపుబిగిఁ • జిక్కని చక్కనిగుబ్బ గుబ్బెతల్. 52
క. వెలనాడు వేగినాడును, బులుగులనా డ్పాకనాడు • పొత్తపునాడున్
గలమురికినాడు రేనా, డలముక గనుఁగొంటి నచటి • యబలలఁ గంటిన్. 53
సీ. లాట కర్ణాట మరాట పఘాటులఁ, బాండ్య పౌండ్ర విదర్భ • పద్మముఖుల
బంగాళ వంగ కళింగ లతాంగులఁ, గుకురు కేరళ కురు • కోక కుచల
మళయాళ నేపాళ • మాళవ యువతుల, మత్స్య వత్స కరూశ • మానవతుల
గోన లాంధ్ర వరాట • కుంతల స్త్రీ లగు, పాంచాల బర్బర • భామినులను
తే. ద్రవిళ గాంధార కాశ్మీర • ధరణిసతుల, మగధ కొంకణ టెంకణ • మానినులను
మఱియుఁ దక్కినధారుణీమండలములఁ, దనరు చెలువలఁ జూచితి • ధరణినాథ.
తే. రాజవశ్యౌషధాకృతుల్ • రమ్యతరర, తిస్వరూపలు మోహనదివ్యమూర్తు
లతులతరకామమంత్రదేవతలు వీర, లనఁగ నుందురు సుందరు • లచట నచట. 55
ఉ. ఈనవఖండమండలమహీస్థలి నెల్లఁ గనంగ దేవనే
నీనగరీలలామమున • నెంతయు రేఖఁ జెలంగు మన్మథా
ధీనసుమోహనాకృతిరతి న్నగుమి న్నగుసొగసు గల్గు సా
తానిబిడప్రసూనధళధాళధళీతరళాక్షిఁ జూచితిన్. 56
తే. దానిప్రియనాయకుఁడు విష్ణుదాసుఁ డనెడు
పేరు గలవాఁడు కలవాఁడు • పెద్దవాఁడు
హేమవతి యన దనరు నయ్యింతిఁ బొగడఁ
దరమె బ్రహ్మకు నైన శంకరున కైన. 57
ఉ. ఆమధురాధరాధరకచాళికనద్ఘననైగనిగ్యమా
యామృదులోరుసారరుచిరాంబురుహోత్తులధాళధళ్యమా
యా మెఱుఁగారు బోడిజిగి • యబ్బెడుగుబ్బల చాకచక్యమా
యే మని చెప్పవచ్చు జగతీశ్వర శాశ్వతరూపసంపదల్. 58

క. దానిజిగి దానిపలుకును, దానితనుద్యుతులసొంపు • దానివిధంబున్
దానివగ దానియందము, మానవవరమరుఁడు గన్న • మగ్నుఁడు గాఁడే. 59

క. వగ లొలుకు ధాగధగ్యపు, జిగి గుల్కెడు నుబ్బుగిబ్బ•సిబ్బెపుగుబ్బల్
నిగనిగలు గులుకు కొప్పును, సొగసుం దెలికనులు దాని•సొమ్మై పరఁగున్. 60

ఉ. విండ్లకు మేల్తరంబు ఘన•వేణి కనుంబొమదోయి బంగరుం
గిండ్లకు మేటి సాటి తుల•కించు చనుంగవ లేఁతతమ్మిపూఁ
దూండ్లకు మిన్న యన్న జిగి • దొల్కెడుచేతులు లోకమందుఁ బూ
బోండ్లను గానమో వినమొ • పోలరు తత్సతికాలిగోరునన్. 61

సీ. కబరీభరమునకుఁ • గందంబు సెల్లును, త్పలమాలికలు నేత్ర•ములకుఁ జెల్లుఁ
గర్ణంబులకును మం•గళమహాశ్రీ సెల్లు, గాత్రంబునకుఁ జంప•కంబు చెల్లు
మధురవాగ్వృత్తికి • మత్తకోకిల సెల్లుఁ, జనుగుబ్బగవకు మం•జరియుఁ జెల్లు
బిరుదైనపిఱుఁదుకుఁ • బృథివివృత్తము చెల్లు, మధ్యంబునకుఁ దను•మధ్య జెల్లుఁ
తే. శాదముల కంబుజము చెల్లుఁ • బరఁగు నడకు, దనరు మత్తేభవిక్రీడి•తంబు సెల్లుఁ
గృతులవర్ణింపఁ దగు తదా•కృతులె కృతులు,వాంఛచే దానిఁ బొందిన•వాఁ డెసుకృతి.

తే. చండదోర్దండమండిత•మండలాగ్ర, ఖండితోద్దండరిపుకాండ•ఖండనమునఁ
బండితుం డగురాజవే•దండమునకుఁ, గాక యొకపాటివాని కాఁ•కన్నె తగునె. 63

ఉ. సౌరభ మొందు కాంచనపు•జంత్రపుపుత్రిక వాగ్విలాసము
ల్వారక నేర్చు రత్నపుస•లాకతిరం బగురూపుఁ జెందు తొ
ల్కారుమెఱుంగు జీవకళఁ • గాంచినచిత్తరుబొమ్మయాన శృం
గారిణి యా సుధాసరసిఁ • గా నతిసేయుఁగ వచ్చు నచ్చెలిన్. 64

క. అని సిద్ధురాలు సెప్పినఁ, బొనపానఁగా భ్రమలు చెందఁ • బులకలు వొడమెన్
మనసిజశిఖి యొనసినచోఁ, గనుపడు ధూమాంకురముల•గతి నృపుమేనన్. 65

క, అంతట సిద్ధాంగన యా, ద్యంతంబును జెప్పి తనమ•హాశ్రమ మహికిన్
సంతోషంబునఁ జనె భూ, కాంతుఁడు హేమవతిమీఁది•కాంక్ష జనింపన్. 66

మ. కరుణాదృష్టులు నాగవాసముల సోఁ•కం జూచి వేడ్కన్ మనో
హరము ల్కోకలు రూకలు న్మణులు హా•రాలంకృతిస్తోమము
ల్సరసత్వంబున నిచ్చి పంచి కొలువున్ • జాలించి తాఁ బోయె భూ
పరతీసుండు మనంబు హేమవతిపై • బాలిన్ దువాళింపఁగన్. 67

క. మిన్నందు సౌధవీధిన, మున్నత మగుమేలు మచ్చు • లొప్పెడుచోట
న్నిన్నగుచిత్తరువులచేఁ, బన్నుగఁ దగు నొకరహస్య•భవనము పజ్జన్. 68

చ. అకలుషదివ్యరత్నమయ • మా నొకకేళిగృహంబులోపలం
జికిలికిరీటిపచ్చలర•చించినచిల్కలకోర్లనంద మా
సకినెలపట్టిమంచమున • చాయనఖాసుతివాసిపైఁ దురం
గిక మొకమాలులేపున నొ•గిక్ శయనించి మనోభవవ్యథన్. 69

క. ప్రీతిని హేమావతిపయి, సాతీసున మనసు నిలిపి • యతివిరహార్తిం
జేతోజాతధనుర్భవ, శాతశరవ్రాతసార•చకితాత్మకుఁ డై. 70

క. ఉలుకు స్వోన్నెలవేఁడిమి, కళుకు న్శుకపికమిళింద•హంసార్భటికిన్
బెళుకు న్మలయానిలునకు, జెళుకుం బూపాన్పునందుఁ • జిరవిరహార్తిన్. 71

ఉ. చెక్కిటఁ జేయి చేర్చుకొని • చింతిలు నుస్సురటంచుఁ జూపులన్
వెక్కస మంది లేమ యెల•విం బొడఁగట్టినయట్లు నుండఁగా
నక్కనఁ జేర్పఁ బోవుభ్రమ • మంది వెసం దలయూఁచు నంతలోఁ
బక్కున నవ్వు నింతిపయి • శాళి నృపాలకమౌళి ఖిన్నతన్. 72

వ. మఱియు నారాజు విరహంబు తాపాతిశయకరంబు గావున నిదాఘంబును విరళీకృతాశ్వాసంబు గావున సత్పరిబంధంబును విచ్ఛిన్నాలంకారంబు గావున యవనవివాహంబును నిమీలితతారకంబు గావున నహర్ముఖంబును విప్రలాపముఖరంబు గావున సాయంకాలంబును ననుకరించె నప్పుడు. 73

క. అటువలె నృపనిటలాక్షుఁడు, పటుతరవిరహంబుఁ జెంది • బాధ పడంగా
నటనమున హేల యనియెడు, కుటిలాలక వచ్చెఁ దెలివిఁ • గొనఁ జేయుటకున్. 74

శా. పన్నీట న్నయనంబు లొత్తెఁ దనువుం • బాటీరపంకంబుతోఁ
జెన్నారం బద నిచ్చి గీరి సిగ లే•సెన్ దాయెతు ల్సుట్టె జీ
న్నొన్నాపట్టెరుమాలుగట్టె జరతా•చుట్టంచు డాల్మించు మే
ల్మి న్నానన్నపుదుప్పటంబు దగ హా•ళిం గప్పె సొం పారఁగన్. 75

వ. ఇట్లుపచారంబులఁ గొంతదాపంబు శాంతం బొనరించి నృపాలునకు హేల యిట్లనియె. 76

ఉ. స్వామి పరాకు నీమదికి • సమ్మతి యాపని యేమి చెప్పమా
ప్రేమ దలిర్ప నేర్ప దల•పింప నదెంతటికార్యమైన నే
నేమతి తీర్చి నీకుఁ గల•నెంజిలిఁ బాపెదఁ జూడు మన్న సా
శ్రీమహనీయవైభవుఁడు • శీతకరాస్యకు హేల కిట్లనున్. 77

తే. సిద్ధురాలు హేమావతీ•సితకరాస్య
వలపురేఖాతిశయవైభ•వమును దెల్ప

వినఁగ నగుమోహమునసైన • వెతను మాన్ప
కరుణ నను జేర్చి యమ్మచ్చ•కంటిఁ గూర్చి. 78

క. అని చీనీచీనాంబర, ఘనమణిహారములు మేలు • కాల్కడియంబు
ల్గొనబుక్ మెఱుఁగుంగరములు, చను వమరఁగ నిచ్చి పనుప • సముచితరీతిన్. 79

ఉ. పూని ముదంబు లుప్పతిల • భూవరముఖ్యునిచేత వీడుకో
లై నవరత్నకీలితమ•హారజతోన్నతదివ్యదీధితి
శ్రీనిధు లెల్ల దిక్కులవి•శించుచు మించినవిష్ణుదాసు స
న్మానితగేహసీమకుసు•మాళముతోఁ జనె హేలహేలలన్. 80

సీ. కస్తూరి వీణలుఁ • గపురంపు లప్పలు, నిండినగృహములు • నెరయఁదాఁటి
కుంకుమాగరుఖండ•సంకుముదంబులు, గలుగుబిడారులు • గడచిపోయి
గాళము ల్పచ్చాకు • కచ్చూరములు చాల, నించిన కొట్టడి•ల్మించియేగి
పునుఁగుచట్టంబులు • బుక్కారజంబులు, పొంకమౌ మళిగల•పొంతఁ దరలి
తే. చూచె నొకదివ్యరత్నని•స్తులగృహంబు, నందు హేమావతీకన్య • నలువ ధన్య
వరలసొంపుల టెంకిజ•వాదివంకి, జాతిరతిలీల నారాజ•దూతిహేల. 81

వ. ఇట్లు తన్నుఁ జేరవచ్చినరాజదూతిం గనుంగొని మహారాజు మన్నలమనియెడు పడంతుక యని రత్నంపుగద్దియపై వసియింపం జేసి స్వాగతం బడిగిన నబ్బాలకు హేల యి ట్లనియె. 82

క. నీచాతుర్యము నీవా, చాచిత్రపటుత్వరూప•సంపద లెపుడు
న్నీచుట్టంబులు సెప్పఁగ, జూచెద నని వచ్చినాను • సుదతీ నిన్నున్. 83

ఉ. చక్కనివారిలో మిగులఁ • జక్కనిదాన వటంచు వేడ్కతోఁ
జొక్కుచుఁ జెప్పి రందులకుఁ • జూచినయందుకు నామనోరథం
బక్కట సిద్ధ మయ్యె ఫల • మబ్బెను హా యిటులుండ వద్దె యో
చక్కెరబొమ్మ యంచు సర•సప్రతిభావల నిచ్చగింపుచున్. 84

సీ. దీనచకోరాళి•తృష్ణదీర్పఁగదమ్మ, భామనీవదనచం•ద్రామృతంబు
బీదబర్హిణముల • నాదరించఁగదమ్మ, మెలఁత నీవేణికా•మేఘపంక్తి
ఘనదరిద్రపికాళిఁ • దనియఁ జేయఁగదమ్మ, చెలియ నీవాతెఱ•చివురుడంబు
బడుగుజక్కవల నిం•పరఁ బ్రోచుఁ గదవమ్మ, ముగుద నీచనుదమ్మి • మొగ్గదోయి
తే. పేదహిందోళసందోహ•మీదునమ్మ, నీవచోబృందమకరంద•నిర్ఝరంబు
లిట్టిపస మిసి జిగిబిగి • యీవిధంబు, ప్రణుతి సేయ్యంగఁ దర మౌ యీ•బ్రహ్మకైన. 85

క. ఇదిగాక యత్తమామల, ముద మొదవఁగ బంధుసంఘ • ములదా నీదా
సదళంబుల బహువిశ్వా, సపయల నీరీతి మనుచు • సతులం గానన్. 86
వ. అని యిత్తెఱంగున. 87
ఆ. దాసియత్తతోడఁ • దగు మామతో బంధు, దాసజనముతోడఁ • దగిన మైత్రిఁ
గూడి యాడుచుండి • కొన్ని దినంబులు, చన్న పిదప నొంటి • నున్న వేళ. 88
ఉ. ఒక్కసుధాంశురత్నరుచి•రోన్నతవేదికమీఁద నిద్దఱుక్
మక్కువమీఱ నుండి యను•మానముతో నొకకొంతఁ గొంకికొం
చక్కట నీ కొకందులకు • నచ్చికలేక మెలంగ విష్ణుదా
సెక్కడిభర్తఁ గాఁగ సృజి•యించె నజుం డని పేల నవ్వుచున్. 89
క. ఈరూప మీపటుత్వం, బీరేఖావైభవంబు • లీసెఱప్రాయం
బీరసికత నీకును మఱి, మారాజున కగును నితర•మనుజుల కగునే. 90
సీ. కలికి నీసిబ్బెంపు•గబ్బిగుబ్బలు వాని, గడుసుచేతులఁ బట్టి • కలఁచ దగునె
కాంతరో నీతావి•కావిమోవిటు వాని, కొక్కిదంతంబుల • నొక్కఁ దగునె
చెలువ నీజిగిగోము • గలమోము మఱివాని, తొట్టినోరునముద్దు• వెట్టఁ దగునె
సుదతి నీకనకంపు•సొంపుదేహము వాని, కఱుకుమేనునఁ జేర్చి • కలయఁ దగునె
తే. కులుకుశృంగారరసములు • చిలుకఁగీలు, బొమ్మవలె నీటు గలదాన•వమ్మ నీవు
మర్కటమువంటివాఁడు నీ•మగఁడు సూడ,వానితోఁ గూడి రతికేళిఁ • బూను టెట్లు.
క. నీవంటిరూపవతికిని, నీవంటిప్రియుండు గలుగ • నిర్మింపక హా
యీవిధిని దగుఁ జేసిన, యావిధి నిటుమూర నింక • నగుఫల మేమీ. 92
తే. అయిన మగఁ డెంతనీటుకాఁ • డైన నేమి, ప్రాణపద మైనచాశితి•బంధగతుల
నింపు సొంపును జూచి చొ•క్కింపఁ దగునె,రతికిఁ జొచ్చినతఱి మాన•వతుల కపుడు.
ఉ. కేరఁగరాదు నవ్వి గిలి•గింతలు వెట్టఁగరాదు చెక్కులం
జీరఁగరాదు గుబ్బలు ఖ•చిక్కునఁ గ్రుమ్మగరాదు కేళిలో
మీరఁగరాదు పైకొని ర•మింపఁగరాదు గళారవంబు లిం
పారఁగ సల్పరాదు మది•రాక్షులు భర్తలఁ గూడువేళలన్. 94
వ. అదియునుంగాక. 95
క. పదివేలమదను లొక్కట, నుదయించినలీల మెఱయు • సుగుణుఁడు సుమీ
మదిరాక్షి చిత్రభోగుఁడు, మదిఁ గోరెను నీదుభాగ్య•మహి మెట్టిదియో. 96
సీ. కువలయానందంబు • గూర్చి యేలు ఘనుండు, విబుధులఁ బ్రోచు సం•ద్వితరణుండు
సర్వజ్ఞమౌళిభూ•షణ మైనధన్యుండు, లలితవిభ్రమరూప•లక్షణుండు

సరవికళల్నించు • శ్యామాభిరాముండు, వఱలెడు సన్మార్గ•వర్తనుండు
విష్ణుపదార్చిత•విహితశుభ్రకరుండు, శమితతమోహారి•యమితశీలుఁ

తే. డమ్మహారాజచంద్రుఁ డా•యననిజాంత, రంగమంతయు నినుఁ జేర్చి • రమణతోడ
నేలఁ గలఁ డమ్మ నీపుణ్య • మెనఁగె నమ్మ, తమిని నీడేర్చవమ్మ కుం•దనపుబొమ్మ. 97

వ. అనిన విని సంభ్రమభయవిస్మయలజ్జాహాసకాంక్షలు మనంబునం బెనంగొన నమ్రము
ఖి యై హేమావతి రాజదూతి కిట్లనియె. 98

ఉ. అమ్మకచెల్ల యిట్టిపలు • కాడుదురే మఱియుత్తమామలుం
గ్రమ్మి తలారులై మెలఁగఁ • గా మగఁడుం బులికీలిఁ దెంపుగా
బమ్మెర రొప్పచుండఁగను • బాంధవులెల్లను గాచి యుండఁగాఁ
గొమ్మరొ యిట్టికార్య మొనఁ•గూడునె కూడిన హాని చెందదే. 99

తే. అనిన హేమావతికి నిట్టు • లనియె హేల, యీపటికి నేఁటిప్రాయంపు•టేపు గలదె
మోహ మెక్కొనఁ జక్కని•ముద్దుజాణ, యొకనిబిగి కౌఁగిటను జేర్చి • యుండవలయు.

క. ఎక్కడిమగఁ డెక్కడిసఖు, లెక్కడినీయుత్తమాము • లెక్కడిచుట్టా
లిక్కాలఁది దొడ్డ కొంచెము, లెక్కింపకు మహనిహా•లిం బడువేళన్. 101

సీ. కోటగోడలనైన • మీటుగా నెగఁబ్రాకి, దాఁటనేర నిదేటి • తలిరుఁబోఁడి
ఘుమఘుమార్భటితోడ • ఘోషించునదులైన, నీవిపోవ నిదేటి • యెమ్మెలాఁడి
తనమీఁదితప్పు నొ•క్కనిమీఁద నిజముగాఁ, బెట్టనేర నిదేటి • బిసరుహాక్షి
ధవుఁ డైనఁ దనజాడ • తగఁ గనిపట్టిన, నిర్వహింప నిదేటి • నీటుకత్తె

తే. తలవరులు గన్నచో లేని•తాల్మిఁ బూని
బొంకు తథ్యంబు తథ్యంబు • బొంకుఁ గాఁగ
నెంచి యుపనాథుతోడఁ గ్రీ•డించి మించి
చక్కటికిఁ దేని దది యేటి • సరసురాలు. 102

వ. అని మఱిమఱియు బోధింప నంగంబు పులకాంకురానుషంగంబునుగా నిజాంతరంగం
బునం బొడము వ్రీడాభరం బుడిపికొని దరస్మితానతముఖాంబుజయై యెట్టకేలకుఁ
జెవి యొగ్గిన నగ్గజరాజగామినిం బాసి తనరాక కెదురుచూచుచున్న రాజసన్నిధికిం
జని తాఁ బోయివచ్చినకార్యం బెఱింగించె నంతట దైవయోగంబున విష్ణుదాసునకు
దూరప్రయాణంబు సంభవించె నంత. 103

తే. పయనమున కైనయవి యమ•ర్పంగ నపుడు, పరిచరుల కానతిచ్చినఁ • బటకుటీర
పాత్రసామగ్రి మొదలైన • బరువులెల్ల, శకటవామ్యశ్వవృషమహో•ష్ట్రములకెత్తి.

వ. మఱియుం గలమాన్నంబులుం గలవంటకంబులుఁ బొంగలి పులిహోగిరంబు దధ్యోదనంబు నానవాలు జున్నులు మీఁగడ పెరుగులు నవనీతంపుసుటీకలునోలుపుఁ బప్పునప్పడంబులు వడియంబులుఁ బెరుఁగువడియంబులు మిరియంపుఁబొడి మెంతికూటువ సంబారంబుఁజింతపండులు బజ్జులు సిరికలుఁ బచ్చళ్లూరు బిండ్లూరుఁగాయలు మామిడితొక్కులు నివి మొదలుగాఁ గలపరికరంబులును మఱియు వడపప్పు బేడలు వేపుళ్లు ననుపగుగ్గిళ్లు బొబుగులు బొదులుఁ బాకపుఁజలిమిడికాయమ్ములుం జిమ్మిలుంటలు నటుకులు మూగలు లాజలుఁ బేలాలుఁ జిటికాలుకులు నువ్వులు నానబియ్యంబులుఁ బేలపిండిఁ బ్రేలసత్తు దోసగింజలు వెల్లగిసెలు గోఁగుబు గరింగరుము లుప్పిళ్లు సెనగపప్పు బొబుగుపప్పు సారపప్పు జీడిపప్పు బాదంగిపలుకులు గొబ్బెర గసగసాలు ఖర్జూరములు ద్రాక్షలాది యైనఫలహారంబులును మఱియు నుండ్రంబులు మండెఁగలుఁ గుడుములు దోసెలు వీసెలు రొట్టెలు నిప్పట్లప్పంబు లతిరసంబులు సుకియ లమృతకలశమ్ములు సోగులుఁ జక్కెరబుగడలుఁ గరిజలుఁ బొరివిళంగాయలుఁ దేమనంబును బాలకాయలుఁ జక్కిలమ్ములు మినుపచక్కిలమ్ములు మినుపపోకలు మనోహరంబులు గారెలు బూరెలు మోరుండ లంగరొల్లెలు మణుఁగుఁబువ్వులుం బేణీలు నీరువత్తిగెలు మడతలుఁ బప్పుబూరెలు సజ్జబూరెలు వడ లామవడ లొబ్బట్లు సారసత్తులు సేవలుఁ జిరిమిళ్లు సరడాలుఁ బరిడగవ్వలుఁ జాపట్లు నిడ్డెన తేనెతొలలు బురుగులు నేలఁకికాయలు వెన్న మెఱుంగులు నిడికుడకలు సడకుడకలు ముత్తెపుఁజిప్పలుఁ జంద్రకాంతలుఁ గరిజకాయలు బెడదలు లడ్వాలుఁ గోడబళ్లు గూడుపరిగెలుఁ దెలుపరిగెలుఁ బూరీలు గూళ్ళాపిడ లాదిగాఁ గలభక్ష్యంబులు గూడల నించి జాతిసాతానులు గావళ్లంబూని వెంటనంటిరా నప్పుడు. 105

తే. తనకు నిలువేల్పు లౌతల్లిదండ్రులకును, భక్తితో మ్రొక్కి తనప్రాణపదమునైన
భార్యతోఁ దెల్ప నక్కనఁ బట్టి చేర్చ, యాఘాటియు నధికదైన్యాస్య యగుచు.

ఉ. ఓమగరాజ నీవు చన నొంటిగ నే నిట నుండ నేర్తునే
నామది చూడఁ గోరి యిటు నన్నలయించెద వంచు బాష్పధా
రామిళితాక్షి యై ఘనతరం బగుశోకముఁ జెంద విష్ణుదా
సామధురోక్తి నూరడిలు మంచు ముదంబునఁ గుస్తరింపఁగన్. 107

సీ. నీతావికెమ్మావి నిలుచుఁ బో కంచివా, ల్గంటులమొనపంటిఁగంటి గురుతు
నీవాలుఁగన్నుల నెఱయుఁ బో నెల్లూరి, కొమ్మలకపురంపుఁదమ్మరసము
నీచెక్కులరహించుఁ బో చెన్నపట్నంపు, వారిజేక్షణలక్రొవ్వాడిగోరు
నీయురస్థలిమించుఁ బో యఖిలక్ష్మా, కోమలాంగులకుచకుంకుమంబు

తే. లింటనె మెలంగువారల • కీసుఖంబు, లెటులఁ జేకూరు నని పల్కి • హితముఁ జిల్కి
పోయి రమ్మని మోముమో•మున ఘటించి, చుంబన మొనర్చి పనిచె న•య్యంబుజాక్షి.
వ. అంత. 109
తే. మణిఖచితహేమపంజర•మధ్యమమునఁ
ప్రేమ నాబాల్యముగఁ దాను • బెంచినట్టి
హంసరాజంబుఁ గదియంగ • సరిగి తనదు
పయన మెఱిఁగించి యింటిలో • భద్ర మనుచు. 110
క. చెప్పంగఁ దగినమాటలు, సెప్పి మరాళంబు వనుపఁ • జిత్తంబున సొం
పుప్పతిల నిల్లు వెలువడి, యప్పగిదిన్ విష్ణుదాసుఁ • డరిగెడువేళన్. 111
తే. ఈడమువళందబందర•యింగిలీషు, కళము మొదలయిన పేటల • గౌరలెల్ల
సౌరభద్రవ్యములు చేర•సార మాడఁ, బిలువ నంపిరి తమతమ• పేటలకును. 112
చ. అటువలె విష్ణుదాసుఁడు హి•తావళి గొల్వఁగఁ దోడచేర మం
దుటకుఁ జనంగ హేమవతి•తోడనె శంబరవైరి శాతవి
స్ఫుటచటులోగ్రపంకరుహ•సూనసపీనశరప్రజంబు హృ
త్పుటమున గాఁడ నేయ నృప•పుంగవుఁ జేరఁగఁ గోరి యున్నెడన్. 113
చ. విలసితమోహదాహపరి•వేదనపొ మ్మని యెత్తి పెట్టఁగా
వలపులవింటివాఁడు నెఱి•వాదితనంబునఁ ద్రోవఁ జూపఁగా
నలమినభీతి లజ్జ వల•దం చరికట్టఁగ నింతి నంతలో
జలజహితుండు గ్రుంకె నల • చాన వెత ల్గనలేనికైవడిన్. 114
వ. అయ్యవసరంబున. 115
తే. తరణితురగఖురోద్ధూత•చరమశైల, గైరికస్థలపాంసువుల్ • గప్పె ననఁగ
బశ్చిమంబునఁ గుంకుమ•పంక మటుల, సాంధ్యరాగంబు మించె ని•స్తంద్ర మగుచు.
ఉ. కాలకళావమాళి దిన•కాంతిహసంతికలోన యామినీ
బాలకు సొమ్ము నేయుటకు • భాస్కరుఁడన్ కనకంబు గ్రాఁచి క
ల్లోలవతీవశాంతరము•లో నిడఁ దోఁచినధూమమన్ తమో
జాలము పర్వె నారవల•చాడ్పునఁ దారలు వొల్చె నెంతయున్. 117
క. అప్పుడు హేమావతి తమి, ముప్పిరిగొని చిత్రభోగ•భూపాలునితో
నప్పుష్పబాణుకదనము, చొప్పడ నొనరించువాంఛ • సొర దమకమునన్. 118
చ. పరగెడురస్తుకొట్టడులు • భద్రముగా నొగి బీగముద్రలున్
గరిమ నొనర్చి తొత్తులకు • గ్రాస మొసంగి నికాయ్యకృత్యముల్

దరలించి యత్తమామలప•దంబుల నొత్తుచు నిద్ర వుచ్చి మై
మెఱుపుగ శీతలాంబువుల • మిన్నగ మజ్జన మాడి వేడుకన్. 119

సీ. మెఱుఁగుఁగుచ్చెలమీఁద • జరతాబు పనిమీఱు, చెంగావిరంగారు•చీరఁ గట్టి
గుజరాతి జిగిపిస్తు•గోట్లదాఁపినడాలు, రహిమించు పైఠణీ•రవికఁ దొడిగి
ఘుమ్ముఘుమ్మనితావి•గ్రమ్ముచో కాటంపుఁ,గలపంబు సొగసుగాఁ • గలయ నలఁది
తళుకుతళుక్కనఁ గాంతి•చిలుకఁ గుల్కెడుజాతి, మణిభూషణంబులు•మమతఁ దాల్చి
తే. తిలక మొగిఁ దీర్చి మితభుక్తి • సలిపి వెంట
బూమె లెఱుఁగని యొకపాటి•బుడుతయాను
మడుపు లందీయ మోహంబు • మరులు గొల్ప
వెడలె నలభామ నిజకేళి•వేశ్మసీమ. 120

వ. అటుల వెలువడి. 121

తే. తనదుప్రాణంబు దైవంబు • తల్లితండ్రి, యనుచు చెలి యైననలరాజ•హంస మున్న
దివ్యనవరత్నఖచితదే•దీప్యమాన, కనకపంజర మొక్కెంత • గదిసి నిలిచె. 122

చ. నిలిచి దరస్మితం బయిన•నెమ్మొగ మించుక వంచి యాత్మఁ దాఁ
దలఁచినకార్య మెల్లఁ బ్రమ•నంబునఁ దిన్ననికల్కిపల్కులం
దెలిపినరాజహంస సుద•తీమణిఁ గన్గొని పక్షయుగ్మముం
దలఁ గదిలించి యందుసమ•నంబునఁ జింతిలి యప్పు డిట్లనున్. 123

ఉ. అక్కట భర్తఁ గాపురము • నారడి పుచ్చి నృపాలమౌళితోఁ
జొక్కి రమించు నందులకుఁ • జొచ్చినఁ దావకబంధువర్గముల్
దక్కవ నేతురమ్మ చరి•తవ్రతముల్ సెడునమ్మ జాతికిం
బక్కన నిందఁ జెంది తల•వంపులు దెత్తురటమ్మ మానినీ. 124

సీ. అత్తమామలు గన్న • నారడివుత్తురు, బావ పరీక్షింప • నేవగించు
మఱఁదులు గాంచిన • గఱకటి నెంతురు, వదినె లెఱింగిన • వాసి చెడును
బంధువుల్ గనినచోఁ • బరఁగ నిందింతురు, తోడికోడలు చూడ • నాడికొనును
బతి గనుఁగొన్నచోఁ • బ్రాణహాని యొనర్చు, వాడవా రెరిగిన • వన్నె దఱుగు
తే. నరయ నివిగాక యున్నిట • నాడుపుట్టు, పుట్టఁ బాపంబు పుట్టినఁ • బుట్టినింటి
కేని మఱి సొచ్చి నింటికిఁ • గీర్తి ఘనత, దేక యపకీర్తి దెత్తురే • తెఱవ లెచట.

క. అగుఁ బ్రాణహాని యపసిరి, యగణిత మగుమానభంగ • మహహా తెలిసెన్
దిగుపదమై యింద్రపదవి యనఁ, దగు బుద్ధి జనింపఁబోలుఁ • దరుణీ నీకున్. 126

సీ. పంక్తికంఠునిమోహ•పరితాప మొంచెనే, భువనమాతజగత్ప్రి•పూతసీత
యలపుళిందునిబొంద • నాసక్తిఁ జెందెనే, ప్రియహితామితనయ•భీమతనయ
నహుషునివిరహంపుఁ • దహతహ ల్బాచెనే, సాంద్రసద్గుణచర్య•యింద్రుభార్య
మఱిసింహబలునిపె•న్మాయలఁ జిక్కెనే, యారడిపనిఁ బూని • యాజ్ఞసేని
తే. మునుపటిపతివ్రతలు మహా•మూర్ఖచిత్తు, లైనదుర్జను లతిఘోర•సూనసాయ
కాస్త్రనిర్జర్ఝరితాత్ములై • యాసపడిన, మాన ముడిపుచ్చుకొనిరఁటే • మచ్చకంటి.
చ. పతిహితభక్తిచే వెలయు • పద్మదళప్రతిమాననేత్రకున్
వ్రతములసోద లేటికి ధ్రు•వంబుగఁ బుణ్యము లబ్బు నెప్పుడుం
బతిని దిరస్కరించి పర•భర్తలఁ జెందినభామపుణ్యము
ల్గతజలసేతుబంధములు • గావె వచింపఁగ నెంతనోచినన్. 128
క. లలిజాగ్రత్స్వప్నసుషు, ప్తులను మనోవాక్శరీర•ములచే సేవే
శల నైనసతులు పరపురు, షులఁ గోరినవన్నెలేదు • సూవె ధరిత్రిన్. 129
క. పతిసేవయె భూషణములు, పతిసేవయె జీవనంబు • భామామణికిం
బతిసేవయె సువ్రతములు, పతిసేవయె యిహముఁ బరము • భాగ్యము లనుచున్. 130
క. ఈరీతి హంసపలికిన, నారీమణిచెవుల నవియు • నారాచములై
దూరి చుఱుక్కన నాఁటినఁ, గ్రూరకటాక్షములఁ గ్రేటు•కొని తనుఁజూడన్. 131
వ. అత్తెఱవచిత్తం బెఱింగి మరాళం బక్కటా యిత్తరుణి దుష్కర్మాయత్తం బరాయత్తచిత్తవృత్తి యయ్యె నిట్లగుట మదీరితసునీతివాక్యంబులు దీనికిం బరుషంబులై తోఁచుచున్నవి సమదమదనప్రదరవేదనాదోధూయమానం బైన దీనిమానసంబు సామంబునం గాని చక్కంబడ దని కొంతదడ పంతరంగంబున జింతించి వెండియు నారాజహంసంబు హంసగమన కిట్లనియె. 132
తే. మానవతి నీవు పరసంగ•మమున కాస, పడఁ దలంచితివేనిఁ జే•పట్టు కొంచె
మైనచక్కనియొకయంద•గానితోడఁ, గూడి యాడక రాజులఁ • గోరఁ దగునె. 133
మ. అధిపు ల్క్రూరఫణిస్వరూపు లధరం • బాసించు టేరీతి భూ
మిధవు ల్కాలకరాళకీలిసదృశు • ల్మేన్మైనఁ బొందించు టె
ట్ల ధరాధీశులు మత్తదంతిసము లే•లా నీకుఁ జెల్లాట మా
డ ధరాభృత్కుచ యిత్తెఱం గెఱిఁగి వే•డ్కం గోర్కు లీడేర్చుకో. 134
క. ఇలపతుల చిత్తవృత్తులు, గలయికలం దెలిసి మెలఁగు • కాంతల కెలమిం
జెలు వొనరు జయము చేకురు, నలఘుశ్రీసౌఖ్య మబ్బు • నంబుజగంధీ. 135

వ. అట్లు గావున నిత్తెఱంగునఁ దత్తరంబులేక నృపవరోత్తముల చిత్తవృత్తి దెలిసి వత్తు
కొన వర్తిల్లు మని హంసంబు ప్రత్యుత్తరం బిచ్చు నవసరంబున. 136

సీ. పిసవెట్టి కసరెత్తి • యసరేఁగు నసగూఁటి, పూబోండ్లు తమయిండ్ల•పొంత కరుగఁ
బసపొమ్ములకు నిమ్ము • వడఁగ్రమ్ము నెఱవమ్ము, దస్కురుల్ దిగులొంది • తావుఁ జేరఁ
దనరారు సిరిపొరు • తనివారఁ గలవారు, కనుగూర్కు మదిఁ గోరి • కన్ను మూయ
రతిరూపు పసమాపు • గతి చూపు గలకాపు, గుబ్బెత లెసటికై • కుండ లరయ

తే. దూరదేశసమాగత•ధూర్తపాంథ, జనసమూహంబు పయనంబు • సాఁగలేవ
తెక్కులలరించి కుత్తుక • ల్నిక్కుమించి, కొక్కురోకో యటంచును • గోళ్లు గూసె.

క. తెలతెల నయ్యెను దిక్కులు, పలపల నుడుగణము మాయెఁ • బొఱెను బత్తుల్
కలకలనఁ గూయఁ జొచ్చెను, దులదులఁ దుమ్మెదలు దమ్మి•తుటుములవెడలెన్. 138

తే. అపుడు హేమావతీకన్య • హంసనుడువు, నీతిచాతురి విపరీతి • నేర్పు మాని
పడకయిలు చేరి కళవళ•పడుచు నిమిష, మొక్కయేడుగఁ బనలెల్ల • నొనరఁ గడపె.

క. ఉదయోపరి రవిసింహము, మది మీఱఁగ నస్తశైల•మత్తద్విపముం
బొదువ గమకించి దుమికిన, యదనున దినకరుఁడు పశ్చి•మాశకుఁ జేరెన్. 140

తే. రసికుఁ డైనట్టి కాలంపు•రక్తవాను, తనదు బ్రహ్మాండ మను పెద్ద • దవతి గోన
శాయి నిండారఁ బోసిన•చందమునను, గారుతిమిరంపు గుంపు సొం•పారఁ బర్వె. 141

చ. అనువుగ మిన్ననుం గడిత•పాశెతమంబునఁ గట్టిపెట్టు శో
భనతరచంద్రదీధితుల•పంక్తి జమాఖరుచు ల్గణించి యిం
తనుకొని కాలమన్ గణకుఁ • డప్పుడు తీర్చి లిఖించి నట్టియా
దినవహిలేఖ్రవా లనఁగఁ • దెల్విగఁ జుక్కలు పర్వె నత్తఱిన్. 142

చ. జలకము లాడి జీనిబుగు•సాపనివస్త్రము గట్టి మోమునన్
దిలకము దీర్చి క్రొవ్విరులు • నించి కచాళిని గబ్బిగుబ్బలం
గలప మలంది గందవడి • ఘుమ్మనఁ బూసి నృపాలు నింటికిం
జెలియ చనం దలంచె • రతిశిక్షకు రెండవనాఁటిమాపునన్. 143

తే. పోవుచో నమ్మరాళంబు • పొంత నిల్వఁ
జెలియ పూనిన జిగినీటు • కలుకఁ జూచి
రాజహంసంబు పలికె నో•రాజవదన
పోయెదవుగాని యుపమతోఁ • బొసఁగి మనుము. 144

క. ఉపమ యెఱుంగనివారల, కపరిమితావస్థ లొందు • నది యెట్లన న
య్యుపమ యెఱుంగక కాదే, చపలత మున్నొక్కనక్క • సమసెం జెలువన్. 145

3

వ. అనిన విని హేమావతి యి ట్లనియె. 146

క. ఆకథ వినిమెద మడుపు సు, ధాకరకలు రాలఁ దేనె•ధారలు చిలుకన్
లోకేశ తురంగమ యన, నాకలికికి రాజహంస • మపు డి ట్లనియెన్. 147

క. వినవమ్మా హేమావతి, కనవమ్మా స్థూలసూక్ష్మ•కార్యములు దగన్
మనవమ్మా నన్నొ చ, క్కనికొమ్మా మెచ్చికొమ్మ • కథ విని పొమ్మా. 148

క. విభ్రమమణిమండన మన, నభ్రంకష సౌధకేత•నాంశుకజనితా
దభ్రానిలహతగతిజా, తాభ్రమణిహార్యశ్రమోవ • మపృర మమరున్. 149

క. ఆపురవరమణిలో గుణ, దీపక నామమున భూమి•దేవుం డలరుం
జూ పట్టి వేదశాస్త్రి, వ్యాపారముచేత రెండ•వవిధాత యనన్. 150

సీ. అఱుఁగులఁనున్న పు•టెఱమట్టిపట్టెలు, దీర్చినగోడలు • తేజరిల్ల
నిండుసున్న పుఁబూఁత • నెఱచాలు బోదెలు, దిద్దినదేవర•మిద్దె దనర
నారికేళ పుమట్ట • తీరుగా నలికిన, ముంగిలిమలెసాల • ముద్దుగులుకఁ
బంచవన్నియ ముగ్గు • పద్మము ల్నించిన, బృందావనములోఁగి • లందె వెలయ

తే. నుదికిన పుసుంగుదోవతు • లుంచినట్టి, దండె మాపాసనము నేయు • కుండ మమరఁ
బడలిక అడంచు పసపాకు • పంది లలర, నుండు నాబ్రాహ్మణునిగృహం• బుత్పలాక్షి.

చ. అతనికిఁ జారుసీల యను • నంబుజగంధసుగంధి యొప్పుఁ ద
త్సతి తనయుండు లేమిఁ బరి•తాపముతోఁ గడుపుణ్యభూము లా
యతమతిఁ ద్రొక్కఁ బూర్వసుకృ•తాంశముచే నొకఁ డుద్భవించె సం
తతశుభ ధాముఁ డప్రతిమ•ధాముఁడు కామగుణాభిరాముఁ డై. 152

వ. అంత గర్భాధానపుంసవన సీమంత జాతకర్మ నామకర ణాన్నప్రాశన చౌలోపనయన
వివాహ ప్రాజాపత్య సౌమ్యాగ్నేయ వైశ్వదేవ గోదాన స్నాతక పితృమేధంబు లను
షోడశకర్మంబు లెఱుంగం జేసి. 153

తే. వానితలిదండ్రు లత్యంత•వత్సలతను, బూఁటపూఁటకు గోముచేఁ • బోసఁగఁ బెంచి
ప్రాభవం బొప్ప నసమాన•వైభవమున, ఘనతషోడశకర్మాధి•కారిఁ జేయ. 154

వ. అంత నత్యంతకుశలస్వాంతంబున నవ్వటుశిఖామణి వేదవేదాంగాది బ్రహ్మవిద్యాభ్యా
సానంతరంబున గానంబును గవిత్వంబును గొక్కోకంబును జూదంబును దేశభాషయు
ను విజ్ఞానంబును లిపిలేఖనంబును జరాచరాన్యథాకరణంబును విలువిద్యయును సర్వ
శాస్త్రపరిజ్ఞానంబును శాకునంబును సాముద్రికంబును రత్నపరీక్షయు నరదంబుఁ
బరపుటయుఁ దురగారోహణంబును మల్లశాస్త్రంబును బాకచమత్కారంబును
దోహదప్రకారంబును ధాతుగంధరసవాదంబును గుట్టుపనుల వినోదంబును మహేంద్ర

జాలంబును జలాగ్ని స్తంభనంబులును మొనకట్టును వాకట్టును రయ స్తంభనంబును వ
శ్యాకర్షణమోహనంబులును విద్వేషణోచ్చాటనసంహారణంబులును గాలవంచనంబులును
బక్షిగతిభేదంబులును యోగవాదంబులును వచనసిద్ధులును ఘుటికాసిద్ధులును నింద్రజా
లంబును నంజనభేదంబులును ధృతివిశేషజ్ఞానంబులును వంచనంబులును స్వరవంచనం
బును మణిమంత్రక్రియలును జోరత్వంబును జిత్తరవు వ్రాయుటయు లోహకారక
త్వంబును శిలాభేదకర్మంబును గులాలకర్మంబును రథకారకర్మంబును శూర్పకార
కర్మంబును జోళ్లు నిర్మించుటయుఁ బటకారకర్మంబును సదృశ్యకరణియు దౌత్య
కర్మంబును వేఁటసన్నాహంబును జేరంబును బాహుపల్యంబును గృషియు మైరేయం
బు గూర్చుటయు లావుక కూర్మ కుక్కుట మేషాదులపోరు హత్తించుటయు ననియె
డు చౌషష్టివిద్యలమర్మంబు లెఱింగి యొప్పుచుండు. 155

క. ఈరీతి సకలవిద్యల, నారూఢిగ నారితేరి • యున్నటుఁడు సదా
చారస్థితి గంగాయా, త్రారంభవిజృంభమాణ•హర్షోదయుఁ డై. 156

సీ. సకళాతిసుళ్లాయి • యొకయింతఁ గాన్పింపఁ, జుట్టియుండినపంచె • సొంపు దనరఁ
బడెడుబియ్యము వండఁ • బాగైనతపెలయుం, జినచిన్ని యసిమిదో•సీమ వెలయ
ముంజిపైఁ గనుపట్ట • ముద్దుగాఁ గట్టిన, యంగవస్త్రపుగుడ్డ • చెంగు లలర
మాంజిష్ఠిగలిపిన•మంత్రాక్షతంబులు, వోసినమారేఁడు•బుట్టి యమర

తే. ధౌతశాటియుఁ బరిపాటి•ధావళియును, వఱలవేదాంతశాస్త్రంబు • వ్రాసినట్టి
తాళదళపుస్తకము చంకఁ • దనరఁ బూని, చనియె గడిదేరి యాబ్రహ్మ•చారి మీాఁద.

క. ఈలీల సకలపురములు, శైలంబులు నదులు నిధులు • శాఖిచయంబుల్
గాలువలుఁ బల్లె పట్టణము, లాలోకింపుచును బోయి • యవ్వటు వెడుటన్. 158

సీ. ప్రాలేయశైలాధి•పాలకసంజాత, కర్పూరధౌతలో•కప్రపూత
జలధినాయకుఁ డేలు • సరసంపుటిల్లాలుఁ, బటుభగీరథతపః•ఫలము మేలు
తారాధ్వఘట్టనో•ద్ధతవేగకల్లోల, యఘమహారణ్యదా•వాగ్నికీల
చంద్రశేఖరశిర•స్థలశుభ్రసుమదామ, చందనకుందేందు•సదృశధామ

తే. రంగదుత్తుంగదీర్ఘత•రంగసంఘ, ఘుమఘుమధ్వానమేఘని•ర్ఘోషవృత్య
దహిభుగుద్వేలవాలాంశు•యామునోర్మి, సంగమభ్రాంతిదాభంగ•గంగఁ గనియె. 159

మ. కని యభ్యంచితదివ్యతీర్థములలోఁ • గాఢగాహలం బొప్పఁగా
ఘనసీపారతి మీార భైరవున క•గ్ఘ్యం బిచ్చి సంకల్పముల్
వినతుల్ స్నాన మొనర్చి తత్తటమహా•ర్యీవాసవిద్యాతిప
ద్ధనికాయం బొగిఁ దెల్ప జాహ్నవిమహా•త్వంబుల్ విశేష భక్తితోన్. 160

వ. అంత నాబ్రాహ్మణకుమారుండును దత్తీరవాసులకు నిజార్జితద్రవ్యంబులు వ్యయంబు
చేసి గోభూతిలహిరణ్యాజ్యవాసోధాన్యగుడరౌప్యలవణంబు లనుదశదానంబులను దు
లాపురుష హిరణ్యగర్భ బ్రహ్మాండకల్పవృక్ష సహస్రధేను హిరణ్యకామధేను హిర
ణ్యాశ్వ హిరణ్యరథ హేమహస్తి హేమలాంగూల పంచలాంగూల విశ్వచక్ర కల్ప
లతా సప్తసాగర రత్నధేనుభూత సంఘట్టనంబులను షోడశమహాదానంబులు చేసి
కాశికాపురంబున కరిగె నప్పుడు. 161

సీ. చిత్రకూటసమాన • చిత్రకూటవిమాన, భాసురంబు విశిష్ట • భూసురంబు
వైజయంతవితాన • వైజయంతవితాన, భూషణంబు నృపాల • భీషణంబు
భాసమానశశిప్ర • భాసమానక్షౌమ, సుందరంబు కిరాట • మందిరంబు
గీ. సుమనస్తతోద్దామ • సుమనస్తతారామ, బంధురంబు సుశూద్ర • సింధురంబు
తే. సతతబహువైభవాసదృ • శప్రభావ, కీర్తిరాజితకుండలీ • కృతసుధీర
వజ్రమణిదీపవప్రాంశు • వలయలలిత, గోపురంబై రహించుఁ గాశీపురంబు. 162

ఉ. ఆపుటభేదనేంద్ర దృష • దానళికల్పితగోపురాళిపై
నేపున మాపు రేపుఁ జను • నిందుదినేంద్రులపర్వతద్యుతు
ల్బాపురె కినికిఁ గ్రహణ • బాధయ పర్వములందు నేక్రియన్
బ్రాపిత మయ్యె నంచు మది • భ్రాంతి వహింతురు తాంత్రికోత్తముల్. 163

తే. అట్టిపుణ్యస్థలంబున • కరిగి వేడ్క, గడలుకొన మణికర్ణికా • ఘట్టమునను
నిలిచి జలకచ్ఛమున స్నాన • నిష్ఠఁ బూని, వెడలి మాధ్యాహ్నికక్రియ • ల్వేగఁ దీర్చి.

క. మణికర్ణిక మణికర్ణిక, మణికర్ణిక యనుచు నుడువు • మనుజులకెల్లన్
గణనాతీతపుదోషము, లణఁగి శతక్రతుఫలంబు • లగు నని తలఁచెన్. 165

వ. అంతట నవ్వటుశిఖామణి నమకచమకంబుల రుద్రన్యాసయుక్తంబుగా విశ్వేశ్వరు నభి
షిక్తుం జేసి పూజించి ప్రదక్షిణనమస్కారంబులు గావించి యిట్లని స్తుతియించె. 166

సీ. జయభక్తమందార • జయదుష్టజనదూర, జయజగదాధార • శరణుశరణు
జయనిత్యకల్యాణ • జయభృత్యసంత్రాణ, జయరమాధిపబాణ • శరణుశరణు
జయగోత్రపుత్రీశ • జయరక్షితసురేశ, జయపంచశరనాశ • శరణుశరణు
జయశరద్ఘనగాత్ర • జయపావనచరిత్ర, జయకేందుశిఖినేత్ర • శరణుశరణు
తే. జయనిశితశూలసాధన • శరణుశరణు, జయమఖామోఘనాశన • శరణుశరణు
జయహయీకృతనందీశ • శరణుశరణు, జయమహాదేవ విశ్వేశ • శరణుశరణు. 167

సీ. శ్రీపార్వతీకుచ • శిఖరిస్థలవిహార, హారాయమాణమ • హాభుజంగ
జంగమస్థావర • సంచారసమభావ, భావజరూపప్ర • భావహరణ

రణరంగనిర్జిత•రౌద్రమహాసుర, సురయక్షసేవిత•చరణయుగళ
గళదరస్థాపిత•కాలకూటక్షీర, క్షీరాబ్ధిపుత్రీశ•ఘోరబాణ
తే. బాణనామకరాక్షస•త్రాణదక్ష, దక్షకల్పితయాగవి•దారణోగ్ర
యుగ్రభీమాదినామధే•యప్రసిద్ధ, సిద్ధభయభంగ కాశివి•శ్వేశలింగ. 168

క. అని సన్నుతించి వేడ్కలు, గొన లొత్తఁగ బ్రహ్మచారి • కుంజరుఁడు గ్రమం
బున దేవతాధివాసము, లనువొందఁగఁ గాంచి భక్తి • నలమినమదితోన్. 169

క. డుంఠిగణాధ్యక్షుని శితి, కంఠుని భైరవునిఁ జాండి•కం బటువిద్వ
త్కంఠీరవ మపుడు మహో, త్కంఠితతాత్పర్యములను • గొలిచి భజించెన్. 170

వ. తదనంతరంబునఁ బంచక్రోశంబునం గల మహాదివ్యలింగంబుల సేవించి యచ్చోటు వాసి తైర్థికజనహితసమ్యగయ యగుగయకుఁ జని గదాధరుం గొనియాడి ప్రయాగ కరిగి త్రివేణీసంగమంబునం గృతస్నానదానాద్యనుష్ఠానుం డై మాధవు నారాధించి సప్తపర్ణఘటంబుం గనుంగొని త్రివేణీతీర్థంబులు నించినకావడి గైకొని పంచక్రోశంబున నొక్కమరకతలింగంబు సంగ్రహించి నిజస్థానగమనోన్ముఖుం డై. 171

సీ. కావడిపైనంటఁ • గట్టినయొకకావి, శాటికంబళియాత్ర • సంచి యలర
నేతిలడ్డిగనీళ్లు • నించినసొరకాయ, బుజ్జ లిర్వంకలఁ • బొసఁగియుండ
నెగనెత్తి కులుచగా • బిగియఁ గట్టినపంచె, పైబిగించిన ప్రాఁత•బట్ట యొప్ప
ముఖఘర్మములటోపి • మునుఁగఁజుట్టినవల్లె, కొనలు మారుతలౌల్య•మున హరింప
తే. గమనజవమున నుత్తాడు•కావ డదరి, కిట్టుకిట్టని భుజమునఁ • గేళిసల్ప
గాడరుద్రాక్షమాలిక • లకంఠసీమఁ, దనరవచ్చెను వేడ్కఁ న•తైర్థికుండు. 172

క. ఈరీతిఁ దనగృహంబున, కారయఁ జనుదెంచి కావ • డటుదించి మహా
ధీరుఁడు జననీజనకుల, కారూఢిగ సంఘటించె • సాష్టాంగంబుల్. 173

క. తత్సమయంబున వారలు, వత్సా మఱియాత్రసలిపి • వచ్చితె యని యు
ద్యత్సంతోషంబునఁ దమ, వత్సస్థలిఁ జేర్చి ప్రేమ • నర్థిలి చెలఁగన్. 174

తే. శిరము మూర్కొని వదనంబు • చెమట దుడిచి
యాయురారోగ్యపుత్రపౌ•త్రాభివృద్ధి
గాను దీవించి యత్యంత•కరుణ మెఱయఁ
గొడుకుతోడను నిట్లని • నుడివి రపుడు. 175

క. ఏయేపుణ్యస్థానము, లేయేతీర్థస్థలంబు • లేయేద్వీపా
లేయేభూములు సూచితి, వాయామహిమలు వచింపు • మర్భక మాకున్. 176

క. అని యడిగిన తలిదండ్రుల, కనునయమునఁ గాశి గయ ప్రయాగము మొదలౌ
ఘనపుణ్యక్షేత్రంబులు, గని వచ్చితి లింగ మిదిగొ కౌతుక మనురన్. 177

క. ఈపురవరమణిచెంగట, నీపరమేశ్వరుఁ బ్రతిష్ఠ నెంతయుఁ జేతుఁగా
దాఁపురము మోక్షలక్ష్మికిఁ, గాపుర మభివృద్ధిఁ బొందుఁ గద మన కనియెన్. 178

తే. పుత్రకునివాక్యవిస్ఫురద్బోధమునకుఁ, దల్లిదండ్రులు సంతోష ముల్లసిల్ల
నపుడు పాషాణభేదుల కర్థ మిచ్చి, శివ నొక దేవళంబు గట్టించి రపుడు. 179

సీ. డంబైన గర్భగృహం బంతరాళికం, బును ముఖమంటపంబును జెలంగ
గాలిమంటపము ప్రాకారంబు లోలీలు, బోదెలు చుట్టులు పొందుపడఁగఁ
గప్పటచట్టము ఘనగోపురమ్ములు, జగతియుఁ జప్పట లొప్పగనుగనులుక
గచ్చుగోడలు రాతికంబము ల్వాలను, న్నము సువర్ణము ద్వారసమితి వెలయ

తే. దృష్టిపాత్రపుబొమ్మలు దేజరిల్ల, నుఱుకుసింగంబు లరగూళ్లు మెఱుఁగుఁదోర
ణములు చిత్తర్వుల్క్రొంబనుల్ రమణకెక్క, దేవళము మించె నత్యంతదివ్య మగుచు.

క. ఆదేవళంబులోన మ, హాదేవుని నొక్కదివ్య మగుశుభవేళం
బాదుగఁ బ్రతిష్ఠ చేసిరి, వేదాగమశాస్త్రరీతి నేక్క దలిర్పన్. 181

సీ. చెరఁగుదోవతిపైనిఁ జీరాడఁగా బోడి, తలఁజుట్టు ధౌతవస్త్రంబు మెఱయఁ
జెక్కులకు నుడిగి పిక్కటిల్లు విభూతి, పెండెకట్లు లలాటభిత్తి నమర
గళమున నులిగొన్న కావిదారముతోడి, రుద్రాక్షమాలికల్ దూఁగఁ దనర
మారేడుబుట్టిలో మక్కళించినసందెఁ, గట్టిరచంద్రశేఖరుఁడు వెలయఁ

తే. బొట్టపై మూకుడులో మొగబీరపత్రి, మట్టిధూపార్తిదీపముఁ బెట్టు చుసుఁ
బొందుపఱుచుక మునిమాపు పూజసేయఁ, గ్రొత్తకాణాచితం బళి హత్తుకొనియె.

క. ఈతీరునవలతంబలి, భూతేశునిపూజసేయఁబుష్పంబుల సం
ఘాతముగొని తేలే మని, యాతట్టున నొక్కతోఁట నమరఁగఁ జేసెన్. 183

సీ. సంపెగల్ మొల్లలు జాజులు గన్నేర్లు, విరజాజులును మంచిమరువకములు
బ్రొద్దు దిరుగుడుపూలు పొన్నలు మల్లెలు, పారిజాతములు నేవంతి విరులు
తామర ల్సూర్యకాంతమ్ములు కల్వలు, బొండుమల్లెలపాద ల్పొగడతరువు
లల్లిపువ్వులును నంద్యావర్తములు వాడ, గన్నేరులు తురాయి గట్టిపూలు

తే. మాచిపత్తిరి గర్గెర మరువము మరు, వేరు దవనమ్ములును వట్టివేళ్లు గుములు
బిల్వవృక్షము లాదిగాఁ బేరుగలవి, ప్రబల నొకతోఁటవేయించి బావిఁ ద్రవ్వె. 184

మ. అమితానర్ఘ్యనిబద్ధశుద్ధశశికాంతాయామసోపానసం
గమ మంబుగ్రహణాగతోరుపథికాక్రాంతస్ఫురత్కుట్టిమం

బమలాంభోరుహషండపాంసుకుముదా•చ్ఛామోద సంవాసితం
బమృతప్రాయజలాభిపూర్ణ మగుచు • న్నాబావి యొప్పుం గడున్. 185

క. అబ్బావికిఁ జేసేతం, బుబ్బుచుఁ దంబళి యొనర్చి • యుత్సాహంబుగ్
గుబ్బతిలఁ గొన్ని చెట్లకు, నిబ్బరమున జలము లెత్తి • నిస్త్రాణుండై. 186

తే. ఎలమి మఱికొన్ని చెట్టుల • కెత్తియెత్తి, యలసి ముంగిసమ్రానితో • నాసియుండ
గుండ నిండారఁగా ముంచి • కూడు దినఁగ, నింటి కేగెను బడలిక • లంటి పెనఁగ.

వ. అంత నొక్కబక్కనక్క గుక్కమిక్కనుచు డొక్కం బొక్కటిల్లిన క్షుధానలంబున దందహ్యమానం బై డస్సి. 188

తే. పుట్టలును దిట్టలును జెట్ల • బొట్లగట్ల, వంకలను డొంకలను బీళ్లఁ • బాళ్ల దాళ్లఁ
గుప్పలను దిప్పలను మళ్ల • గుళ్ల నూళ్ల, దిరిగి యాహార మందక • సోఁగి యడఁగి. 189

సీ. వాణికై పోరాడ • వచ్చి యెందఱు బ్రహ్మ, దేవుల మనువారు • దీరి చనిరి
పార్వతీరతులకై • బహుపోరి యెందఱు, రుద్రుల మనువారు • రోసి చనిరి
సిరినిఁ జేపట్టఁగాఁ • జేరి యెన్ని దశావ, తారము ల్గలహించి • తీరిపోయె
శచిమాఱు మనువు రం•చ్చలఁ బెట్టి యెందఱో, నింద్రుల మనువార • లేగి రహహ

తే. చూడ నవి యెల్ల యుగచర్య • సుద్దులయ్యె
బోయెఁ గాలంబు పూర్వవి•స్ఫురణ దప్పె
దార్ఢ్య మాలోచనము తెల్వి • డగ్గుపడియె
నారవిధి నేటి కిట్లాయె • ననుచు నడరి. 190

తే. ప్రాముజరాగ్నచేఁ గింక•రోమి యనుచు, నడుపువేదనచేఁ గ్వయా•స్వామి యనుచు
విస్మయపుమూర్ఛచే నాహం•తోస్మి యనుచు, బలుపరింపంగ సాఁగె నం•బ్బక్కనక్క.

వ. ఇట్లు క్షుధాతురత్వంబునఁ గంఠగతప్రాణం బై నోరం దడిలేక మాటిమాటికిఁ బొడము మూర్ఛల నలసి సొలయుచు మెత్తమెత్తగా వచ్చి తత్కూపతటస్థితద్రోణికాగ్రంబున నున్న యల్పజలంబులం దనకంఠంబు దడిపికొని యర్యోతంబు ముంగిసమ్రానికి వెదురునకు నంటఁ గట్టినవారు పరిమళం బాఘ్రాణించి దానిం బడి చని నేఁ డీ పశుకృత్తిరజ్జువున క్షుధాభారంబు హరించెద నని తలంచి యుబ్బుచు నెక్కొను తమకంబున ముంగిసమ్రానిపైకిఁ జివుక్కున నెక్కి యబ్బక్కనక్క దారువేణుబంధనం బగుచర్మరజ్జువుఁ దెగం గొఱికిన. 192

తే. మ్రాను మీటుగ నెగయ గో•మాయు వప్పు, డేకతాళప్రమాణ మ•బ్లెగసి కూన
గుంతలోఁబడ గ్రుడ్లువె•ళ్లుకఱకనాల్క, నడుము గఱచుక నరచుచు • బెడిసిపడినె,

వ. ఇట్లు క్షుధాతురత్వంబున నాహారంబె చూచెఁ గాని తనచేటు దెలియదయ్యె నీ వా
నక్కఱ తెఱంగున రాజసంయోగంబె చూచెదవు గాని యితరోపద్రవంబులు విచారింప
వయిన నిత్తెఱంగునఁ జిత్తంబునఁ దత్తరంబు లేక తెలిసి మెలంగు మని హంసంబు
వినయోక్తులు పలుకుసమయంబున. 194

చ. అలమినవేడ్క ఘోషకన•కాంగులు మజ్జిగఁ జిల్కఁగాఁపుఁ గూఁ
తులు తెలియావనాళములు • ద్రొక్కఁగ జారగభీరనాయిక
ల్నిలయముఁ జేరఁ దస్కరులు • నెక్కొనఁ బ్రభితి దావు లెక్కఁగాఁ
జెలఁగుచు వేగుఁజుక్క వొడి•చెన్ బలసూపనదిక్తటంబునన్. 195

క. అంతట హేమావతి గే, హాంతరమున లేగి పార్థి•వాయత్తమతిం
గంతుసుమకుంతదళిత, స్వాంతంబున నాదినాంత•సంతమసమునన్. 196

చ. కలపము గబ్బిగుబ్బలను • ఘమ్మనుపూలసరాలు గొప్పునం
గులికెడిచంద్రకావి నెఱి•కుచ్చెలఁ దీర్చినకోకశ్రోణినిం
దిలకము మోమునన్ మణులఁ • దీరినసొమ్ములు మేన వేడుకన్
వెలయ నమర్చి మేల్ముసుఁగు • వేసి నృపాలునికేళిఁ జెలఁగన్. 197

క. కలహంసోజ్జ్వలరత్నశ, కలహంసకయుగము ఘల్లు•ఘల్లని మ్రోయన్
గలహంసగమన చనఁగాఁ, గలహంసము హేమవతిని • గని యిట్లనియెన్. 198

ఉ. ఇంకొకగాథగద్దు విను • మింతటిపోఁబడి పాఱిపోవఁడో
పంకరుహాయతాక్షి యుప•భర్తల హత్తుక తత్తరాన మీ
నాంకుపుకేళిఁ దేలఁగఁ జ•నంగ నొకానొకమాట వచ్చినన్
బొంకఁగలేవు బంతి యని • బొంకవలెం గులటావధూటికిన్. 199

క. అని రాజహంసమణి ప, ల్కిన హేమావతివినోద•కేళిగతి గిరు
క్కున మరలివచ్చి యాకథ, వినియెద ననువొందఁ దెల్పు • విహగోత్తంసా. 200

వ. అని యడిగిన హేమావతికి హంసం బిట్లనియె. 201

క. విను మనఁగా ననఁగా నొక, కనకోజ్జ్వలకూటఘూట•ఘనగోపురశో
భనకృతకధరీకృతనా, కనగరిమణిభద్రపురము • గల దొకభూమిన్. 202

క. ఆనగరము భోగప్రతి, భానగరిపుఁ డైనమాణి • భద్రుఁడు భద్రా
నూనచరిత్రుఁడు కాంతిసు, ధానిధినృపు లెంచ శాశ్వ•తమ్ముగ నేలున్. 203

తే. అతనిచెంగట నసహాయుఁ • డనెడువాఁడు, చండదోర్దండమండిత•మండలాగ్ర
ఖండితారాతిరిపుతల•గుండుగండఁ, డనెడిబిరుదు వొంది తిరుగు నా•యకులలోన. 204

సీ. భిండివాలాసికో•దండభల్లాతక, నారాచరోహణ•నఖరవజ్ర
ముష్టిముద్గరశూల•ముసలభుసుండిక, ప్రాసప్రకూర్మక•ర్పటకటారి
కాగరాయోదండ•కణయకుంతాంతళ, పరశుతోమరచక్ర•పరిఘపట్ట
సములువంకిణికాది•సబళంబు చివ్వఁకె, సెలకట్టె యాదిగా • నిల నుతింపఁ
తే. దనరు ముప్పదిరెం డాయు•ధములు మఱియుఁ
జిలుత చెయ్యమ్ము గండగ•త్తెర తుపాకి
గొరకను సుగాలమును గ్రద్ద•గోళ్లు బుట్టె
చూరిశాణాధరించు న•వ్వీరుఁ డెపుడు. 205

వ. వెండియు నవ్వీరుండు సమదండ గజదండ భృంగిదండ యెడమవరభృంగి కుడివర భృంగిభృంగిపటలముపయి సరపుదండ సింగంపుదండ పాదలికదండ యడుగడుగుపా దలికదండ మద్దెలసంచుదండ కుక్కుటపుదండ మొదలుగాఁగల పదిరెండుదండల యఖండపాండిత్యంబు దెలిసి యెడమడుగు పరువడి కుడి యడుగు పరువడి కదలుపరు వడి దాఁటడుగుపరువడి కోపుపరువడి ఆంత్రటీకనాట్యము ధారు దాణుధోడ ఉరు ధోడ ఝూటుథాణు కపాలు ధారుకధారుక ధాను ధాణు ధాను ఝూటు నివి మొదలైన పదునాలుగు విసరులమర్మంబులుం జూచి కక్కు కొక్కున డొక్కర ముత్తెర డొక్కరము కుమ్మరింపు బోడింపు సందునీసంబును గొంతుమారును సమసం బును సురాటంబును జేపయుఁ గంపనంబును గల్లంబును దొట్టును గిర్లయుం బరిబొం దుటయు రొండివేటును ఫణంబును గన్నాతుసుభారంబును చొంగిణియుఁ బెట్లాగును రూణింపును సరిబిత్తరంబును లాగును విట్టాలయంబును దిణింగిణియుఁ బాదనివార ణంబును బాదగళాత్తియు గళకత్తెరయుఁ గాళనిల్కడయు నృసింహంబును నాది యగు ముప్పదిరెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి వంచియడుగుకత్తెర సర్వబంధ కత్తెర పాదలికకత్తెర చిట్టడుగుకత్తెర పావుపావులు జాగినపావు మొదలుగాఁగల పదిరెండుపరువళ్లయగణ్యప్రావీణ్యం బెఱింగి హరిగతి గజగతి వ్యాఘ్రగతి మహిష గతి జంబుకగతి మర్కటగతి మార్జాలగతి హరిణగతి చటకగతి పక్షిగతి తాండవ గతి నరగతి మొదలైనపదిరెండుగతుల యవార్యచాతుర్యంబు నేర్చి విష్ణుచక్రంబును రామబాణంబును నాగబంధనంబును దొలకరి మెఱుపును అల్లిమత్తును విస్సందును హస్తాభరణంబును బదఖండనంబును బర్రితాడును లోబిత్తరి వెలిబిత్తరి సర్వాంకుశంబు మొదలుగాఁగల పదిరెండు గాయమానంబుల భేదంబులు విచారించి లోమొన వెలిమొన యుసిమొన ముమ్మొన చతురమొన పుణ్యమొన పాపపుమొన చాటడుగుమొన కదలు మొన అరమీటుమొన నెఱమీటుమొన సరితాళింపుమొన యాదిగాఁగల పదిరెండు

మొనల నారితేరి లోవెలిగజ్జదుముకు చూరణనఱుకు మొదలగు నఱుకుల దగులుం గనుంగొని దండనిల్కడకదలు తుటుము కలయిక మెలకువ కింగళింపు దిశావదిశలు పాదపు పారువ హస్తపుపారువ దేహపుపారువ నయనపారువ వివరాకడ ఎకసర పైసర భృంగి పటలము ఝుంపు టెక్కు కరలాఘవంబు లాదియౌ షోడశోపవీతంబులరీతులు నేర్చి భ్రాంతంబును ద్రాంతంబును ఆప్లుతంబును ఆవిష్కృతంబును అప్టికంబును ఆకరంబును అవికరంబును మిశ్రితంబును మానుషంబును నిర్మర్యాదయు విచిత్రంబును ఛిన్నంబును సవ్యజానువు అపసవ్యజానువు క్షిప్తంబును దృతంబును గుడంబును లంబనంబును సవ్యబాహువు వినీతబాహువు త్రిబాహువు సవ్యోత్తరంబును ఉత్తరంబును తుంగబాహువు సవ్యకరంబును బ్రథితంబును యాధికంబును అపృష్టప్రహారంబును వల్గితంబును స్వస్తికంబు లనెడి ద్వాత్రింశత్పరిచారంబులు విచారించి యవక్రపరాక్రమంబున సాటిలేక మెలంగు మఱియును. 206

ఉ. సాదన మేలు చెంపపయి • జగ్గగ వ్రేలు రుమాలు మీసము
ల్మీఁదను జీరుకేలు జిగి•మించఁగఁ గప్పినశాలువైరులన్
వాదుల గెల్చు వాలుచెలు•వంబుగ దాల్చినపూలు నొప్పఁగా
నాదొరయొద్ద సంబళిక • లందుచు నుండునతండు ధీరతన్. 207

తే. అతనికులభామ గుణధామ•యలఘుకామ, యతులితారామ యనమరూ•పాభిరామ
వదనజితసోమ యధికలా•వణ్యసీమ, హేమరేఖాసనామ యై • యింతి వెలయు. 208

ఉ. కన్నులచందము న్నగుమొ•గంబు విధంబును గల్కి పల్కులుం
జన్నులపొంకము న్నడుము • చక్కఁదనంబును బాహులందముం
బెన్నెరిగుంపుసోయగము • బిత్తరి యాచెలియందె కాక యే
కన్నియలందుఁ గన్గొన మె•గాదిగఁ జూడమె మూఁడులోకముల్. 209

సీ. జల్లిమాటలు గాక • సరిసేయవచ్చునే, సవరంబు లీశిరో•జాతములకు
బూఁతసుద్దులు గాక • పోల్పంగ వచ్చునే, చందనం బీమేని•గంధమునకు
మాటమాత్రము గాక • దీటుగావచ్చునే, గగన మీనడుము సో•యగమునకును
వదరుపల్కులు గాక • తుదిసాటివచ్చునే, కిన్నెరకాయ లీ•చన్నుగవకుఁ

తే. జక్కఁదన మెల్ల ముల్లెగా • సంతరించి, బ్రహ్మదేవుండు తన నేర్చు • ప్రోఢి చేతఁ
దీర్చి,సృజియించెఁ గాబోలు • దీని ననఁగ,వీటఁ జరియించు నొక్కొక•వేళ నదియు.

తే. ధానిఁ,దనివారఁ జూడని•మానవుండు, చూచి తలయూఁచి మెచ్చని•సుజనవరుఁడు
మెచ్చి విరహార్తి నొందని• మేటిఘనుఁడు,కలుగఁ డెందైన మూఁడులో•కములయందు.

క. మదమెదవు కోడెవిటులకు, హృదయపుటాంతరములోన • హేమాహేమిన్
పదివేల మన్మథులు పు, ట్టుదురా సీమాటికుచప•టుత్వము గన్నన్. 212

వ. అది మఱియును. 213

తే. బిడ్డపాపలఁ గని పెంచు • జిడ్డులేక, తిండిచే గండమెండైన • దండికతన
నెనఁగు ననగూటిపిసవెట్టి•కసరుఱేఁగి, జారవాంఛావిహారంబు • సలుపసాఁగె. 214

చ. విటులకుఁ గొంగుబంగరము • వేడుకకాండ్రకుఁ బట్టుగొమ్మ యు
త్కటతరమన్మథార్తులకుఁ • గల్పగుజంబు భుజంగకోటికిన్
ఘటితనిధానసీమ యుప•కాంతులచేరువ పంటజార స
త్పటలికిఁ బంచదార యను•దానివిలాసమయారె యారయన్. 215

సీ. కురిమాపుమై సమ్మ•కరలచీరటువిప్పి, చెలువైనసరిగంచు•చీరఁగట్టు
మెరుఁగంచుకమ్మలు • దొరయవంచటుడించి, మణులరంజిల్లుక•మ్మలు ధరించు
జిటిపొటిసొమ్ము దీ•సి మెఱుంగుకట్టాణి, పూసలహారము • ల్వాసఁగ దాల్చు
గుత్తంపురవికెదా • హత్తకుండఁగఁజేసి, కలపంబు కులుకుగు•బ్బలను బూయు

తే. నడర బెడగైననిడువాలు • జడ సడల్చి, కుప్పె గన్పడ సవరంపుఁ • గొప్పుఁ బెట్టు
మురియు ముంగిట నిలుచుండి • మొలకనగవు, లెసఁగ విటభాగ్యరేఖయా • హేమరేఖ.

చ. కిలకిలనవ్వుమోవి పలు•గెంటుల దీఁటుఁగుచంబు లోరగా
వెలుపడఁ బైఁటవేయు నెఱి•వింతగ గేరు మరుల్కొనంగ బె
ళ్కులు గొనఁజూచు లేనివగ•లుం గొని మాటికిఁ గుల్కుఁగోటిచి
మ్ములు నొనరించు నవ్వెలఁది•మోహపుఁ బ్రాయము వానిఁజూచినన్. 217

సీ. ఏటినీఁటికటంచుఁ • బాటిపంపెత్తుక, పలుమాఱు దిరుగుని•బ్బరముతోడ
రోలు రోఁకలి కంచు • రూఢిగా నిల్లిల్లుఁ, దిరుగు నేప్రొద్దుఁ ద•త్తరముతోడఁ
గూరగాయల కంచుఁ • గోరి తా బాజారు, కును మఱిమఱి నేగుఁ • గొమరుతోడఁ
బనిలేనిపనిబోలి • గొని వాడవాడలఁ, జరియించుసారె క•చ్చెరువుతోడఁ

తే. బోలికలనెంచు వలరాచ•పొగరు నిగుడఁ, గులుకుఁబ్రాయంపునెఱనీటు • కోడెకాండ్ర
గమికిఁ దనజగ్గుజిగిసంచ•కార మొసఁగి, వలపు రెట్టింప మెలఁగు న•వ్వనజగంధి.

క. తనకంటికిఁ బ్రియ మయ్యెడు, ఘనునొక్కనివెంట నంటి • కౌతుక మొప్పన్
మనసంటి కౌఁగిలింపక, చన దింటికి దానిబల్వె•సన మేమందున్. 219

సీ. ఆసువోసెడు దాని•హస్తంబు రీతిని, గుంచెదీసెడుదాని•కొమరుమిగుల
జడచిక్కుదయ్యంబు•చందంబునను జెట్టు, విడిచినభూతంబు • కడకతోడ

మద్దెలలో నెల్క • మర్యాద నెఱగెత్తి, గనబిల్కు సన్యాసి • యనుపైమీఱ
వల్లంబుపోనాడు • వైశ్యుని తేవను, గాలుగాలినపిల్లి • క్రమముదోఁప

తే. గంతుమాయల నమ్మైత్త• కాయఁ దినిన, వెట్టితెఱఁగున వెసనంపు• వెఱపువొడమి
చికిలినెఱపన్నె కాంద్రకు • సివము లెత్త, నెనసి చరియించువీఁట నా• హేమరేఖ. 220

క. ఈలీలఁ బురములోపల, మేలౌ ప్రాయంపురూపు • మీ టగువారిం
జాలి భయ లజ్జ లన్నియుఁ, దూలి చనన్ వెన్నుఁ జఱచి • తోలఁగక కలయున్.
222

వ. ఇత్తెఱంగున.

చ. చవిగొని జార వీరరతి• సౌఖ్యము దెప్పలఁ దేల నెప్పుడున్
దివుచు మహావార్ధిసి ము•నింగి యొకానొక కాలమందునన్
శివశివకాఁ•పురంబుపయిఁ • జింత యొకింతయు లేక చిత్తసం
భవునిజమాయఁ గప్పి కలఁ•పం దలవాకిట నుండు నెప్పుడున్. 223

శా. ఈమర్యాదను గొన్ని నాళ్లు సనఁగా • హెచ్చైన కార్యానకై
భూమీశుం డొకనాఁడు పొమ్మనినచోఁ • బూత్కారుఁడై యాగతిన్
స్వామీ కట్టడఁ జేసి తే యనుచు ఛీ • జన్మం బిదే లంచుఁ జిం
తామగ్నత్వముఁ జెంది మందిరములో•నం జేరి పెండ్లాముతోన్. 224

వ. అసహాయుం డిట్లనియె. 225

తే. భూపతుం డొక్కపయనంబు • పొమ్మటన్న, మంచి దని వచ్చితిని సమ్మ•తించి నేను
సంబళము కంబళము కత్తి • చద్ది చల్ల, డంబు కేడంబు ధట్టి తె • మ్మంబుజాక్షి. 226

క. అని పల్కరించినప్పుడె, ఘనకుంతలతోడుసు వాసెఁ • గదరా యని యిం
పొనర నవి యిచ్చి పనిచినఁ, జనె నాతఁడు పయిన మయి వి•చారముతోడన్. 227

వ. అట్లసహాయుం డరిగినపిమ్మట. 228

క. ఆహేమరేఖ మదిఁ గల, మోహావేశమునఁ దోడి•ముద్దియతోడన్
బాహాబాహిఁ బెనంగెను, సాహో యని కంతుపాద•శహరహిఁ గేరెన్. 229

చ. పొలుపగు మావిలేఁజిగురు•పొంది కపోఁతపిరంగిలోన నె
క్కొలిపిన పుష్పగుచ్ఛ మను•గుండు పరాగపుమందు నించి వె
గ్గలపుపరాక్రమాగ్నిఁ గొని • కంతుఁ డనేటిపరంగిభామగు
బ్బ లనెడుదుర్గము ల్పగిలి • పారగుభల్లున నేసి యార్చినన్. 230

క. అటుమచు మార్చిలి తెలుసుక, కళవళపడి లేచి మనసు • గానిల్లంగా
భళిరా యని పెలువడి తన, నెళవుల జూచికొనుచు • నిలుచున్నంతన్. 231

చ. మెలివడుతీగచుట్ల జిగి•మించినపాగ జిసుంగుపచ్చడం
బలవడు చల్వదోవతి యొ•య్యారపు గందపుఁబూఁతడొల్లుపో
గులు మణిముద్రిక ల్వెలపు•గుల్కెడువీడ్యము చంకపంత్రట మం
త్రములతుద ముచ్చెలుక్ వెలయ•గుప్తగుణుం డనువైద్యుఁ డొప్పుగన్. 232

తే. వైద్యమాత్రంబునన కాదు•వజ్ఞలునట్టి, నిరుపమాకారసౌష్ఠవ•స్ఫురణచేత
నాశ్వినేయులతోనైన•నతఁడు వాదు, కెదిరి కోచింపకనె జబా•బీయఁ గలఁడు.

వ. మఱియు నశ్వగంధాదిఘృతంబును శైలేయకఘృతంబును షట్పలఘృతంబును దూ
ర్వాదిఘృతంబును బంచగవ్యఘృతంబును నార్ద్రికఘృతంబును గదళీకందఘృతంబు
ను గళ్యాణఘృతంబును దంతులీయకఘృతంబును గూశ్మాండఘృతంబును మొదలయిన
ఘృతంబులు సేయునేర్పును బంచాగ్ని చూర్ణంబునుజిత్రకాది చూర్ణంబును బడబానల
చూర్ణంబును మాణిమండచూర్ణంబును మరీచ్యాదిచూర్ణంబును తాళీసచూర్ణంబును
నేలాదిచూర్ణంబును దుంబురుచూర్ణంబును గర్పూరాదిచూర్ణంబును బంచబాణ
చూర్ణంబును భృగ్వాదిచూర్ణంబును నాదియైనచూర్ణంబు లొనరించునుపమయుఁ
జించిల్యాదిలేహ్యంబును క్షుద్రాభయాదిలేహ్యంబును జతుష్షష్ఠిమరీచ్యాదిలేహ్యంబును
గుసుమార్ద్రాదిలేహ్యంబును బిప్పల్యాదిలేహ్యంబును బిల్వాదిలేహ్యంబును గుండల్యాది
లేహ్యంబును మొదలుగాఁ గలలేహ్యంబు లొనరించునైపుణ్యంబును నారికేళాదిరసా
యనంబును గుడనాగరాదిరసాయనంబును శిగ్రుపుష్పరసాయనంబును జాతిఫలరసా
యనంబును సుకుమారరసాయనంబును భల్లాతకీరసాయనంబును సుదర్శనరసాయనంబు
ను వారాహీరసాయనంబును విశంగాదిరసాయనంబును నమృతరసాయనంబును నాది
గాఁ గలరసాయనంబులు సేయుపొందిక లెఱుంగువిధంబును శరపుంఖాదితైలంబును
లక్ష్మీనారాయణతైలంబును లాక్షాదితైలంబును ధన్వంతరితైలంబును బంచార్కతైలం
బును బాశ్చాత్యనింబతైలంబును విషముష్టితైలంబును గేతకీతైలంబును స్నేహార్కతై
లంబును వాతాంతకతైలంబును బూతికాతైలంబును భూనాగతైలంబును భృంగామ
లకతైలంబును మొదలగు తైలంబుల పరిజ్ఞానంబును నారికేళాంజనంబును సౌవీరాంజ
నంబును వీరభద్రాంజనంబును నీలాంజనంబును గరుడాంజనంబును గపోతాంజనం
బును గర్పూరాంజనంబును మొదలుగాఁ గలయంజనభేదంబులఁ గూర్చుచమత్కారం
బును నగ్నికుమారకము రాజమృగాంకముఁ బూర్ణచంద్రోదయము వసంతకుసుమాకరము
వాతరాక్షసము చంద్రహాసము చంద్రప్రభావతిరసము కందర్పాంకురరసము షణ్ముఖరస
ము కాలాగ్నిరుద్రరసము తాళకేశ్వరరసము ప్రతాపలంకేశ్వరము చాతుర్థికరామ
బాణము విషచక్రరసము విశ్వంభరరసము బడబానలరసము నారాయణరసము మదన

భైరవరసము భార్గవరసము జ్వరాంకుశము స్వచ్ఛంద భైరవము సంజీవనరసము రసభూ
తి చింతామణి మొదలైనదివ్యరసౌషధంబులు గంధకరసనాభుల లక్షణంబు లెఱిఁ
విఱుచు ప్రావీణ్యంబును లోహభస్మ తామ్రభస్మ వంగభస్మ సీసభస్మ నాగభస్మ
భస్మ సువర్ణభస్మంబులు సేయుమర్యాదయు శీతభంజి అరశ్యాదిమాణిభద్రతాళీస
త్రలు గట్టువపధానంబును క్షారద్రావకగుగ్గులుషిష్టకసాధనంబులు మూలికలు కైకర్ణిక
సేయునౌచిత్యంబును సూత్రస్థానశారీరనిదానశాస్త్రింబుల పరిచితియును డెబ్బది
ఱునాడీభేదంబులును వాతపైత్యశ్లేష్మంబుల నుల్బణంబు లైనత్రిశతషష్టిరోగంబుల
దత్తచ్చికిత్సలు చేయుచాతుర్యంబును గలిగి రెండవధన్వంతరి యనం బరఁగు నతఁడు

తే. వీథివెంటను రాఁ జూచి • వెలఁది యనియె,నౌర యిట్లుండవలదె యొ•యారమహా
మీనిఁ జిక్కించుకొని మార•విగ్రహమున, భంగపడఁ జేయ నిది యేటి•ప్రౌఢతనము.

క. అని తనమనమున ననుకొను, చును నిలుచున్నంత దాని•సొగసు నొయారం
బును గని మనసిజసమ్మో, హనవిద్యను జొక్కి యాతఁ • డంచుకు రాఁగన్. 2

ఉ. ఎక్కడ నుండి యెక్కడికి •, నేమి ప్రయోజన ముండి పోయె దీ
పక్కట నామ మే మనిన • నన్నియుఁ జెప్పి పరోపకారి రా
యిక్కలకంఠకంఠి యని • యెంతయు డగ్గఱఁ జేర మారుడుం
బ్రక్కలు నెక్కొనం బొడువ • బైకొను మోహము చేత లేమయున్. 23

తే. అమలశశికాంతకాంతశు•ద్ధాంతకేళి, కానిశాంతాంతరంబున • ఘుమ్మురనెడు
పచ్చబచ్చెన చిత్తరు•పనులమించు, ప్రతిమసంఘట్టనల మంట•పంబులోన. 2

చ. సకినెలకీలుకంతమునఁ • జాయ మెఱుంగులసొంపు కెంపు ము
క్కుకొనల పచ్చరాచిలుక•కోళ్లఁ దనర్చినపట్టుపట్టెయ
ల్లికపయి జాఘరాజినుఁగు•లేపునఁ జెందుపలంగుపోషుత
క్కిక గలజాలువాగొలుసు • గీల్కొనుమంచముపై మహోన్నతిన్. 23

తే. అపుడు గుప్తగుణాహ్వయుం • డనెడివైద్యు
నెలమిఁ గూర్చుండఁ బెట్టి యా•హేమరేఖ
పండుటాకులు కప్రంపు•భాగములను
వేడ్కతోడుత నిడ్డలు • వేసికొనుచు. 24

మ. సరసాలుం జిఱువవ్వులు న్మురిపెము • ల్సయ్యాటము ల్వింతలుం
గరిగింత ల్వలపించుట ల్చతురత • ల్కాంక్ష ల్వినోదంబులుం
దరితీపు ల్వలపు ల్మిటారితనము • ల్లాలింపులుం దచ్చన
ల్నెఱచిన్నె ల్మరపించుట ల్బాగసులు • న్నీటు ల్పచారింపుచున్. 24

సీ. ఆసక్తి దీఅని • యాలింగనంబులు, నురువాంఛ దరగని • చురితవితతు
లనురక్తివాయని • యట్టిచుంబనములు, తమి వెలిగానిదం • తక్షతంబు
లభిలాష లుడుగని • యతిచపేటంబులు, తాత్పర్య మెడలని • తాడనమ్ము
లాశలు మానని • చౌశీతిబంధము, ల్భావ మూననికళా • స్పర్శనములు
తే. కలితకలకంఠకలహంస • కలరవములు, పలుకు కివకివ కవకవ • ప్రకట టకుట
కకుట కహకహ హసనము • ల్గళరవములు, చెలఁగ నిద్దఱు రతికేళి • సలుపునపుడు.
చ. తెమలను నిన్నుఁ బాసి సుద • తీ యని తీయనిసీదుమోవి కా
యమృతరసోర్మియేని సమ • మా యని మాయనిమోహదావసం
భ్రమ మెదలోన నెంతదల • పా యని పాయనికూర్మితోడి నా
తమిపరభామలందు గల • దా యని దాయనికౌఁగిలింపుచున్. 243
వ. ఇట్లన్యోన్యసరససల్లాపంబుల గుప్తగుణుండు సురతకేళికాలోలుఁడై హేమరేఖతోఁ
బెనంగుసమయంబున. 244
సీ. కొప్పెరపెట్టుగాఁ • గొమరొప్ప నొనరించి, పైరుమాలు బిగించి • పచ్చడంబు
నాగవల్లీదళ • పూగపూరిత మైన, పడిలోన నిడికొన్న • యడప మొకటి
చాయలఁ దనరారు • సకలాతియొరతోడి, పృథుభుజస్థలి నొప్పు • పెద్దకత్తి
చీర్ణంపుఁబనిచేత • జిగిమించుకరమున, సాం పైన సత్తుసు • న్నంపుఁగాయ
తే. పాదముల మెట్లు మొలఁ దాల్పఁ • బడిన బాఁకు, చల్ది గట్టినవస్త్రంబు • చంకదుడ్డు
నమర గమనజనోద్భవ • శ్రమముఁ జెంది, యప్పు డసహాయుఁ డింటికి • నరుగుదెంచె.
కం. అరుదెంచి పురుషుఁ డుండెడి, యరువెంచి నిజప్రసిద్ధి • కందఱు నళికే
బిరుదెంచి రోషవశుఁ డై, సరిదంచితఘోషభాషఁ • జానను బిలిచెన్. 246
కం. జడియక యిపు డాసతి యే, పడువున బొంకంగవలయు • వనరుహగంధీ
యడుగుం దప్పినయప్పుడె, పిడుగుం దప్పు ననుమాట • పేర్కొన వినవే. 247
వ. అని. 248
చ. ఈవిధి హంసలోకవిభు • ధేంద్రుఁడు ప్రశ్న మొనర్చి పల్క హే
మావతి కొంతకొంత యను • మానముతో బొటవ్రేల నేలరే
ఖావిధ మొప్ప వ్రాయఁ గుతు • కంబున నీ కిది తోఁచెనేని యు
ర్వీపరుఁ జేర నేగు మని • వేడిన నప్పువుఁబోడి యిట్లనున్. 249
కం. నినువంటికతలకారిని, గని వినియెడువారి నడుగఁ • గావలెఁ గానీ
ననువంటిదాని నడిగిన, వినుపింతునె యెట్లు బొంక • వివరింపఁ గదే. 250

క. అని యడిగిన హేమావతి, కనురాగం బొప్ప రాజ•హంసకలాపం
బనియె నసహాయుఁ డటువలె, ఘనకోపం బుట్టిపడఁగ • ఘర్షించుటయున్. 251

తే. వైద్యుఁ డప్పుడు గడగడ • వడఁకి నాకు, బుద్ధి యే మని పల్క న•ప్పువ్వుబోఁడి
వెఱవకు మటంచు దిట్టయై•వెన్నుఁ జరచి,సంచి విడిపించి యపుడు స్వ•స్వామి కనియె.

చ. కడుపున శూలయెత్తి వడి•గాసిలి ప్రాణము లేగునట్లయై
తొడిబడ నీవు లేమి ఘన•దుఃఖముచే వెతఁ బొంది యీమహా
త్ముఁడు పురి నేగఁ గావు మని • తోడ్కొనివచ్చితి నీతఁ డౌషధం
బిడుటను నేను జీవము వ•హించితిఁ గ్రమ్మఱ నేమి చెప్పుదున్. 253

క. అని యుస్సురస్సు రనుచో, నన్నృశోదరి రోగమునఁ బ్రి•యాంగనపొరలన్
గని కుస్తరించి వైద్యుని, మనమున రంజిల్లఁ జేసి • మమత దలిర్పన్. 254

తే. నీఋణము దీర్పఁ గలవాఁడ • నే యటంచుఁ
బచ్చడం బిచ్చి బహుమాన • మెచ్చ వైద్యుఁ
బంపి సందేహ మందక • భార్యతోడ
నిండువేడుకనుండె నో • నీరజాక్షి. 255

వ. అని మరాళశేఖరంబు చెప్పిన నరాళకచ యగుహేమావతి తనమనంబున. 256

క. సురుచిరమణితాటంక, స్ఫురితప్రభ చెక్కులందుఁ • బొలయ శిరంబున్
మఱిత్రిప్పి పొగడె నహహా, గరితలమి న్నదియె కాక • కలదే పుడమిన్. 257

వ. ఆసమయంబున. 258

తే. మైవి యల్లక్ష్మి కస్తూరి•మళ్లచీర, రేయిఁ గట్టుక సడలించి • రేపటికడ
నుదయరాగంబు దాల్చిన•యొఱపుదోఁపఁ,దమము జాఱంగ సాంధ్యరా•గము జనించె.

చ. పలపల నయ్యెఁ దారకలు • పక్షులు గూయఁ దొడంగె దీపముల్
దెలతెలఁ బాఱె దిక్కులనుఁ • దెల్వి జనించె బిసప్రసూనముల్
దులదుల విచ్చెఁ దావులకు • దొందడిఁ జేరిరి జారచోరులా
మలయసమీరణంబు కడు•మందగతిన్ విహరించె నత్తఱిన్. 260

తే. తఱి యనుకళాదుఁ డుదయభూ•ధరహసంతి
నరుణహేమంబునకు వన్ని•యలను నిండ
గ్రాఁచి నీరార్చనెత్తిన•కరదు నాఁగ
సూర్యబింబంబు వొడిచె న•వార్యగతిని. 261

క. మణిఘంటలమొలనూలున్, ఝుణఝుణ యని మ్రోయఁ గేళి•శాలకు జని య
య్యణుమధ్యనృపార్పితగుణ, గణ యై వసియించె దినము • కల్పముగాగన్. 262

వ. అని ప్రత్యుత్పన్నమతిచెప్పిన విని సంతోషించి నలుండు తదవాతివృత్తాంతం బానతి
మ్మని పలికిన. 263

మ. హరకోదండవిఖండనప్రచురబాహాదండదండాయుధా
ద్యురుదిక్పాలసురాసివార్యతరబాణోద్దండదండాంకభి
ద్ధరిణాక్షీమణిజీవనాకృతినిజాభ్యాఖండఖండాబ్జభృ
ద్భరసాభ్రద్రిపువాహసన్నిభయశోభాకాండకాండోదరా. 264

క. ధారాధరఘృణివారా, వారణరాజన్యవైరివారణధీరా
ధీరాజితశుభకారా, కారణపురుషావతార కరుణోదారా. 265

కలహంసోత్సాహవృత్తము.

కలుషదూర భవవిదూర కమలసార లోచనా
కలితహార వరవిచార ఖరవిహార మోచకా
లలితనీర నిధిగభీర లసదుదారకీర్తిని
ర్దళితహార శరపటీర ధరసుధారసోత్కరా. 266

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధి పూర్ణిమా
చంద్ర నిస్సహాయకవిత్వ నిర్మాణచాతుర్య నిస్తంద్ర శ్రీరామనామ పారాయణ నారా
యణామాత్యప్రణీతం బయినహంసవింశతి యనుమహాప్రబంధంబునందుఁ బ్రథమా
శ్వాసము.





శ్రీ ర స్తు.

శ్రీ రామచంద్రాయనమః.

# హంసవింశతి

## ద్వితీయాశ్వాసము.



శాంకరీశ చాపవి,
నాశ ధరాధీశ వంశ•నలినదినేశా
క్లేశ హరాకాశ దరా,
కాశ ఝరాబ్జాభిరామ • కాంతియశోమా. 1

వ. అవధరింపుము నలరాజన్యునకుఁ బ్రత్యుత్పన్నమతి యిట్లనియె నట్లు హేమావతి కేళిని శాంతంబుఁ జేరి రాజవిరహంబున నొండొకరీతిఁ బ్రొద్దు గడుపుచున్నంత దినాంతంబు గావచ్చిన. 2

శా. ఆహేమావతి మానసాటవిసము•ద్యద్దీప్తిమై పేర్చు చూ
రాహంకారపరాక్రమానలము బా•హ్యస్థానకేళ్యర్థమై
యోహో వెల్వడి పెక్కురూపములచే • నొప్పారి కన్పట్టు నా
గేహాంతంబుల దీపపంక్తులు చెలం•గెన్ రంగు పొంగారగన్. 3

సీ. నునుపెక్కు జిగిచెక్కు•లను మిక్కుటపుడెక్కు, గ్రమ్మెడుపంజుల•క్రమ్మలలర
నిడువాలు గలకీలు•జడమేలు వగఁ గ్రాలు, గొప్పైనసవరంపుఁ • గుప్పెదనరఁ
దెలిపువ్వు కళఁగ్రొవ్వు • వెలిపువ్వు చిఱునవ్వు, గలుగు నెమ్మోమునఁ • దిలక మమర
రహిగుబ్బలుల నిబ్బ•రము ద్రొబ్బఁ గలగుబ్బ, కవమీఁదిపైఁటఁణీ•అవిక మెఱయ.
తే. బళుకుబళుకున గతులయం • దళికి బెళుకు, కులుకుఁ గౌనున జాళువా•తళుకు లొలుకు
మేటియొడ్డాణ మలరార • నీటుఁబూని, వచ్చి రాయంచకడ నిల్చె • వనరుహాక్షి. 4

వ. ఇత్తెఱంగున నిరుపమశృంగారతరంగితాంగయై రాజపుంగవసంగమార్థం బరుగుచుఁ దన చెంగట నిల్చినయారాజాననావతంసంబునకు రాజహంసం బిట్లనియె. 5

### మూడవకథ.

క. గమ్మత్తుచిమ్ము నొకకథఁ, గ్రమ్మరఁ దెల్పెదను వేణిఁ • గ్రమ్ము విరులపైఁ
మ్మెదలు ఝుమ్మ ఝుమ్మనఁ, గొమ్మా తలయూచి మెచ్చు•కొమ్మా నన్నున్. 6

వ. అని యిట్లు చెప్పఁదొడంగె. 7

క. కల దభ్రంకషకేతన, చలదభ్రం బైనచైత్ర•శక మనుపుర ము
జ్జ్వలపద్రభకచాదర్శన, దలదభ్రపురీసుపర్వ•దారోదర మై. 8

సీ. వేదశాస్త్రపురాణ•విద్యాగరిష్ఠులై, విలసిల్లుచుండెడి • విప్రవరులు
గరిడిలో నెఱహొంత•కారులై సాముల, మీఱినరాజకు•మారమణులుఁ
గోటికిఁ బడగెత్తు•కొని యున్నటెక్కెము, ల్వెక్కులై వర్ధిల్లు • బేరిజనులుఁ
గడుధాన్యరాసులు • గగనంబుతో రాయు, కలిమిచే మించిన•కాఁపుప్రజలు
తే. భూరిమదధార లూరెడు•వారణములు, ధాటిపాటవమున నొప్పు • ఘోటకములు
ఘోరరణరంగపటు లైన•వీరభటులుఁ, బ్రబలియుండఁగ వెలయు న•ప్పట్టణంబు. 9

క. ఆపట్టణంబులోపలఁ, జూపట్టును దంతువాయ•చూడామణి రే
ఖాపట్టభద్రుఁడై సిరి, నేపట్టున నోరపార • మింతయులేకన్. 10

సీ. కుంచె మగ్గపుగుంత•గూటంబు పగ్గంబు, పరిపె ద్రొక్కుడుపట్టె • పలకదోసి
పరిపరియచ్చులు • చరికుండయాడిత, చీడుదబ్బలు దండె • నాడె క్రోవి
కోఁతిపుల్లలు నాల్కు • కుకుతరికొయ్యలుఁ, జొప్పయాచలుఁ గోఁత•చూరుకత్తి
కారంపుఁ బడుగులుఁ • గండెలకప్పెర, గోలము లాకలు • నీలికడవ
తే. గంప డొల్లకళాసంబు • కదురుచెమికె, నూలురాట్నంబు జాలంబు • గ్రాలు గ్రోడ
వఱల నాశుభభద్రుని•వాసభూమి, యప్పురంబున సంతతం • బొప్పుచుండు. 11

తే. గొప్పకన్నులు చిఱునవ్వు • గులుకుమోము, బవిరిగడ్డము చక్కనై • పరగు ముక్కు
నెగుభుజంబులు విపులత్వ • మెసగు రొమ్ము, బిగిమిగులులీల గనుపట్టుఁ•దొగట సెట్టి. 12

ఉ. ఆఁటది నేర్పుతో వగల•యందముఁ జందముఁ జూపఁ బూని కో
లాటము వ్రేయుకైవడిని • లాలితవృత్తరశప్రభావళుల్
పాటిగఁ బోఁగు వెంబడిని • బార్శ్వములం జరియింప వస్త్రముల్
ధాటిగ నేయు నప్పలుక•తట్టునఁ బెట్టు ఖణి ల్ఖణి ల్లనన్. 13

తే. అరవిరుల తేనియలచాలు • మరునివాలు, మిసమిసల్ప్రోలు వలరాజు • మేటిడాలు
మురిపెముల మెచ్చుకొనఁజాలు • ముద్దరాలు, వానియిల్లాలు దొమ్మర•వానిడోలు. 14

ఉ. దానిముఖప్రభాగరిమ • దానికపోలకళావిశేషముల్
దానిబెడంగుచూపులును • దానికుచంబులఁ జెందు నందముల్
దానివచోవిలాసములు • దానికచాళిరుచు ల్గణింపఁగా
మానవతీలలామ విను•మర్త్యు లమర్త్యులు నైనశక్తులే. 15

క. జిగిజిలుకు కులుకుగుబ్బలు, నిగనిగలు చెలంగు నెఱులు • నిద్దపుఁ గన్నుల్
నగవు దళుకొత్తు మోమును, మగువా యాబిడకె కాక • మఱికలదటవే. 16

క. తొడలందము కటిచందము, నడుగుం దమ్ముల బెడంగు • లాస్యము రంగుల్
జడతళుకుల్ మెడకులుకు, న్నడబెళుకుం జూడ నాఘ•నస్తని కమరున్. 17

తే. చిన్న చీమల నునుబారు • చెలువయారు, కదళికాకాండములమీఱు • కాంతయూరు
లందములఁ జెందు రతిఁగేరు • నతివసౌరు, దాని కెనయైననారు లి•ద్ధరణిలేరు. 18

క. కందర మాచెలి పొక్కిలి, కంధర మావిలసనంబు • కచము రదంబు
ల్కుందర మాసమములు నా, కుం దరమా పొగడ నలకు • కుందరసుకటిన్. 19

సీ. మిళదంబు జలదంబు • బఱడంబు చెలువంబు, దులకించు నమ్ముద్దు•కలికివేణి
సిరిపట్టు గలిగట్టు • జిగిగుట్టు వెలిఁబెట్టు, చెన్నారు నక్కన్నె • చన్నుదోయి
నునుకందు పైఁ జెందు • నని యిందురుచిఁ గ్రిందు,బఱుపఁగాఁ జాలు న•బ్బాలమోము
తెలిదమ్ములను గ్రమ్ము•కళ జిమ్ము ననయమ్ము, మిన్నయౌ యబ్బోటి•కన్నుగవయుఁ

తే. దావి తేనియ బావియం•దములదీవి, మావిచిగురాకు చెంగావి • మారుతీవి
కప్పురంబుల క్రోవి య•క్కాంతమోవి, యనుచు వినుతింప నా నేఁత•వనితయలరు. 20

తే. పరిమళ మెసంగు బంగారు•ప్రతిమవంటి, తొగట వాల్గంటి జిగినీటు • తొలకరింప
సొగసుకాంద్రకు మోహరా•సులుజనింప,నూర యొకయోరఁ జెలువార • బార సాఁచి

సీ. పోఁగువెంబడిఁ బర్వి • పొల్చు వాల్చూపుల, ధళధళ ల్వాదండ•కళలనీనఁ
బుంజంపుకట్లు దెం•పుటకుఁ బఱ్వెత్తుచో, మట్టెల ఖణఖణ • ల్పెట్టు మ్రోయ
గీలెత్తుచో బాహు•మూలజాత ప్రభా, చకచకల్ పైఁడి వ•సంతమాడఁ
బరిటఁ ద్రిప్పఁగ జాఱు•పైఁటలోఁ గన్పట్టు, గుబ్బలమిసమిస • ల్దొబ్బులాడ

తే. నింతవగ కప్పు నెఱిఁగొప్పు • వీట మెఱయు, నిగనిగ ల్జాతినీలాల • నిగ్గునింపఁ
గుచభరంబున నడుము కొం•కుచు వడంక, నూలుదోఁడును నేడ్క న•వ్వాలుగంటి. 22

చ. కరములఁ గంకణాళి ఘలు•ఘు ల్లన రాట్నము ద్రిప్పువేళఁ బైఁ
టర దిగజాఱ వెల్కుఱుకు • నబ్బురపుల్ వెలిగబ్బిగుబ్బపై
సరు లిసుమంత చిందుగొనఁ • జిక్కని చూడ్కులఁ జూచువారి పే
రురమున గాఁడ నవ్వెలఁది • యొప్పనఁ గండెలు సుట్టు నేర్పునన్. 23

ఆ. పడుగుఁ జేయువేళఁ • బటము లల్లెడువేళఁ, గూడు దినెడువేళఁ • గూర్కువేళ
మగని కన్నొరంగి • మార్మగలను గూడు, నింటిపొరుగుసఖుల • యిండ్లలోన. 24

క. గడిదేఱి జారవిద్యకు, వడిఁగట్టి దురంతకంతు•వనజశరాళిక్
బడఁజాలనికలమున నా, వడువున నత్తొగటబోటి•వర్తిలఁ దొడఁగెన్. 25

వ. ఇత్తెఱంగున నత్తెఱవ చిత్తజాయత్తచిత్తయై వర్తింపుచున్న సమయంబున. 26

సీ. నొసలిపైఁ జుక్కల•మిసిమి నామపురేఖ, లసువొంద భుజముపై • నసిమి సంచి
వాలువీనులగాజు•నీలాలపోఁగులు, పైనొప్పు పప్పళి•పచ్చడంబు
మెలిగొనఁ జుట్టిన•తలపాగ ఫౌఁజు గుంచి, పైటపేటాచుట్టు•పట్టుశాలు
కడిఁదిమీఱఁగఁ జంక • నిడినఁ గొట్టెయకోల, సాకమ్రోసెడుడుబు•డక్కకేల

తే. పలల దిక్కుల సెంచి దు•ర్వార మైన, కీడు మేలును దెల్పుచుఁ • గేక లిడుచుఁ
గెర్లికొనుచును దన పేరు • కేరికొనుచు, వచ్చె నచటికి డుబుడక్క•వాఁ డొకండు. 27

ఉ. ఆడుబుడక్కవానికి ర•యంబున భిక్ష యొసంగ నేఁతవూ
బోఁడి ప్రకోష్ఠకస్థలికిఁ • బోయి తనుం గొనియాడువాని నా
ప్రేడితసూక్తిపైఁ బెదవి•మీఁదను లేనగ పంకరించి చిం
దాడఁగ ముష్టిఁ బెట్టి బహి•రంగణభూమిని నిల్చి యుండఁగన్. 28

సీ. మెలిఁబెట్టి చుట్టిన • తెలిపైఠిణీపాగ, చెవిసందిపాగలోఁ • జొక్కకలముఁ
దొడిగిన సెల్లచల్వ • నడరు పంగిజోడు, జీరాడునడికట్టు • చెఱఁగుకొనలుఁ
బదతలంబుల నెల్ల•పాలుపాపోసులు, టెక్కుగాఁ జంకఁ జీ•టీఖలీతి
నడికట్టు లోమొల • నిడినకలం దాను, హస్తాగ్రమున వ్రేలు • దస్తరంబు

తే. మించుబాహువుమీఁదఁ గా•శ్మీరశాలుఁ, జెవుల ముత్యాలపోఁగులుఁ • జెలువు దనర
కలఁతి నీర్కావిధోవతి • యమర నటకుఁ, బారుపత్యంబు సేయు వ్యా•పారి వచ్చె. 29

తే. వచ్చుచుండెడి వ్యాపారి • పెచ్చువగలు
మెచ్చి యచ్చెలి తమిహెచ్చి • రచ్చసేయఁ
బగటువగమీఱఁ గోర్కులు • బాఱదీఱఁ
బొగడుఁ జూపులతోఁ బడా•వగలఁ జూచె. 30

ఉ. చూచినయంతలో మరుఁడు • చొక్కపుఁ గప్రఁపుటాలపుంటలన్
లేచివురాకుఁ గ్రోవి నల•లేమ పయోధరచక్రవాకముల్
వేచలియింప వ్యూత్పుటము • బీటలు వారఁగఁ దెప్పతెప్పనన్
గోచనదాఁక నూది మది•గోలుపడన్ పడి నార్చి వ్రేసినన్. 31

క. ఊహలు కత్తుకబంటై, మోహము తలమునుక లగుచు • ముద్దియ మదిలో
బాహాబాహికచాకచి, కూహక మతిపట్టి పెనఁగి • కో యనుచు పడిన్. 32

తే. అంత నయ్యింతి యింతంత • యనఁగరాని
వంత మదిఁ గొంత చింతించి • కంతుకళిత

కుంతహతి కోర్వలేక దినాంతవేళ
మంతనంబున వెడలి గేహాంతరమున. 33

చ. ఉరిసినపల్లవెంట్రుకలు నూడినదంతము లంబకంబులన్
గురిసెడు బాష్పజాలములు గూనుపడంకెడు మస్తకంబుఁ గం
ధరఁ దగుతోలు పాదములు దర్శనము ల్బడి చీరపోఁగునూ
ల్మెరసెడు మంత్రసానిఁ గని మించెడువేడ్క నతించి మ్రొక్కినన్. 34

ఆ. అలకించి లేచి యది యెవ్వ రని చీరి, యమ్మ నీవఁటే యటంచుఁ బొదవి
యేమిపనికి వచ్చి తీసందెవేళల, ననుచు నడుగఁ దొగట వనిత పలికె. 35

ఉ. ఆరయ నిమ్మహాపురికి హాసము మీసము మీఁదఁ జిల్క వ్యా
పారి యొకండు సింధురతిభర్తను బోలినవాఁడు వచ్చె నే
నారసికాగ్రణిం గదియు నాస వహించితినమ్మ వానితోఁ
గోరినపొందు నాకు నొనఁగూర్చిన నీ కొనరింతుసంపదల్. 36

సీ. నవరైన రతనాలబవిరెకమ్మల నిత్తు, నవి నీకు మనసురావంటివేని
యాణిముత్యమ్ములహారమ్ము లొసఁగుదు, వానిపై నీ కిచ్చ పూనదేని
గరుడపచ్చలకీలు కడియంబులర్పింతు, నందుకు నీయాస సెందదేని
తళుకుఁగెంపులసందిపడలు చెల్లింతు, వానిపై నీబుద్ధి యానదేని

తే. నూసకమ్ము తీఁగెమెడనూలు సొబగు నాను, గుండ్లపేరును గైకొనక కోరినేతు
నమ్మ నావిన్నపంబు నీ వాలకించి, వాని ననుఁగూర్చు నీ నేర్పు పూని మెరసి. 37

మ. అనుచున్ వేడిన మంత్రసాని విని నెయ్యం బారఁగాఁ బల్కె నో
ననబోఁడీ నినుఁ జూడ మన్మథునకైనన్ మోహము ల్పుట్టఁగా
మనుజుం డీతఁడు భీష్ముఁడో సనకుడో మౌనీంద్రుఁడో వ్యాసనం
దనుఁడో యెంతటివాఁడు పైఁ డనఁగ బుద్ధాకోరుఁగాఁ జేసెదన్. 38

క. సౌనమందు రసముఁ బసరును, ఘనమణిమంత్రౌషధములుఁ గైకర్ణికకా
వును మొగసిరి క్రియ బంతిబ, దనిక గుళికమాల్కె బూతిఁ దవిలిచి తెత్తున్. 39

వ. అని చెప్పి వీడ్కొల్పిన. 40

క. తనయింటికి హేమంతిని, సనె నానిసిఁ గడపి మంత్రసాని రహస్యం
బున పొరుపత్తెగాఁడుం, డిన చక్కికిఁ బోయి మ్రొక్కి నిపుణత మెఱయన్. 41

సీ. దాక్షిణ్య మనురక్తి దయయు విశ్వాసంబు, బాంధవ్యము హితంబు భయము భక్తి
యంతఃకరణము సఖ్యంబుఁ బోరామియు, నేస్తంబుఁ జెలిమియు నెనరుఁ బ్రేమఁ
జల్లఁదనంబు వాత్సల్యంబుఁ గలుపుగో, లుతనముఁ బ్రీతియు మంచితనము మైత్రి
ప్రాణపదంబుఁ దాత్పర్యంబు గారాబ, మనుగుణ్య మనుబంధ మనుసరింపు

తే. మచ్చికయు జుట్టరిక మైక్య • మిచ్చకంబు
స్నేహ మనురాగ మాసక్తి • మోహనిరతి
సలిపి కడుఁ దక్కు ననిపించి • సొలయఁ జేసి
వెగడుపడ కప్ప డాత్మప్రవీణమహిమ. 42

చ. స్తుతులు ప్రసంగము ల్కథలు • సుద్దులు వార్తలు రాచకార్యముల్
చతురత రేతిహాసములు • శాస్త్రములం దగుజాతివాదముల్
సతకడము ల్పురాణములు • సామెతలుం బరిహాసకంబు లిం
గితములు జారజారిణుల • కేళిచరిత్రముల న్వచించుచున్. 43

ఉ. దేవపరాకు పహాసుకళ • దేఱెడు నీదగురూపవైభవం
బేవిధినో కనుంగొని రతీచ్ఛను బాల్పడి చిక్కి సొక్కి నీ
సేవయు సేయఁ గోరి నిను • శీఘ్రమె రమ్మని చెప్పి పంపె నో
భావజరూప యాతొగట • భామిని కామవికారచిత్తయై. 44

తే. హత్తుకొనవచ్చు నీవంటి • యంద గాని, కట్టిముద్దులగుమ్మను • గట్టుతోడ
ననిన మన సిచ్చి మటిలోన • హర్ష మెచ్చి, మంత్రసానికి విడె మిచ్చి • మమతతోడ.

క. ఆపనులకె యేఁకారెదు, తాపము గలవాఁడు గనుకఁ • దగ నాతఁడు ని
క్షేపముఁ గనిన దరిద్రుని, యేపున ముద మంది దాని • కిట్లని పలికెన్. 46

ఉ. అచ్చటి కేను వచ్చుసమ • యం బగువేళ యెఱుంగఁ దెల్పినన్
ముచ్చట దీర్తు నంచు మది • ముద్దియతో వివరించి పంపఁగా
నచ్చెలి తంతువాయకుల • టాంగన చెంగట నీప్రసంగముల్
చెచ్చెర జేయ న త్తటిని • సెట్టి దుకూలము లమ్ము వేడుకన్. 47

సీ. కలసమీపపుటూళ్ల • కాఁపుగుబ్బెతలని, మ్మళికి నాకర్షింప • మంత్రవిద్య
బచ్చుఁ బ్రాయపువృష • భవ్యూహముల నెల్ల, వఱలంగ గుమిగూర్ప • వల్లెత్రాడు
చిల్లరసరకుల • సెట్లబేరాల కిం, పుగ లాభ మొందింపఁ • బూఁటకాఁపు
పెనుకోలుకాండ్రకు • జనసమూహంబుల, గణితి మాపెడు సాయ • కప్రభుండు
తే. ముద్రగరిటియ భుజముపై • మొనయఁ బెట్టి
ఘంట ఖంగని మ్రోయ నం • గళ్ల బడిని
మరిగి తిరుగు సళాదికి • మణియకాండ్ర
కపనిబడి కాఁపు సాలింత • నలరు సంత. 48

క. అంతట నాసంతకు దన, కాంతుఁడు వస్త్రిష్ఠు లమ్మఁగా నేగిన హే
మంతిని వ్యాపారివిటో, త్పాంలిమునకు మంత్రసాని నసిపిన నదియున్.

తే. పోయి సమయంబుఁ జెప్ప నబ్జాజుఁగువేడ్క
వింత నెఱపూఁత గంధంబు విరులు సరులు
కప్రఁపువిడెంబు జిగిచెల్వఁగలుగు సొగసు
దనర హేమంతి యిలు సేరెఁ దక్షిణమున.

ఉ. చేరినఁ దంతువాయసతి సిస్తుగ వస్తులరత్నవస్తువి
స్తారసువర్ణవర్ణములు నంపద లింపొదవించుకేళికా
గారములోన దివ్య మగు కమ్మనితావుల హంసతూలికం
జేరిచి పేర మీఱుతమిఁ జీరగ మారునిపోలి కయ్యెడన్.

చ. త్వరపడి గబ్బిగుబ్బ కడవాఁడినఖంబులఁ జీఱి చీఱి పై
సిరితళుకొత్తు తేట నునుఁజెక్కులు ముద్దులు పెట్టి పెట్టి వా
తెఱ మొనపంటికొద్ది కసిదీఱఁ జుఱుక్కన నొక్కి నొక్కి యా
కరణిఁ బరస్పరంబు జయకాంక్షఁ బెనంగఁగ సంతి పైకొనెన్.

సీ. చిటిలెడుగంధంబుఁ బెటిలెడుకస్తూరి, చలియించురత్నకుండలయుగంబుఁ
గదలెడునెఱివేణి వదలెడుపువ్వులుఁ, జెమటఁ గరంగుకుంకుమపుఁబొట్టు
వికసించుకన్నులుఁ బ్రకటించుమణితము, ల్గంకణఝుణఝుణత్కారరవముఁ
బొదలెడుచనుదోయి కదలెడుహారము, ల్ఘనితంబాఘాతనినద మడర

తే. నిటల సంచల దలక ముల్కట నఖాంక, మమితవిశ్వాసమారుతం బలను గేహ
దర్శనోత్సాహిపతిచపేటప్రదాయి, యైనపుంభావసురత మత్యతివ సలిపె.

వ. మఱియు నయ్యుపరిసురతంబు తమి యెక్కువయై దృఢకుచాశ్లేషణంబు విడువఁ
యంజాలక శీతకాలంబునుఁ బ్రకటీకృతతారకంబును సంశ్లిష్టప్రియతమంబుఁ గాన
నిశాసమయంబును సంచలితపయోధరంబును నిర్గళితకృష్ణవేణ్యాదికమలంబుఁ గాన
శరత్కాలంబునుఁ బల్లవరాగసంపాదకంబునుఁ గలకంఠకూజితంబునుం గావున వ
తకాలంబును ధ్వనిప్రధానంబును గలితవిభ్రమంబుఁ గావున సత్ప్రబంధంబును గ
వసనంబును బహుబంధబంధురంబునుగావునఁ బ్రబుద్ధసిద్ధమార్గంబునుఁ బోలి వెలయ
చుండె.

ఉ. ఆసమయంబునం జెమట లాస్యముఁ గప్పగ నిండుబల్లిక
ల్గాసిలఁ జేయఁగాఁ గబళకాంక్షను జీవము వేగురింప ని

శ్వాసము బాపదీర నిజ•వల్లభుఁ డాశుభభద్రుఁ డట్ల సం
వాసముఁ జేరవచ్చి తల•వాకిలిఁ దీయని పిల్చె వల్లభన్. 55

తే. అప్పు డేరీతి నృపనాథు • నవల కనుప, సుందరీ యేయుపాయంబుఁ • జూడఁగలయు
జాణ వౌదువు జారవాం•ఛలకు నైతె, తెలుపు మని పల్కెఁ గలహంస•దేవవిభుఁడు.

క. అని యడిగిన హేమావతి, విని దీర్ఘోచ్ఛ్వాస మొనర • విడిచి నిజాంఘ్రిం
గనుదృష్టి నిలిపి మెల్లన, మునివ్రేల న్నేల గీచి • మునుకొని పలికెన్. 57

క. తెలియ దెటుపనుపవలెనో, పలుములు నే బ్రహ్మలోక•పర్యంతంబుం
గలయ వివరించి చూచితి, నలవడ దది నీవె తెలుపు • హంసబిడౌజా. 58

క. అని యడిగిన హేమావతి, కనురాగం బొప్ప రాజ•హంసం బనియెన్
వినుము నిజాధిపు డటుపలెఁ, దనుఁ బిలిచిన యువతి లేచి • తరలక ప్రీతిన్. 59

క. పిలిచిన గుండె లొటుక్కనఁ, గలఁగుచు వ్యాపారి వెడలఁ•గా నెటు లనుచున్
దలఁచినచో వెలవకు మని, నిలిచినదార్ఢ్యమున మాని•నీమణి వేడ్కన్. 60

ఉ. అత్తఱి బిత్తరై ఘనము•దాత్తసుచిత్తపుమత్తుపొత్తుతో
బిత్తరి తత్తరింపకనుఁ • జేర్కొని వాకిలి దీసి వేగమే
చిత్తజువంటినాయకుని•చెంతను నిల్చి తదీయనేత్రముల్
మెత్తనిచేత మూసి దయ • మించఁగఁ దోడ్కొనివచ్చెఁ జెచ్చెరన్. 61

ఉ. ఆపగఁ జూచి యవ్విట మ•హామకరాంకుఁడు చిత్తవీథిలో
నావగమాన మానిని•యం బొదవం గనుసైగ చేసినం
దావగు చోటికేగెఁ దద•నంతర మత్తులివేల మూసి తే
పోవఁగరా దటంచుఁ బతి • ముద్దియ నిట్లడిగెం బ్రియంబునన్. 62

తే. అటుల నడిగినప్రియభర్త • యంబకముల, మూఁత చాలించి యామించు • ముద్దుగుమ్మ
సిగ్గు కడ్డంబుగాఁ బతి•చేల మలమి, కొనుచుఁ బలికెను జిన్నెలు • కొసరు చూప. 63

చ. జలకము లాడఁ గోరి బురు•సాపని చీర సడల్చి సందులో
పలికెఁ జనంగ నీదు నునుఁ•బల్కు వినం బడఁ దల్పుఁ దీయఁగా
వెలువడి వచ్చితిన్ వలపు • వెల్లువ దొట్టఁగ నంచు నాయకుం
గులుకుమిటారి గబ్బిచను•గుబ్బల గాఁగిటఁ జేర్చి పల్కెనన్. 64

తే. భామ తనమీఁద నెవరైన • బాగుఁ జూచి
చిత్తము గరంగి శుభభద్ర•శేఖరుండు
గుణవతి పటంచుఁ బ్రియురాలిఁ • గుస్తరించి
నిండుమోదమ్మున సుఖాన • నుండె నపుడు. 65

క. ఇంతయుపాయముఁ గలిగిన, నింతీ చనవచ్చు జారు • నెనయఁగ లేదా
కాంతుఁ డెఱింగిన నృపమణి, చెంతకు నేమొగముతోడఁ • జేరెదొ చెపుమా.

తే. అనుచు రాయంచ నుడివిన • విని శిరంబుఁ
ద్రిప్పి హేమావతి ప్రమోద • మొప్పఁ బలికె
నౌనె మజ్ఝారె యదిగాక • యాఁడువారి
తల్లి యనుచును జిరునవ్వు • దలకొనంగ.

క. తెలవారె నపుడు దీపపు, కళికలతో వెల్లఁ బాఱి • గాఁ దనమోమున్
భళిర కథాలాపం బని, జలజేక్షణ సనియె కేళి • సదనంబునకున్.

చ. చని జలజాప్తుఁ డస్తగిరి • చాటున కేగినయంత మజ్జనం
బొనరిచి వ్రాఁతపుంబనుల • నొప్పు దుకూలము గట్టి రత్నకాం
చనమయభూషణంబులును • సారపుమేల్తిలకం బమర్చి ఘు
మ్మనువిరు లూని యచ్చెలి నృ • పాగ్రణి చెంగటి కేగుచున్నెడన్.

మ. కని చక్రాంగబిడౌజుఁ డిట్లనియె శృం • గారంబు లెస్సాయె మే
ల్దనరారెన్ భళి హొంతకారివిగదే • తన్వంగి రాజాంతికం
బునకుం బోయెద వేమొ యొక్క కథ యొ • ప్పం దచ్చమత్కారము
ల్విని పోనిల్పిన నంటిపండ్లనె ననున్ • వ్రేయించు మంత న్వెసన్.

క. అన విని హేమావతి మో, మున నవ్వు జనింపఁగ తల • మునిపుట్ట సుమీ
కన నీదుకడుపు బ్రహ్మకు, వినఁ దరమా యనుచుఁ బలికి • వినుపింపు మనన్.

క. కప్పురఁపుతునుక లలవడ, విప్పుగ విరితేనె వాన • విడివడి కురియం
జొప్పడర హంస సురపతి, సెప్పెను హేమావతీ కు • శేశయముఖికిన్.

## నాలవకథ.

క. ఆలింపు మహాభ్రంకష, కేళీ ప్రాసాదనీల • ఘృణిగాఢతమః
పాళీ సతతవిహారిసు, రాళీ పురజాల్మకులట • మై సర మనఁగన్.

తే. పుర మొకటి యుల్లసిల్లు సం • స్ఫురితపూర్ణి
మానిశాకరధిక్కారి • మంజులాస్య
యందు నొకగొల్ల సంపల్ల • తాంగి పిల్ల
విజయుఁ డనుపేర సిరులచే • వెలయుచుండు.

సీ. కంబళితలదుడ్డు • కవ్వము మజ్జిగ, బాన గొడ్డలి నుచ్చు • పాఁతలగుది
కావడి యుట్లు చి • క్కము సంది కడియంబు, నూకలతోఁప పొ • గాకులిత్తి

బొప్పి మజ్జిగముంత • బొటమంచిపిల్లల, గూడు దామెనత్రాడు • క్రొత కత్తి
తోర్లుగట్టైయుఁ జల•దుబ్బచిలుకుడుగుంజ, బూజబిందెలు వెన్న•పూస చట్టి
తే. పాలబుడిగలు వడిసెల • ప్రాఁత మెట్లు
మలపమందులపొడి బుజ్జి • మన్నె ముల్లు
తోలుకుళ్లాయి తొడుపును • దొడ్డికంప
చుట్టు చవిరెయుఁ గొమరొప్ప • సొలయు నతఁడు. 75

చ. కుఱుబలిదోరచారనల•గుం డ్లెఱగొండిలిమూలబొల్లివిక్
నఱిగివి నెట్టుబోడు పులి • నల్లని వెట్టవిపుల్ల చిల్లవిక్
బఱిగివి మొట్టివిక్ గరక•పల్లవి నాఁ దగుపేళ్ల నొప్పెడుక్
గొఱియలు వేనవేలుఁ గల•గుంపుల సంఖ్యము లుండువానికిన్. 76

తే. బోడ పొడమట్టినామంబు • బొల్లిపూరి, జాలనల పుల్లవెరబట్ట • చార బరగి
కఱుసుగడ్డము తెలిమొట్టి • గారదోర, వనెడు పేరుల మేకగుం • పతనికుండు. 77

తే. మట్టె చేవటె కరపస్సె • మైలబట్ట, కొరతలపూజ దెఱ్ఱని•చార బోడ
పొడకపిలె కన్నె బొలిచుక్క•పుల్లవి యను, పేళ్ల నొప్పారి మందలోఁ• బెక్కుగలవు.

క. పల్లవి నల్లవి యెనుములు, బిల్లల నిడుగోడిగలును • బెంపుడు పెదపో
ట్టెళ్లును దుక్కడ్లును విల, సిల్లఁగ నావిజయుఁ డచట • సిస్తుగ నుండున్. 79

క. అతనికి మంజుల యనఁగా, సతియొక్కతె గలదు దాని • సరి యెన్నఁటకుం
గొలుకుపడు రతికిఁ జతురత, యితరుల నీక నెన్న నేల • యిందునిభాస్యా. 80

క. అవులుక్క లారెయొయ్యారము, లాగనుదమ్ముల మెఱుంగు • లాగొను బెడం
గాకుచయుగ్మము బింకం, బాకోయిలనుద్దుఁబల్కు • లతివకె చెల్లున్. 81

క. ఆబిడ గగ్గోళ్లప్పత్తికి, నై బగిసియు మాలి పతిర•తాదృతిమీఁదక్
ల్లోఁ బోడమున రుచిమించినఁ, బ్రాబల్యము గలుగు విటుల•పాలిది యయ్యెన్. 82

సీ. వేశ్యాపతిచకోర•విసరంబులకు నురి, విట మృగావళికి ల•విత్రకంబు
యువరాజికరులకు • నొనరాకు నోదంబు, కాముకవ్యాఘ్రంపు • గమికిబోను
పాంథమానసమత్స్య•పటలికి గాలంబు, పల్లవోక్షములకు • నల్లెత్రాడు
షిద్గకపోతరా•జికిఁ జేరు దీమంబు, లలిభుజంగవిహంగ•ములకు జివుకు
తే. జారకిరిపంక్తులకు మోటు • సరసశశక, ములకు గట్టువయుపకాంత•ముఖ్యచటక
సంఘములకును గుబ్బిక•శంబరాళి, ఘోరరణహారి జయభేరి • ఘోషనారి.! 83

తే. ఇత్తెఱంగునఁ జిత్తజా•యత్తచిత్త
వృత్తిఁ గైకొనిఁ జారుల•పొత్తు సలిపె

నలనటయు వేసటయు లేక • యటుల నయ్యుఁ
జూలు గాంచఁగలేక యా•సుదతి గుంది. 84

చ. తిరుమలకంచిపుప్పగిరి•తీర్థములుం జని కొంగుముళ్లతో
వరములు దంపతు ల్వడయ • నారిగఁ గాన్కలు వైచి యంతటన్
బరికలు దృష్టిదీపములుఁ • బన్నినగద్దెలు పెట్టి యేమిటన్
గర మగు పుత్రవాంఛకడఁ • గానఁగలేక విచారఖిన్నలై. 85

వ. ఉన్నసమయంబున. 86

ఉ. కొమ్ములు వీరణాలు జిగి•గుల్కెడుద్రావ్ఁతల కృష్ణలీలలం
గ్రమ్ముగుడార్లు పీపఁ డగు • కాటమరాజుకథానులాపముల్
బమ్మినపుస్తకాలు ముఖ•పట్టికకట్టురుమాలలున్నెతా
సొమ్ములు నామము ల్వెలయ • సుద్దుల గొల్లలు వచ్చి రెంతయున్. 87

వ. ఇట్లు వచ్చి. 88

సీ. ఫెళఫెళవీరణాల్ • ఖళిపెళివాయించి, పోటుబో కొమ్ములు • నాట నూఁది
దొనకొండగంగను • దోలుత సన్నుతిచేసి, కృష్ణున కతిభక్తిఁ • గేలుమోడ్చి
యాదికాలపుగొండ్ర • నందఱఁ గొనియాడి, తాతతండ్రులపేళ్లు • దలఁచి పొగడి
బిరుదుల నరుమగాఁ • జేర్కొని మొఱయించి, దీవించి వీరుల • త్రోప లెన్ని

తే. కులము పెద్దలకథ లామి•కొనఁగఁ జెప్పి, సివము పుట్టించి పుత్రులఁ • జెందఁగలరు
వీరులను గొల్వుఁ డని తెల్పి • వీడుకొల్పఁ, జనిరి సుద్దులగొల్లలు • సంతసిల్లి. 89

వ. ఇట్లు నారలు సెప్పిపోయిన నత్యంతభక్తిశ్రియపూర్వకంబుగా నంతట. 90

మ. కొలిచెంగాటమరాజులన్ నతులు చేఁ•కూర్చెన్ మహాకీర్తకుం
బొలమున్ రాజుల నెంతభక్తిపరతం • బూజించె నాగంగసన్
వెలయన్ వేటలు బోనమున్ సిదులు గాం•వించెన్ సుతోత్పత్తికై
చెలి యాలాగుననల్ప దైవముకృపన్ • సిద్ధించెఁ దద్వాంఛయున్. 91

వ. అంత. 92

ఉ. మోముపహించెఁ దెల్పి జిగి•మోవిపచు ల్దిగ సందడించె మృ
త్స్నమతి మించెఁ జన్మొనలు • శ్యామలకాంతి వహించె యానముల్
వేసుట మందగించెఁ గడు•వృద్ధి భజించెను గౌను చిట్టుముల్
రామకు సంభవించె నభి•రామతరంబుగఁ జీర చిక్కనన్. 93

తే. అంత నొకనాఁడు శుభముహూ•ర్తాంతరమున
మంజులాంగన రంగైన • మంచిమణాల.

నోఁజపుగాఁ దీర్చి కట్టిన•యొక్క దివ్య
మందిరములోనఁ జిన్నికు•మారిఁ గనియె. 94

చ. వడఁకెడుకౌను రంగుతల•వాసెనగట్టినకొంగు పుక్కిటన్
విడియపుఁజొంగుమైలఁ గొని•వ్రేలెడుచేలచెఱంగు పాలచే
పుడు చనుదోయిపొంగు వన•పూసలవింతబెడంగు నూనె క్రొ
మ్ముడిపచి చుక్కబొట్టమర•ముద్దియ యొప్పెను బిడ్డకాన్పునన్. 95

వ. అంత. 96

క. అది ప్రతిపచ్ఛశిరేఖా, భ్యుదయమువలె దినదినమ్ముఁ•బొడలెడుకళలం
బొదువంబడి లేఁబ్రాయఁపు, మద మెక్కఁగ ముద్దుగులికె•మన మలరారన్. 97

క. చన్నులపస యటుమీఁదటఁ, గన్నులపస ముద్దుగులుకఁ•గలముఖమున మే
లొక్కిన్నెలమిస జిగిబిగిపగ, చిన్నెలమస చూచి పలచుఁ•జిత్తజుఁ డయినన్. 98

తే. తమకమున కొగ్గ దనెడునేరము ఘటించి
తరుణతను వెళ్లఁ గొట్టింపఁ•దలఁచి మదనుఁ
డీర్ష్యగుండలు వెళ్ల వేయించె ననఁగ
బాల్యము సనఁగఁ గుచము లే•ర్పడియె సతికి. 99

తే. కొమరెపాక్కిలిబంగారు•కుందె నందు, రతియు శృంగార మనుధాన్య•రాశి నించి
దంచ నిడినట్టిరోకలి•సంచుమీఱి, రోమరాజి దనర్చె నా•రూఢిగాఁగ. 100

క. చెంది రమా మెయిసిరి సిరి, మందిర మామోము గోము•మదనాలిలస
న్మందిర మాకుచయుగ మిం, దిందిర మావేణి యనఁగ•నెలఁత రహించున్. 101

సీ. రాణించు నెఱకురు•ల్వేణి కందకమున్న, కనుబొమ ల్వక్రిమఁ•గనకమున్న
జిగిగుబ్బలు మొగాన•కెగయ నిక్కకమున్న, నునుఁబలుకు నేర్పు నై•కొనకమున్న
చూపులఁ జులుకగాఁ•జూడ నేరకమున్న, కేను లమరుకథ•ల్వినకమున్న
లలితయానము మదా•లసత బూనకమున్న, కటసీమవిస్తృతిఁ•గనకమున్న

తే. చిత్తజుఁడు తమ్మిపూఁదూఁపు•చెఱకువింటఁ
గూర్చి గుటిచేసి తనునేయ•గొల్లవనిత
మమత గని చోరసురతసా•మ్రాజ్యమునకు
దిట్టతనమునఁ బట్టంబు•గట్టుకొనియె. 102

వ. ఇవ్విధంబున ఘోషకన్యారత్నంబు శైశవయౌవనసమయంబున మన్మథప్రేరితయై
విజృంభించి వర్తించునప్పుడు. 103

సీ. చిన్నిచన్నులుగోళ్లఁ•ఓరఁ జెక్కలుగొట్టుఁ, గౌగిలించు పటంచుఁ•గదియఁ దివురు
గిలిగింత లొకకొన్ని•కలయంగ నెనయించి, మోవి నొక్కు పటంచు•మొనసి నిలుచు

నిచ్చకం బిగురొత్తఁ • బచ్చిచేరఁగఁ బల్కు, ముద్దిడరా యని • యొద్ది కవుగు
బకదారి కవకివ • లాకదార్తిమైఁ జూపి, తనిఁ గూడరా యంచు•దరికి నేగు
తే. సుపరతికి నెంచుఁ బరిహాస•కోక్తులాడు
చేష్ట లెనయించుఁ బొలయల్కఁ • జేతఁ గుందు
వెతల నేకాయు మది నిట్లు • విటులఁ జూచి
చిత్తజోన్మత్తయై గొల్ల•చిన్నెలాడి. 104

చ. జిగినెరవన్నెకాఁ డెదుటఁ • జేరినవేళల ముద్దుగుల్కఁ మె
ల్లఁగ నడపం దొడంగు ఘన•లౌల్యము చూపులఁ జూచి మోహపుం
బిగువునఁ బల్కరింపఁ జను • బెళ్కుచుఁ బయ్యెదకొంగు దీఁటుఁ జె
క్కుఁగఁ జిఱునవ్వు నవ్వు నొడఁ • గూడిన సిగ్గున నేగు నవ్వలన్. 105

తే. ఇట్లు చరియించు నయ్యింతి • యొమ్మై లెడెఁగి
పొరుగున నె యుండెడునియోగి•పుత్రుఁ డొకఁడు
జారశేఖరుఁ డనుబ్రహ్మ•చారి మీఁటి
యొంటిపాటైనఁ దెరవులో • నొడిసిపట్టి. 106

మ. అసమాలాపమ చుంబితాధరమ శ•య్యానోన్యవిక్రీడితం
బసమాలింగన మస్థిరోత్సవ మధై•ర్యస్తంబతాంబూలితం
బసువంతాంకమ నిర్భయం బమణితం • బస్రస్తనీవ్యాదికం
బసిధారావ్రత మైనచోరరతికా•ర్యం బప్డు సంధించినన్. 107

సీ. చిఱుచెమ్మటలతోడఁ • బెరసిన ఫాలంబు, కసవంటిపీడిన•కప్పుఁ గొప్పు
కడురక్తిమను గల్గు • గండస్థలంబులు, వెనకవు దిగజాఱి • వ్రేలుసరులు
పులకలు నిండారఁ • బొడమిన దేహంబు, ధూళిధూసరితమై • దొరయు పేఁపు
మందస్మితం బగు • మధురాధరంబును, మందవీక్షణనమ్ర•మస్తకంబు
తే. తడఁబడ వడంకుచుండెడు • తలిరుఁదొడలు
వదలిన బిగించి సవరించు • వలువ దనరఁ
దిరిగి చూచుచుఁ దనయింటి• తెరువుఁ బట్టి
గొల్లప్రాయంపుఁ జిల్కల•కొల్కి సనియె. 108

క. అది మొదలు జారశేఖరుఁ, డొదవినయుపు డెల్ల గొల్ల•యుగ్మలి నెంతో
మద నాహవమునఁ దేల్చుచు, మది మీఱఁగ మరుని లంకె • మానిసిఁ జేసెన్. 109

క. చలి విడిచి జారశేఖరు, కలయిక చవి మరిగి తెరువు • కావెట్టుక ని
చ్చలులేని పనుల నెన్నే, నలవఱుచుక యుండు విరహ • మగ్గల మైనన్. 110

ఉ. కమ్మనిజున్ను మంచినెయి • గట్టిది మీఁగడతోఁ బెరుంగు చొ
క్కమ్మగు జున్నుపాలు చిలు • కమ్మికి దీసినవెన్నముద్ద వె
చ్చమ్ముల కైదునాల్గు దివ • సాలకు మాడలముల్లె లిమ్మెయిం
గిమ్ములఁ దెచ్చియిచ్చు రతి • కిం బతిమాలుచుఁ బిల్చు నిచ్చలున్. 111

తే. ఇటుల నజ్జారశేఖరుఁ • డేలఁబట్టి
యింటిలో నున్నవస్తువు • లెదురువెట్టి
వలపులకుఁ జిక్కి కేరడ • ములకు జొక్కి
సంగమసుఖంబు కొన్నాళ్లు • జరిపెఁగన్నె. 112

ఉ. అంతటఁ బెండ్లిచేసెద మ • టంచును దత్సతి తల్లిదండ్రు ల
త్యంతమహోత్సవంబునఁ గు • లావళితోఁ దగు రూపరేఖలం
గంతునిఁ బోలునట్టి మృదు • కాయము గల్గినవాని నొక్కశ్రీ
మంతుని జూచి తెచ్చియుఁ గు • మార్తె వివాహముఁ జేసి రెంతయున్. 113

తే. వేడ్క దలఁబ్రాలుగాఁ జేసి • నాగవల్లి, యైనపిమ్మట నత్తింటి • కనుపఁ దలఁచి
పయన మొనరించి నెమ్మదిఁ • బ్రమద మలర, ననుఁగుఁగూఁతును నల్లుని • ననిపిరపుడు.

ఉ. మువ్వెనతీరుగాఁ బసపు • తో నలరించినబొట్టు నున్నఁగా
దువ్విన కొప్పువన్నెగల • దుప్పట మొప్పు విడెంబు పుక్కిటన్
మవ్వపుఁ బోఁగునూల్ రవల • మట్టెలు చేతులఁ బూలగాజులున్
నివ్వటిలంగ గోపహరి • ణీశ్వరశేఖరు పోవ ముందటన్. 115

సీ. సద్విజరాజసం • శ్రయమహాస్పదలీల, శాఖలు కనుబంత • చయముఁ బ్రోఁక
సాంద్రవర్ణక్రమ • స్థాయిత్వమున మించు, జటల నంతావాప్తి • పటిమ మెరయు
విష్ణుపదార్పిత • విహితవృత్తిఁ దనర్చు, నగ్రము ల్సప్తాశ్వ • ననుకరింప
నహిలోకరాడ్భూష • ణాధారమై యొప్పు, మూలంబు కుండలి • ముఖ్యదొరయఁ

తే. దనమహాగమవిఖ్యాతి • ధరణిలోన, నఖిలజనులకు నద్భుతం • బావహిల్లఁ
దేటపడఁగాను జూపెడు • తెరఁగు దోఁప, మలసి చూపట్టెఁ బథి నొక్క • మఱ్ఱిచెట్టు.

క. ఆవటభూజము చెంగటి, త్రోవను ముందట విభుండుఁ • దొయ్యలి వెనుకం
బోవంగ జారశేఖరుఁ, డావెలఁదికి నెదురుపడియె • నంతన్ వేడ్కన్. 117

చ. తమకముఁ బట్టఁ జాలక ప • థంబున ముందరఁ బోవుభర్త వి
క్రమము దలంచఁ బోక యధి • కంబగుమోహము నిల్పలేక వే
గమె యెదురించి వచ్చు నుప • కాంతుని వల్లవకాంత తెప్పనం
గమకముఁ జేసి గుబ్బకవ • కౌఁగిట దార్చి సుఖించె వేడుకన్. 118

తే. భ్రామికలు దీర నన్యోన్య•భాష లూరఁ, గలయికలు జాఱఁ దాపాగ్ని•కణము లాఱ
సౌఖ్యములు మీఱఁ జేష్టలు•సరణి దేఱఁ, జెలఁగె నయ్యిద్దఱకు దృఢా•శ్లేషణములు.

క. ఆయెడ నిజపతి సతిరా, దాయె నని తలంచి మరలి • తనుఁ జూచినచో
నాయింతిపతికి హితముగ, నేయనువున బొంకవలయు • నెఱుఁగింపఁగదే. 120

క. ఆమాడ్కి హంస మడిగిన, హేమావతి యనియె నెవ్వ • రిసు నిక్షేపం
బేమతి వారే కనవలె, నేమనుచుం దప్పఁ జాల్చె • నెఱుఁగింపు మనన్. 121

ఉ. హంసహిమాంశు డిట్లనియె • నయ్యలివేణికి భర్త చూడ జా
రాంసమునందు వ్రేలు కుల•టాంగన దేహము కంప మొంద సా
యంసమయాదిఁ గోకివలె • నారట మందుచు వీఁపుదట్టు మో
పుంసవరా యటంచు విట•పుంగవు కర్ణము నాటఁ జెప్పినన్. 122

తే. జారశేఖరుఁ డాగొల్ల•సకియ నపుడు, వీఁపుదట్టుచు వెఱసకు • వేయటంచు
పలుకరించెడునంతలో • బలువువాఱి, దాని ప్రియనాయకుఁడు భీతి • డాయ వచ్చె.

క. వచ్చి యిది యేమిచెలి యని, విచ్చలవిడి వీఁపు జఱచి • వెఱువకు మని లోఁ
జొచ్చిన భయమున సదరిన, గచ్చుగ నిట్లనియె గోప•కన్యకపతికిన్. 124

ఉ. సుందర నీవు పోవ భయ•మున్ వెదచల్లెడునీ వటద్రుమం
క్రందనఁ జూచి గుండెలు వ•కావకలై వెతఁ బొంది యీదయా
తుందిలుపొందునం బ్రతుకు•త్రోవకు వచ్చితి లేకయున్న నా
కుం దరిలేక యొంటి నిట • గుందుదుఁ గాదె యనుంగువల్లభా. 125

క. అని చెప్పి నిజేశ్వరుచే, తనుదనమోహంపు విటునిఁ • దద్దయుఁ బొగడిం
చిన లినలోచన వేడుక, దనరారఁగ జనియెఁ బతియుఁ • దానును సరణిన్. 126

క. అట్టియుపాయము నీకుం, దట్టిన నృపుపొందుమాట • దలఁపుము లేదా
గట్టిగ నీమగఁ డెఱిగిన, యట్టయినను సిగ్గుపాటు • లౌగదె చెలియా. 127

ఉ. నావిని హంసపల్కు పద•నంబున హాసము దోఁపఁ బల్కె హే
మావతి యద్దిరా మగల•మాఱ్చ నెలం తది గాక యింక క
ద్దా వివరించి చూడ వసు•ధాస్థలిలోనను సంతలోపలన్
వేగిన కేళికాగృహము • వేగఁ జనెన్ నృపమోహమగ్నయై. 128

వ. మఱియు నయ్యహర్ముఖం బప్రకాశమానకావ్యలక్షణం బయ్యును బ్రకాశమానకావ్య
లక్షణంబై యనిద్రాళువనాంతరాళపుండరీకసముదయం బయ్యును నిద్రాళువనాంతరా
ళపుండరీకసముదయంబై యప్రస్ఫుటీకృతకువలయం బయ్యును బ్రస్ఫుటీకృతకువలయంబై
యవిభాసమానద్విజరాజం బయ్యును భాసమానద్విజరాజంబై యవిభాసితతారాళిగణం
బయ్యును విభాసితతారాళిగణంబై యొప్పె నప్పుడు.

క. ఒకనిమిషం బొకమాసం, బొకఘటికయ యొక్కయయన • మొకజామొకయే
డొకదిన మొకకల్పముగా, సకి గడపెం బవలు విరహ•సంతాపమునన్. 130
క. రవి యసెడు కాలచక్రము, దివసాంతప్రళయవేళ • దీపాగ్నులచే
దివిఁ గాల్చి యడఁగ నమ్మషి, నివహం బన ఘోరతమము • నిండెం బెలుచన్. 131
వ. అప్పుడు. 132
ఉ. చందురుకావిపావడప•స ల్వేలిఁ జిమ్మగఁ జల్వగట్టి కా
లందెలు సందిదండలును • హారములు న్మణికుండలమ్ములుం
బొందుగఁ దాల్చి వాసిలెడు • పూలసరు ల్కచసీమఁ జుట్టి పొ
ల్పొందఁ గళాన గందవొడిఁ • బూసి మృగేక్షణవచ్చి నిల్చినన్. 133
క. చూచి కలహంస మిట్లను, వాచావైచిత్రి మెరయ • వనితాచోద్యం
బై చెలువొందిన యొకకథ, యాచించి నృపాలుకేళి • కరుగు మటన్నన్. 134
క. ఆమధురతరసుధారస, నీమాసామోక్తిధార • చెవులకు నెంతో
యామోదము చేసిన విని, హేమావతి యనుగ హంస • మిట్లని పలికెన్. 135

## అయిదవకథ.

శా. జంబూద్వీపధరారవిందముఖి కం•చద్భూషణప్రాయమై
సాంబప్రస్తమనంగ నొక్కటిమహా•స్థానీయ మొప్పారు ర
మ్యంబై యప్పురిలోన నుండు హరిశ•ర్మాఖ్యుండు విప్రాన్వవా
యంబుల్ శోభిలఁ జేయుకర్మఠుఁడు క•ళ్యాణాంగి యాలింపుమా. 136
సీ. బలుకంచు గుబ్బబో•ర్తలు పులుతీసెల, వాకిలి నడవ చా•పడియు మగులు
నఖిలవస్తువుల ధా•న్యముల కణంజలు, దేవతార్చనమిద్దె • తావిపడక
యిలువంటకొట్టంబు • పలుగాఁడి పసిదొడ్డి, పనసాను పందిరి • బావి తోట
మడిసంచిదోవతి • మడశత్రవే ల్దండెంబు, ధమనికుండంబు బృం•దావనంబు
తే. నత్తుతలచిప్పసానచి•త్రాసనము:ను
గిండిచిటిచాపపళ్లెంబు • గిన్నెపెట్టె
కుళసమిత్పత్రములు పెట్టు • గొప్పయటుక
యమరఁ గాఁపుర ముండు న•య్యగ్రజుండు. 137
చ. అతనికి హేమచిత్ర యను • నంగన ద్రుంగినవెన్కఁ జారుభా
స్వతి యను ముద్దుగుమ్మను వి•వాహ మొనర్చిన నింతి యట్టె య
య్యతనుని చేతికత్తి చివు • కంతయుఁ బోయినఁ బేవఁ జిక్కిన
ష్మతి నెలజవ్వనంబు పొడ•మన్ జిగిచేకొను దేహసంపదన్. 138

క. ఆపటుకుచములచందం, బా పెద్దపిఱుందుమంద • మామో మందం
బాపాంకం బాబింకం, బాపంకజముఖికె కాక • యన్యకుఁ గలదే. 139

ఉ. ఆమధురోష్ఠి గుబ్బకవ • నబ్బినసిబ్బెపుఁదళుక్కు లంద మా
యామృదులోరుకన్నుఁగవ • నన్నువ వెన్నెలలొల్కుచందమా
యామితమధ్యసోముకళ • లానినమోము మెఱుంగులంపమా
యేమని చెప్పవచ్చు నలి • నేక్షణ యాచెలిరూపసంపదల్. 140

తే. వక్రయానంబుతో నాగ • చక్రకుచలు, నిలువుఁ గన్నులతో దేవ • నీలకచలు
నాతిమృదుగతిచపలేక్ష • ణములకలికి, క్రిందుమీఁదయ్యెఁ గాదె పూ • ర్ణేందువదన. 141

సీ. నెఱిగొప్ప మేఘసం • దేశంబు కనుఁదోయి, యందమా కువలయా • నంద మరయఁ
బొంకపుమోము ప్ర • బోధచంద్రోదయం, బధరంబు మణిసార • మారచూడఁ
జెలువంపుఁ జిఱునవ్వు • సిద్ధాంతకౌముది, స్తనయుగంబు రసమం • జరి నుతింపఁ
గరరుహంబులకాంతి • కావ్యప్రకాశిక, ఘననితంబము రసా • యనము తలఁపఁ

తే. దను వలంకార మతనుశా • స్త్రములు చూపు
లహహ మధ్యంబు నాటకం • బవనిలోన
విద్యలకునెల్ల మూల మీ • వెలఁదిఁ గనిన
విద్యలు పఠింపఁగా నేల • వేఱెబుధులు. 142

వ. అది మఱియును. 143

చ. బుగడలు నానుతీగె మెఱు • పుల్గనుకమ్మలు గుండ్లపేరు బ
ల్పగడపుఁ జేకటుల్ రవల • పల్లెఁకపువ్వులు కుప్పె సౌరముల్
జిగికడియంబులాణిమణి • చెక్కినముక్కెర గిల్కుమెట్టెలున్
సొగసు దలిర్ప నచ్చెలియ • సొమ్ముల నెమ్మెల నొప్పు నెంతయున్. 144

సీ. కప్పుఁగొప్పుఁ బడాబ • గలఁ జూడనిఘనుండు, వదనంబునకు వింత • పడనిజనుఁడుఁ
గన్నుల కాశ్చర్య • గరిమఁ జెందనివాఁడు, సరసభాషలకు మె • చ్చనినరుండు
గబ్బిగుబ్బలతీరు • గాంక్షింపనివిటుండుఁ, గౌను నుతించని • కాముకుండుఁ
గటికిశిరఃకంప • పటిమఁ బూననిమర్త్యుఁ, డంఘ్రులు బాపురే • యననివిటుఁడు

తే. నాస్తి యనృతంబు దబ్బర • నహి హుళిక్కి
కల్ల మఱియిల్లలేదు భూ • గతులలోనఁ
గ్రమ్మి జిగిఁ జిమ్ము నమ్ముద్దు • గుమ్మ హొయలు
చెలువ మెటువంటిదో కాని • చిగురుబోఁడి. 146

సీ. పాపట యిడి సూసె•పంకెనతోనున్న, గా దువ్వి నెఱులు కీ•ల్గంటు వైచు
నెర యొఃయారముతోడ • నీటికాఁగులనీడ, చూచి కుంకుమబొట్టు • సొంపుదీర్చ
గంధంబుబూసిన•గతి గబ్బిజిగిగుబ్బ, కవమీఁద గుత్తంపు•రవికె దొడుఁగు
నుమ్మైత్తపూరీతిఁ • గ్రమ్ముకుచ్చెలసేల,జీరాడఁగాఁ జల్వ • చీరగట్టు
తే. నీటుబెళుకున దిగజార • పైఁటచెరఁగు
జగ్గుతో దోపుఁగాటుక • నిగ్గుకనుల
మిక్కుటపుఁ జూపు మెఱుఁగు త•ళుక్కు మనఁగ
వెడలు నొకవేళగృహము న•వ్విప్రవనిత. 146
క. పతిరతిని దృప్తిఁ బొందక, మతిఁ జపలత పుట్టి యన్య•మానవురతికై
హితముపడి మోహదశలకై, బతిమాలి కృశించుఁ జాయ•భాస్వతి యెపుడున్. 147
తే. పురములోఁ గల్గుమోహంపుఁ • బోగరు చిగురు
కోడె నెరజాణవిటులకుఁ • గొంతకొంత
వింతరతితంత్రములు నేర్పి • విడిఁబడున్న
కంతుమదదంతిపంతంబు • గదియుఁ దిరుగు. 148
క. ఈలీల గొంతకాలము, బాలామణి సంచరించు • ప్రాయమునాఁడే
కాలూదియున్న యిందిర, తాలిమిచెడి నిలువ కచటు • తలఁగినయంతన్. 149
సీ. కులమహీరుహమహా•క్రూరకుఠారంబు, కోపాగ్నివృద్ధి కృ•ద్ఘోరవాడి
సంసారసుఖశైల•శతకోటిపతనంబు, దేహవ్యధాలతా•దోహదంబు
శశిముఖీదృక్పాత•సంరోధిజంబీర, ఫలరసం బతిధైర్య•ధర్మకషము
ప్రతిభాంబుహృద్గ్రీష్మ•పవనంబు నిజవధూ, రచితనిందాసార•నిచయఘనము
తే. సంతతాహారిసంపాది•సంభ్రమప్ర, యత్నవిఘ్నదమతనుత్సు•ధాత్రిదాయి
యమితలఘుతాశ్రయస్థాన•మై కడంగు, భూరిదారిద్ర్యదోషంబు • పొదలె నపుడు.
క. అట్టిమహాదారిద్ర్యము, దొట్టిన హరిశర్మధృతియుఁ • దూలకతృష్ణం
గొట్టుపడకుండఁగాఁ దన, పట్టపుటిల్లాలిఁ గష్ట•పడి పోషించెన్. 151
సీ. పంచాంగములు సెప్పి • బాజాపులోపల, రంజిల్ల యాయవా•రంబులెత్తి
తలమీఁద మంత్రాక్షు•తము లుంచి కలకాఁపు, టిండ్ల నుపాదాన • మెత్తి తెచ్చి
గ్రహణసంక్రమణాది•కాలంబులను రాచ, నగరాశ్రయించి దా•నములుపట్టి
తిలలు దర్భలు పూని • తీర్థసన్నిధిమంత్ర, ములు సెప్పి నీచకా•సులు గడించి
తే. జన్నిదములమ్మి గ్రహశాంతి • జపముఁ జేసి, శవములను మోఁచి దుర్దాన•సమితిఁ గొగ్గి
వచ్చునాదాయములు గ్రాస•వాసములకుఁ, గాఁగ దినములు గడపె న•క్కాలమునను.

శా. అంభోజప్రియతిగ్మదీధితిచయవ్యాఘాతనిర్భగ్నభూ
గంభీరోరుజలోద్గతాధరజగత్క్రూరాజరాడ్భోగస
చ్ఛుంభద్రత్నఘృణీభ్రమప్రదకనత్సూర్యోపలజ్వాలికా
జృంభత్పావక మొక్క వేసవి జనించెం గాలకూటాభమై. 15

చ. శరచరసాధ్వసప్రదము సర్వబకౌఘమదప్రదాయకం
బురుజలహైన్యకారము సముజ్జ్వలసాంద్రమరీచికాసము
త్కరవనరూపకారకము గాఢపయోధివియోగకార్శ్యభీ
కరతటినీతనుప్రదము కాసరభీష్మము గ్రీష్మ మెచ్చెనన్. 15

చ. పవలను వర్తకాగ్రణి నభశ్చల సాగరమధ్యమంబులో
రవి యనునోడమీఁద నపరక్షితిభృత్పురిఁ జేర రామరు
జ్జగతి సుళ్ళఁ బెట్ట నది సాగక చిక్కినమాడ్కి సూర్యుఁ డ
య్యవసరమందు మందగతు లానినదీర్ఘము లయ్యె ఘస్రముల్. 15

తే. మల్లికాకుంజపుంజాబ్ధిమధ్యమున మ
రీచికాస్వాతివృష్టి గురియ జనించి
పత్రపుటశుక్తు లెండలఁ బగుల బయలు
పడినముత్తెము లన మొగ్గ లడరఁ దొడఁగె. 15

సీ. దేహంబు బలువెట్టదీసి సిస్తుగ నుండుఁ, జలువగాఁ బన్నీట జలకమాడి
ఘనసారయుక్తమై తనరారు పాటీర, పంకంబు తనువున నింకఁ బూసి
విమలనాగరచూర్ణవిహితమౌ మాహిష, దధ్యోదనము ప్రొద్దుతరి భుజించి
బహుళేలామజ్జకప్రసవసౌరభమిశ్ర, శీతలజలముల సేవఁగలిగి
తే. కప్పురపుఁదిన్నె లమర బూఁజప్పరములఁ, జిగురుఁ బాన్పున వసియించి శీతవా
జాతకరతాళవృంతము ల్సతులు వీవఁ, బ్రొద్దు పుచ్చిరి కొందఱు భోగు లపుడు. 15

తే. అట్టివేసవివేళ ధనాఢ్యుఁ డైన, యచ్చటిపనియోగి చలివెంద్ర లాదియందుఁ
బెట్టఁ గట్టడిఁ జేసినఁ జేద లగుటఁ, జాతుభాస్వతిహరిశర్మ జేరి రపుడు. 15

సీ. లవణశుంఠీజంభలరసానుయుక్తమౌ, నీరుమజ్జిగకుండ బారు లలర
లఘువృతైలామానలలితసౌరభమిశ్ర, శీతలజలకుంభజాత మమర
జీరకకైడర్యచారుగంధములొల్కు, పలుచనియంబళ్లు పంట్లు దనర
రవయుప్పు నీరుల్లి రసము నించినకోళ్లు, గంజికాఁగులగుంపు కడురహింప
తే. గంధబర్హిష్టలామజ్జకప్రశస్త, కాయమానసుహుశ్మహకాయమాన
మందపవమానఘనసార బృందవేది, కాలయవిళాసపానీయశాల యొప్పె

వ. మఱియు నచ్చలిపందిరి గవాక్షాదిసమాకలితవాయుసంచారంబు గావున రఘురామమనోరంజకంబును బాంధవజనసంతాపహరణంబు గావున సత్కృతసంగమంబును గబంధప్రచురంబు గావున దండకావనంబును సితాభ్రసంచయకలితంబు గావున శరత్కాలంబును నమృతసంపూర్ణకుంభంబు గావున సురేంద్రనివాసంబును ఛాయాసమేతంబు గావునం దపననిలయంబును వివిధకుసుమసుగంధబంధురంబు గావున నారామంబును బురుడించు నప్పుడు. 160

క. అచ్చలిపందిరిలోపల, వచ్చుచుం బొయ్యేటిపరస • వారికి జల మం
దిచ్చుచును జారుభాస్వతి, యచ్చట హరిశర్మయుండు • నాసమయమునన్. 161

చ. ఉపమరిబుద్ధిశాలి వినయోత్తముం డప్రతిమప్రభావళీ
తపనుం డవార్యధైర్యుఁడు సుచారచరిత్రుఁడు సర్వసత్కళా
నిపుణుఁడు రూపనిర్జితమనోరుహసాయకుఁ డొక్కవిప్రుఁ డా
తపపరితప్తుఁడై జలముం ద్రావ బ్రపాస్థలిఁ జేరి వేఁడినన్. 162

తే. చారుభాస్వతిశీతలజలము లపుడు, గిండితో దెచ్చి యిచ్చి వీక్షించి వాని
చక్కఁదనమున కలరారి • సరస కేగి, యలఘుసాహసమునం దమి • నిలుపలేక. 163

క. ప్రక్క నెగఁబొడువ మన్మథుఁ, డక్కోమలి పతికి వెఱవ • కానందముతో
నక్కునఁ జేర్చుకపాంథునిఁ, జొక్కుచు నుండంగ మగఁడు • చూచె లతాంగీ. 164

తే. ఎట్లు బొంకంగవలె నప్ప • డిందువదన, నేర్పు గలిగినదానవు • నృపతి మౌళి
కేళికైతేను నీ కిది • కేవలంబు, దొడ్డగాదు విచారించి • తోనె చెపుమ. 165

క. అనిన కలహంసపలుకులు, విని హేమావతివిచార • విపులాబ్ధిమునిం
గినమది నా కిది తెలియుదు, వినుపింపుము నీవె యనిన • విధి హరి యనియెన్. 166

చ. అటువలె జారుభాస్వతిధరామరుఁ గౌఁగిటఁ జేర్పఁ జూచి తాఁ
జటులతరోగ్రభావహరిశర్మ యదల్చినఁ దొట్రుపాటునం
బెటిలక యాతనిన్ వినుము • పిన్నతనంబున దేశచారియై
పటుగతి బోయె మాతులునిపట్టి సుమీ యని లేనిదీనతన్. 167

తే. కాంతునకుఁ దెల్పి మఱిమఱి • కౌఁగిలించి
చెమటకణములఁ దనపైఁట • చెఱఁగుచేతఁ
దుడిచి యాతనికేల్పట్టి • తోడితెచ్చి
మేల మాడుచుఁ బానీయశాల కపుడు. 168

సీ. గొనబుతో నెన్నాళ్ళకో • ల్పోగా నేటి, కైన నిన్నెనయ నా • కబ్బె ననుచు
నీకు నామీఁదఁ దాన • నిజముగాఁ జెప్పుమా, నాయందుఁ బ్రేమ క • ద్దా యటంచు

బహుదినా లుండక • పారిపోయెద నన్నుఁ, బోనిచ్చునా వెట్టి•దైన ననుచు
నీ ప్రొద్దు సుదివసం • బేనోము ఫలమొ నా, మనసులో నెంజిలి • మానె ననుచుఁ
తే. జేరిక లొనర్చి తేనియ • ల్చిలుకఁ బలికి
మోహ మూరించి తరితీపు • మోపుకొల్పి
యతఁడమీఁదను బతికిని • హితము వోడమ
మున్నె యొనరించి వానితో • మురియఁ దొడఁగె. 169
క. ఈకరణిఁ జారుభాస్వతి, యాకాంక్షలు దీఱ వాఁడ•హర్నిశ మతనిన్
డీకొల్పి రతులఁ జివుకం, జేకత్తి పజీరు సడ్డ•సేయక యుండెన్. 170
క. అటువలెఁ గాలోచితసం, ఘటితో క్తిస్ఫూర్తి నీపఁ • గలిగిన భూభృ
న్నిటలాక్షు గదియఁ జిటిపొటి, నటనలఁ బోవమ్మ కుంద•నపుజిగిబొమ్మా. 171
చ. అన విని మందహాసము ముఖాబ్జమునం జిగురొత్తఁ గర్ణవే
ష్టనమణికాంతిచెక్కులహు•టాహుటినాట్యము సల్ప నౌర యం
చును దలయూచి వేస వగు•చోఁ జెలికేళిగృహాంతరంబునం
దెనసి నృపార్పితేచ్ఛఁ బవ•లెల్లను ద్రోయుచు నుండె నంతటన్. 172
చ. సమయమహేంద్రజాలకుఁడు • సారసమిత్రుఁ డనేటిపద్మరా
గము వెస మాయఁ జేసి కుహు•కంబున హో యని నీలపంక్తులన్
భ్రమపడఁ జూచి ఝూ యనుచుఁ • బల్కి సుపాణులఁ జేసి చూపెఁ జి
త్ర మనఁగఁ బ్రొద్దుగుంకెఁ దిమి•రం బెసఁగెన్ దివి నొప్పె దారకల్. 173
క. ఆవేళను గృహకృత్యము, తావేగమె తీర్చి పేర్చు•తమకంబున రా
డ్దేవేంద్రునిఁ జేరఁగ హే, మావతి నెమ్మనఁ దలంచి • మహితోత్సుకతన్. 174
ఉ. దిద్దిననాభినామము కు•దించినమేల్మడిచీఱ చీర్ణమై
నిద్దపుఁబూఁత పువ్వులు • నించి ముడించినకొప్పు రత్నము
లద్దయుఁ గల్గుసొమ్ములు గు•శమ్మునఁ జొక్కపుఁజొక్క యొప్పఁగా
ముద్దియ వచ్చి హంసమణి•ముందర నిల్చె నృపాభిలాషయై. 175
క. నిలిచిన యాహేమావతి, పొలిచిన కరుణామృతంపు•భూరితరోక్తుల్
పొలయఁగ దృష్టిఁ గనుంగొని, దలఁచినపని కపుడు హంస • ధరణిపుఁ డనియెన్.

ఆఱవకథ.

క. మున్నొక్కపట్టణంబున, సొన్నారి మిటారి నేర్పు • శూరత్వము గై
కొన్నదియై నడచినకథ, చెన్నుగ విని పొమ్ము కడువి•చిత్రము కొమ్మా. 176

తే. అనినఁ జెలువవ్వ నవ్వి య•య్యంబుజాక్షి, యేమి చిత్రంబు గల్పించి • తింతలోన
శీఘ్రముగఁ జెప్పి దయచేసి • సెల వొసంగు, మఱి గెదను రాజుఁపొందున•కనిన నపుడు.

క. కాదంబవంశవల్లభుఁ, డాచ్ఛృతిని బరాకు లేక • యక్కఱో వినవే
మోదముతో నని చెప్పెను, మేదురమాధుర్యసాధు• మేధాఫణితిన్. 179

క. విను మనఁగా ననఁగా నిల, ఘనమణివర మనెడుపురము • గలదొకటి ఘనా
తనకేతన పటజాతప, వన హతసురసురతఘర్మ•వనవారంబై. 180

చ. కమటము కట్ల సంచి యొర•గల్లును గత్తెర సుత్తె చీర్ణముల్
ధమనియు శ్రావణంబు మొల•త్రాసును బట్టెడ నీరుకావు శా
ణము పటకారు మూస బలు•నాణె పరీక్షలమచ్చు లాదిగా
నమరఁగ భద్రకారకస•మాహ్వయుఁ డొండొకఁ డుండు నప్పురిన్. 181

చ. కరుగను బోఁతఁ బోయఁగను • గ్రాఁచి కదించను గమ్మిదీయఁగా
నొరయఁగ వన్నియ ల్మిగుల • నుండఁగఁ జూపఁగఁ బూదగట్టకే
కరయఁగఁ దీరఁ జెక్కఁబడి • యచ్చునఁ ద్రేయఁగ సుద్దగించగా
సొరిది విచిత్రచిత్రముగ • సొమ్ములు సేయ నతండు నేరిచెన్. 182

క. కంతువసంతజయంతుల, సంతసమున గెలువఁజాలు • సౌందర్యమునన్
సంతతసంపద్గరిమఁ గృ, తాంతజిదాప్తునిజయించు • నతఁడు శుభాంగీ. 183

వ. మఱియు నాభద్రకారకుని కాణంబు నాడీప్రచురంబు గావున శరీరంబును శుక్రాంగారప్రశస్తంబు గావున నక్షత్రమండలంబును గుంభతులాదిసహితంబు గావున రాశికూటంబును గాంగేయశిక్షగలిగినది గావున శిఖండిభండనంబును మఘూచ్ఛిష్టసంయోగంబు గావున యవననివాసంబును వప్రోన్నతంబు గావున మహాపురంబును మూషికావృతంబు గావున శూన్యాలయంబును దీక్ష్ణసాధనయుక్తంబు గావున యుద్ధరంగంబును శ్రావణయోగంబు గావున వర్షాకాలంబు ననుకరించు. 184

తే. ఆతనివసూటి శుకఘోటి • నలరు మేటి
యొడయుఁ డేలేటి సీమాటి • యొఱపుగోటి
కొన నెగయ మీటి యిది యేటి • కులుకనేటి
పోటి కెదిరేటి శుభవాటి • నీటు మెఱయు. 185

తే. దానికచకుచగళలక్ష్మిఁ • బూనఁ దలఁచి, నీలశైలాబ్జములు ద్రోల • నిలిచినపుడె
కనవుకట్టెలు నీళ్లునుఁ • గడఁగి మోచు, జేసె నే మనవచ్చు న•చ్చెలువ చెలువు. 186

క. కుందనపురవలు గుప్పెడు, తుందిలపుం జన్నుఁగవయుఁ • దొలతే నెలకున్
ఖిందు లొనరించుపలుకులుఁ, జందురునింబోలు మోము • సకియకె యఘ్ఘురున్. 187

క. కువలయ మాకనుఁగవజిగి, కువలయ మావలుదపిఱుఁదు • కుచకాఠిన్యం
బవలయ మామోహనతా, రవలయ మానఖము లనఁగ • రమణి రహించున్. 16

మ. కచశోభాగరిమంబు సెన్నడుము సై•కంబుల్ మధుప్రాయమా
వచనవ్యూహము లోచనాబ్జములధా•వళ్యంబు శృంగారవ
త్కుచకుంభమ్ములపొంకముల్ ముఖకళాం•కూరప్రభావంబు న
య్యచలశ్రోణికిఁ గాక నేసకియా•లం దైనం బ్రవర్తిల్లునే. 16

సీ. కుప్పెరాగడిబిళ్ల • కుంకుమరేఖషా, పటబొట్టు కమ్మలు • బావిలీలు
లలిసూర్యచంద్రవం•కలు నాసకము కెంపు, రవలపల్లెరుఁ బూవు • రావిరేక
బుగడలు నానుఁగ్రో•వులు తీఁగ మెడనూలు, కుతికంటు సరపణ•గుండ్లపేరు
సరిగె ముక్కర బన్న • సరము నత్తుండాలు, కంకణంబులు తట్లు • కడియము
తే. సందిదండలు నొడ్డాణ • మందమైన
ముద్రికలు హంసకంబులు • మ్రోయుగజ్జె
లలవు బొబ్బిలికాయలు • గిలుకు మట్టె
లాది యగుసొమ్ము దాల్చి య•య్యబల మెఱయు. 1

క. దాని నెగాదిగఁ జూడని, మానవుఁడిం దానిపొందు • మదిలో నెపుడుం
బూని తలంచని పురుషుని, గానము త్రిభువనములందుఁ • గలవారలలోన్. 1

క. ఆశుభవాటి మనోహర, పేశలతర మృదులవాక్య•పృథుమాధురిచే
యాశపడి మారభూతా, వేశమునఁ జరించువీట•విటయూథంబుల్. 1

శా. నీవీబంధము చక్కదిద్దునెఱివే•ణిన్ లెస్సఁ గైసేయుఁ గె
మ్మోవిం జిల్కుదరస్మితంబు జిగిచూ•పు ల్వాఱఁగాఁ జూచుచుం
గ్రేవల్గన్పడఁ జేయు నెచ్చెలియతోఁ • గేల్కేల దట్టించి వా
చావైచిత్రిని ముచ్చటాడుసకితర్క్ • జాను ల్విలోకింపఁగన్. 1

తే. ఇటుల మదమెత్తి తమిచేత • నేపు రేఁగి, తిరుగు నవ్వీటఁ గల్గిన•ధీరవటుల
పొందునకు నాసపడి పోవ•సందులేక, కుందుచుండును విరహార్తిఁ • జెంది యెప్పు 1

వ. అంత.

మ. చిగురుం గత్తివజీరుమాఱుపలుపం • జెన్నొందు నొయ్యారపుం
సొగసుం బ్రాయము గల్లువాఁ డొకఁడు మే•ల్పొన్నారి ధూర్తాఖ్యచేఁ
దగఁ బెం పొందినవాఁడు శిల్పఘనశా•స్త్రప్రక్రియ స్నేర్చఁగాఁ 1
దెగువ న్నిల్చెను భద్రకారునకు నం•తేవాసియై వేడుకన్.

క. వానికుశలత్వసంపద, వానిమనోహారిరూప•వరవైభవముల్ 1
ఖానిఘనబుద్ధిఁ జూచి య, హీనకరుణ నింట నిల్పి • హితమ్మలరారన్,

తే. కీర్తికై భద్రకారుఁ డాధూర్తునకుఁ ద, నింటనే యన్నవస్త్రాదు • లిడుచుఁ గల్గు
పనులు నేస్పచు నుండంగ • భక్తిమీఱ, నలఘుశుశ్రూష నేయుచు • నాతఁ డుండె.

క. కందువమాటలబెళుకుల, మందస్మితరుచిరవచనమాధురిచేతన్
దుందుడుకుఁ జెంద ధూర్తుని, డెందము గరఁగించి చెలి ఘటించెన్ రతికిన్. 199

తే. ఎడతెగనిమోహ మూరించి • యేపురేఁగి, వేశ్మమున నొంటిపాటైన • వేళలందు
మదనకదనంబునకుఁ జాల • మరులుకొనఁగ, జేసె శుభవాటిధూర్తుని • చిత్త మలర.

చ. అలయక భద్రకారుఁడు గృహంబున నుండినయప్పుడెల్ల వే
డ్కలఁ బను లభ్యసించును దండంబడ కాతఁడు లేనివేళలం
జెలఁగుచు వానిభార్యకడ • జేరి మనోభవకేళికాక్రియల్
తొలఁగక యభ్యసించు శశితుల్యుఁడు ధూర్తసమాఖ్యుఁ డున్నతిన్. 201

తే. స్నానపానాన్నవస్త్రాదిసంగ్రహంబు, భద్రకారుఁడు సెలవిచ్చెఁ • బనికి మెచ్చి
వానిచెలువంబునకు మెచ్చి • వలచినపుడు, చాల శుభవాటి సెలవిచ్చె • సంగమంబు.

క. ఈలీల సకలభోగము, లాతతగతి నడచుచుండ • నాధూర్తాఖ్యుం
డాలలిఁ గత్తిగలదొర, చేతికటారికిని సడ్డ • నేయక యుండెన్. 203

వ. అయ్యవసరంబున. 204

ఉ. ఆదర మొప్ప నొక్కదివసాంతమునందు దుకాణముం బహి
ర్వేదిని భద్రకారుఁ డమరించుక ధూర్తునిఁ జూచి మిద్దెలో
బోదియమీఁదనున్న తులపొందుగ వేఁకొనిర మ్మటంచు సం
మోదముతోడ నంపఁగ సముద్రగభీరుఁడు పోయి చూడఁగన్. 205

తే. వానియొయ్యార మొకవింత • యైనపుడు
చూచి వలరాజు రాజ్యంబుఁ • జూరఁగొలుపఁ
దలఁచి శుభవాటిధూర్తుతోఁ • దారసిల్లి
తలుపు గదియించి రతికేళి • సలుపుచుండె. 206

క. చెన్నారి చుంబనంబులుఁ, జిన్నారివగ ల్వినోదచేష్టలుఁ జెన్నెల్
గన్నార జూపి యపు డా, పొన్నారి మిటారి ధూర్త • సురతుల గలచెన్. 207

క. ఈలీల మదనకదనా, లోలత్వముఁ బూని యింటిలోపల ధూర్తుం
డాలస్యం బొనరించినఁ, దాలిమి చెడి భద్రకారధన్యుఁడు చింతన్. 208

ఉ. తడసె నిదేమొ ధూర్తుఁ డల • దర్పకు బోలినవాఁడు భార్యయుం
గడురతిఁబోలు రూపు సిరి • గల్గిన జవ్వని యేమిదోహమం

గడిమి నొంనర్చిరో యనుచుఁ • గా లటునిల్వక వచ్చి గట్టిగా
గడెనిడుతల్పుఁ జూచి ఘన•గర్జితభాషలఁ బిల్చె శిష్యునిన్. 20

తే. అప్పు డాజాయ యేచాయ • నధిపుమదికి
హితముగా బొంకవలయు నో • యింత యనుచు
హంస మడిగిన దరహాస • మరల మోము
వంచి హేమావతీసాధ్వి • యంచ కనియె. 21

క. ఒకరొకరి బుద్ధి యెట్లో, యకటా తెలియంగ బ్రహ్మ•కైనను వశమా
కికురించక యిది నీవే, యకుటిలగతి నుడువు మనిన • హంసం బనియెన్. 21

మ. విను హేమావతి భద్రకారుఁ డటకు • న్వేగంబుగా వచ్చి శి
ష్యునిఁ బిల్వన్ భయ మంది వాఁడు జనితా•స్తోకవ్యధం గుంద నా
తని భీతిల్లకు మంచుఁ జెప్పి తులసూ•త్రంబు ల్వడిం ద్రెంచి వై
చి నిరాఘాటత నేగి వాకిలి సడ•ల్చెన్ నాయకున్ దూఱుచున్. 21

వ. అట్లు వాకిలి దీసి భర్తతో మఱియు నిట్లనియె. 21

చ. తులగొని తేను మంచిగుణ•ధుర్యునిఁ బంపితి రౌను మీరలుం
బిలిచినఁ జూడవత్తుఁ గద • భీతిని దారము లన్ని దెంచి యీ
తలుపు గడెంచి సూత్రములు • త్రాసునఁ గూర్చుచునున్న వాఁ డిసీ
పలువ మఱెంత నేర్పరని • భర్తకుఁ జూపి దురుక్తు లాడినన్. 21

తే. ఎంతలే దింతెకద దీని • కిట్టు లనకు, తానె పోయెను గాంత చేఁ • దప్పిపోతె
నేమి సేయుదు మని ధూర్తు • నితర మనక, డెందమున సందియ మొకింత • చెందకప్రుః

క. ఎప్పటివలె నుండె విభుం, డప్పగిదిని సూక్ష్మబుద్ధి • నారయవలె నో
యొప్పులకుప్పా నీ కని, చెప్పఁగ హాసంబు ముదముఁ • జెలువము దోఁపన్. 21

క. ఆవేళ శిరఃకంపము, గావించి యయారె యని చొ•కాటం బగుకే
శీవాసముఁ జేరెను హే, మావతి నృపమోహ మగ్న•మానస యగుచున్. 21

మ. కనదృష్ణాలయ మా మహాబిలమునం • గన్పట్టు భాస్వచ్ఛమం
తనవానర్ఘ్యమణిం దటిన్యధిపస•త్రాజిత్తునిం జేర్చె నో
మును దాఁ గైకొని కాలకృష్ణుఁ డన నం•భోజాప్తుఁ డప్పశ్చిమాం
బునిధిం జేరెఁ దదబ్జనాథరుచి సాఁ • బొల్పొందెఁ గ్రొంజీకటుల్. 21

వ. అయ్యవసరంబున. 21

సీ. విటమనోధృతిశిలా•నిచ్ఛేదతాటంక, తాటంకమణికాంతి•తతులు వెలుఁగఁ
బల్లవమానస•పటుధైర్యహారక, హారకళాస్తోమ • మాఘుళింపఁ

గమనవ్యృద్ధాఢ్యాబ్జ•గణశీతకంకణ, కంకణాంగదములు • ఘల్లు రనఁగ
జారాత్మదృఢతాన•మీరాహిసంతాన, సంతానకుసుమవా•ననలు వొలయ
తే. యువజనస్వాంతకాఠిన్య•దవసమీర, బంధుఘనసారఘనసార•గంధసార
సౌరభోదారకుంకుమ•స్థానకంబు, దనర రాయంచకడకు న• త్తరుణి వచ్చె. 220
ఉ. వచ్చినఁ గాంచి హంసకుల•వల్లభుఁ డాతలిరాకుబోఁడి మై
లచ్చికి నిచ్చగించి యను•లాపకలాపకళారసజ్ఞతన్
మెచ్చి నృపాలుపాలికిని • మేకొనిపోయెద వేమొ బొమ్మ
నాముచ్చట లాలకించి కడు•ముద్దులుగుల్కెడు ముద్దియా యనన్. 221
క. అని పల్కు నంచవాచా, లనుమాధుర్యమున సొక్కి • తత్కథ యేమీ
వినియెద నన హేమావతి, కనురాగం బొప్ప రాజ•హంసం బనియెన్. 222

ఏ డ వ క థ.

మ. కలదుద్యద్ధ్వజశాటికాపటలజా•గ్రద్వాతసంచారసం
చలదభ్రస్థలినిల్వనల్క్రతదవ•స్థం బాపఁ దద్భూమిరా
ట్కులమాలిన్ శరణంబు వేడుటకుఁ దో•డ్తోనచ్చెనో యంబుదం
బు లనన్ మత్తకరు ల్సెలంగ నొకప్రో • ల్పున్నాగపుంజం బనన్. 223
సీ. గోళ్లు రిక్కలజోళ్లు • క్రేళ్లు మావిచిగుళ్లుఁ, జెల్లుఁ బుక్కిళ్ల•సిల్లు సుళ్లు
దూండ్లు శాహులు గిండ్లు• చెండ్లుబోల్పాలిండ్లు, కండ్లు మీల్సిరిగాణి•విండ్లు బొమలుఁ
జూపు మారునితూపుఁ • జూపు మోములయేపు, శాపురే శశిహూపు • మాపనోపుఁ
గప్పు పెన్నెరికొప్పు • లొప్పు చీకటిచొప్పుఁ, గప్పు నవ్వులు విప్పు • కప్పురములు
తే. బొంగు బంగారురంగు ల•నంగ డంగు, నంగలతల నెనంగు మె•ఱుంగు గుంపు
లనుచు నిజరూపవైభవం • బఖిలజనము, లభినుతింపగ వెలయుదు • రచటిసతులు. 224
వ. వెండియు నప్పురంబు సర్వమంగళాభ్యుదయనివాసం బై హిమమహీధరంబు పోలికిని సుధర్మాస్పదరూపరమ్యం బై మేరుశిఖరిభాతిని బురుహోత్తమశోభితం బై శ్వేతద్వీపంబు కరణిఁ బుణ్యజనానందసమృద్ధిదం బై యలకాపురంబులీలను విబుధమనోరంజనకరం బై యమరావతీపట్టణంబుచాడ్పున రాజహంసాభిశోభితం బై పద్మాకరంబు వైఖరిం జతురాస్యవాణిప్రచురం బై సత్యలోకం బన నొప్పు నెప్పుడు. 225
సీ. గొడియబీగములావు • గొలుసులోపలియడ్డ, మ్రానుబోర్తులుపులు • మగులు...
గాయధాన్యంబుల • కణఁజము ల్పియ్యంపు, గరిసెలు దినుసులు • గలకొటార్లు
మిద్దెచిల్లరలు న•మ్మెదుదుకాణము బచ్చు, మళిగె బొక్కసపిల్లు • మచ్చులుఁ దుల
కసుణముల్ నాణెము • ల్గలకట్లు సంచిగో, లకు లెక్క కడితెంబు • దడము భరణి

తే. తక్కిడిసమస్తవస్తువు • ల్దనరు నటుక, బావినుగ్గులకుచ్చెల • పాడిపసుల
గాడిజాలాదిదివెగూఁడు • గాబుతొట్టి, యొప్ప ధనచిత్తుఁ డను శేరి • యుండునచట.

సీ. జాజికాయలు రాస్న • జాపత్రియు హరిద్ర, నాగర గంధక • నాభిరసము
లతిమధురంబు దు • త్తాభ్ర కైలాశిలా, జిత్తులు ముసదాసు • సింగు హింగు
వన్న భేదియు వస • యక్కలకర పంచ, లవణచవ్యములు బో • ళము మణిశిల
పిప్పళ్లు కోష్టువు • పిప్పలీ మూలంబు, హరిదళ నాగకే • సరము లింగి

తే. లీకము సదాపవేళ్లు ధా • న్యాకములును
గటుకరోహిణి పటిక జం • గాలపచ్చ
కర్పరియుఁ గారవియు రేణు • కమతి వసయుఁ
దాళకము మాంసనఖము నే • పాళములును.

తే. క్షారపాషాణములునభ్ర • కంబులైదు, గ్రంథితగరంబును యవాని • కాద్వయంబు
కచ్చురములు మరాటిమొ • గ్గలు కుళుత్థ, కుసుమములు కుందురుష్కము • లెసఁగఁ గళ

సీ. గంటుభారంగియుఁ • గంపస్థమును మెంతి, మంజిష్టి జిలకఱ్ఱ • మ్రానిపసపు
విషకంటకాలామ్ల • వేతసంబును నీరు, చించలంబును బులి • చించలంబు
జీరకంబును నల్ల • జిలకఱ్ఱ పుష్కర, మూలంబు కాంపిల్య • మును సముద్ర
ఫేనంబు ధాతకీ • సూనంబు సాసువు, లుప్పళులును గజ • పిప్పలియును

తే. గాక మాచియు స్థౌణేయ • కంబు చిత్ర, మూల గోరోచనములుఁ గా • పోత శార్క
శైల సౌవీర రసముఖాం • జనములు వెలి, గారమును గల్గి యుండు న • బ్బేరియింట.

వ. మఱియును.

సీ. వింతగాఁ బుంజీభ • వించి నానాధాన్య, ములరాసు లుండెడి • నిలయములును
సకలరత్నాకర • స్థలములై యేకీభ, వించి విస్మయ మిచ్చు • వేశ్మతతులు
నఖిలదేశంబుల • నమరు నాణెములపుం, జీభవించిన చిత్ర • గేహములును
జీనిచీనాంబరా • నూనబృందంబుల, మందీభవించిన • మందిరములు

తే. సర్వరసవర్గములు టంక • సాల వ్రేయు, చావడి హమాదినుసు మేలు • సరకుఁ గలిగి
నాల్గుదిక్కుల పేటల • నగరజనుల, కలర నమ్ముచు ధనచిత్తుఁ • డచట వెలయు.

క. వానికి వసుమతి యనఁగా, మానిని విలసిల్లు నొకతె • మదనునిచే నా
నానవసుమపూజిత మగు, చీనీజము దాళి యసఁగఁ • జెలువు దలిర్పన్.

ఉ. ఆబిడమోము గోముజిగి • యాబిడముద్దులకావిమోవిరం
గాబిడ కప్పుఁగొప్పు సొగ • సాబిడ సూరెలకోపు చూపు జ

గ్గాబిడ గబ్బిగుబ్బసిరు • లాబిడ లేయసదైనగౌను సొం
పాబిడ యారుతీరు చెలి•యా వచియింపఁ దరంబె యేరికిన్. 233

క. అలరుం బ్రాయపుఁజిన్నెల, కలిమిన్ రంజిల్ల మెఱుఁగు•కరుగునఁ బోయన్
విలసిల్లు నటనపుత్రిక, పొలుపున నవ్వీటిలోనఁ • బొలఁతుక మెరయున్. 234

చ. పొలఁతుకవేణి కృష్ణతను•బూనినయంతనె మోము నూడుచేఁ
దలకి విధుస్థితిం దనరెఁ • దాళకచన్నులు నచ్యుతాకృతిం
బొలిచె సహించలేక నడు•ముర్ హరిరూపు వహించె నిట్టివా
ర్తలకు మధుద్విషత్వమును • దాల్చెను జక్కరలొల్కు మోవియున్. 235

సీ. కులగోత్రములవారి • నిలిపి కట్టెఱు నీళ్లు, మోయించుచుండెడు • మొలుచఁదనము
తనుగన్నవారలఁ • దన్ని త్రొక్కక నిల్చి, చెలఁగి పంకావాప్తిఁ • చేర్చు నూడు
వినుతకళాఢ్యుఁడౌ • ద్విజరాజు ననిశంబు, దోషాకరునిఁ జేయు • దూషణంబు
ఘనరసస్థితిఁ జెంది • తనరు మానససీమ, బహుభంగములఁ గూర్చి • ప్రబలు నగడు

తే. బ్రహ్మ వారించికొనియె నంప్పద్మనేత్ర, కలరు కుచశైలములును హ•స్తాంబుజములు
నవ్యముఖచంద్రబింబంబు • నాభిసరసి, మెఱయఁ గౌశల్యశక్తి ని•ర్మించి మించి. 236

క. అంబుజముల బింకంబులఁ, గంబుల నగు నయనయుగము • గళముఁ గుచంబు
లైంబులఁ గ్రొంబ గడంబుల, డంబుల నిరసించు నప్పు•డంతి బెడంగుల్. 237

క. చాలా మెఱుఁగులు గ్రొంబగ, డాలా నెత్తావి మోవి•డంబులు కోదం
డాలా కనుబొమ లతనుని, డాలా వాల్చూపు లన మి•టారి రహించున్. 238

ఉ. గుబ్బలనీటు మోముపస • కుంతలబృందమునిగ్గుఁ గౌనులో
జబ్బుదనంబు గన్నుఁగవ•చందముఁ జెక్కుల తేటమోవినున్
గబ్బిచకచ్చకల్ రదన•కాంతికటిస్థలి యుబ్బుగంధరం
బబ్బుర మారుతీరు దర•హాసము హాసము డంబు చూడఁగన్. 239

తే. దానిసొగ సొత్మలో మెచ్చి • తలఁ గదల్చి, కేరిమీసంబుపై ముద్దు•కేలు వైచి
యడరి నిట్టూర్పువెచ్చి య•య్యారె యనని, మానవుఁడు లేఁడు ధారుణి•లోనఁ జాన.

క. అటువంటిరూపరేఖా, పటిమం దనరారియుండు • భామినిరతులన్
ఘటియింపక పరతరుణీ, విటుఁడై ధనచిత్తుఁ డెపుడు • వెలయుం జెలియా. 241

తే. అటువలె నిజాధినాయకుఁ • డన్యమృగదృ
గానుకూల్యాగ్రచిత్తుఁడై • మహరహంబుఁ
దిరుగఁ దనమీఁద పసలేని•తెరఁగుఁ జూచి
వసుమతి ముఁ గాంచె జారాంక•వాహనంబు. 242

క. పతి నడచునట్ల నడచెడు, సతియ పతివ్రత యటంద్రు • సజ్జను లనుచుం
బతి పరదారలఁ గూడిన, సతి జారులఁ గూడఁ దొడఁగె • సతతము వేడ్కన్. 243

తే. ఇటుల నావైశ్యదంపతు • లేపురేఁగి, మనసు లెచ్చోటఁ గల్గిన • మరులు కొల్పి
సెరిమరునితూపు తమచూపు • నిర్గమంబు, వెట్టి మరుచివ్వకేగుదు • రెట్టులైన. 244

క. ఈతీరు కొంత కాలము, నాతియుఁ దానును బరేచ్ఛ • నడచుచు నొకనాఁ
డాతతమదనశరాహత, చేతఃకంజాతుఁడై ని•శీధినివేడ్కన్. 245

క. అత్తింటికోడలికిఁ గా, హత్తుక నతఁ డుండె నొకయు•వాగ్రణికొరకై
యత్తన్వి యటకె పోయినఁ, జిత్తజుఁ డెన కొల్పె వారి•చిత్తము లలరన్. 246

తే. తాను గోరినకన్య యీ•తరుణి యనుచుఁ, జేరె నాసక్తిచే ధన•చిత్తుఁ డప్పు
డాయువాగ్రేసరుం డీతఁ • డౌ నటంచుఁ, గదిసె వసుమతి యత్యంత•కాంక్షతోడ.

వ. అయ్యవసరంబున. 248

మ. సహసాసంఘటితస్తనగ్రహణసం•జాతాంగరోమోద్గమం
బు హాతాచ్చుంబితపాటలాధరముఖాం•భోజాక్షిగండంబు దు
స్సహనీవీచ్యుతికంచుకావృతినఖాం•చద్దంతగాఢక్షతా
వహనం బిప్పర కయ్యె సంగమము ది•గ్వారార్పితేక్షాళియై. 249

క. కలయికల నాఁటిజంబులఁ, గులసతిఁగా నతఁ డెఱింగెఁ • గోమలిమగఁ డీ
యలఘుఁ డని తెలిసె నపు డెటు, వలె నచ్చెలి బొంకవలయు • వనితాచెపుమా. 250

తే. అనిన హేమావతీభామ•హంసదిక్కు, చూచి యదియెటుబొంకెనో • చోద్య మహహ
తెలియఁగాఁ జాల నిది నీవె • తేటపడఁగ, దెలుపు మని పల్క రాయంచ•తెలుపకనియె.

క. ఆవేళ నాయకుఁడు కో, పావేశహృదంబుజాతుఁ•డై యీ నిశిలో
నీవిటకు నొంటి నేటికిఁ, గా వచ్చితి వనుచుఁ గినియఁ • గామిని యనియెన్. 251

తే. మగఁడ నామీఁద నీకింత•మమత లేని
తెఱఁగు గన్గొని కాళికా•దేవికేను
బడుచుఁదనమున మ్రొక్కి నా•పతిని రతికిఁ
గూర్ప నీసేవ సేయింతుఁ • గోర్కెమీఱ. 253

క. అని వేఁడుకొనిన యప్పుడె, ఘనకరుణామృతకటాక్ష•గరిమను గాళీ
జనని ననుఁ జూచి యో పతి, నెనసెద వనునింతలోన • నిట సెరిగితి నిన్. 254

ఉ. వింటలు కాళికాజనని•విశ్రుతసత్యములంచుఁ బల్కఁగా
నంతమునన్నె యచ్చెలియ•కై చనుదెంచినజారు డొక్కసం

జాంతరసీమ నుండి యిది • యా నిజ మంచు వచింప వర్తకుం
డెంతయు విస్మయాకులిత•హృత్పుటుఁడై నిజభార్య నున్నతిన్. 255

తే. స్తుతులఁ గరఁగించి సాష్టాంగ•నతు లొనర్చి, గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి నీ•కోర్కు లలరఁ
జేసెద నటంచు బాసలు • చేసి సతిని, దొడరి ధనచిత్తుఁ డింటికిఁ • దోడి తెచ్చె. 256

క. అది మొదలు నన్యకాంతలఁ, గదియక ధనచిత్తుఁ డెపుడు • గాంతామణికిన్
ముద మలర వశ్యుఁడై తగఁ, బొదివెను నీ కట్టినేర్పు • పొసఁగినఁ బొమ్మా. 257

క. అనవిని నాసికఁ దర్జని, యునిచి కడుశిరంబు ద్రిప్పి • యోహో చిత్రం
బని తెల్లవారుచుండుటఁ, గని హేమావతి వియోగ•కలనం జనియెన్. 258

వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పిన విని సంతోషించి నలుం డాతరువాతివృత్తాంతంబుఁ
జెప్పు మని ప్రార్థించిన. 259

మ. స్మరవాత్సల్యవిశేషరక్షితవనీ•మాతంగమాతంగసం
హరయోషిన్నుతపాదపంకరుహశో•భాభంగభాభంగభా
స్వరసర్వామరమానిచిత్తజలరు•ట్సారంగసారంగరా
ణ్ణిరపత్యస్తుతిజాతముత్పులకవ•న్నీలాంగనీలాంగదా. 260

క. సవనాశన జగదవనా, నవనామ విషాగ్నిహరణ • దారుణ భువనా
భువనాధిపనుత సవనా, సవనాభ్రద్యుతిజితార్క•జాసరసవనా. 261

పృథ్వీవృత్తము. కులాచలకులాచలావలయ•కూటఘోణీఫణీట్
తలాతలతలాతలాది జగ•దభ్రదిగ్దార్ఢ్యహృ
త్కళాధరకళాధర ప్రబల•కార్ముకారోపకృ
త్కళాధరయిలాధర ప్రతిమ•ధైర్యచర్యాకరా. 262

గద్య. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమాచంద్ర
నిస్సహాయ కవిత్వ నిర్మాణచాతుర్య నిస్తంద్ర శ్రీరామనామ పారాయణనారాయణా
మాత్యప్రణీతం బైనహంసవింశతి యనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.





శ్రీరస్తు.

శ్రీ రామచంద్రాయనమః.

# హంసవింశతి

## తృతీయాశ్వాసము.



జానకీక్షణోత్పల
రాజారాజాధిరాజ • రాజన్నిజసే
వాజాతహర్షమునిజన
తాజలరుహచండదామ • దశరథరామా. 1

వ. అవధరింపుము ప్రత్యుత్పన్నమతి నలరాజన్యున కిట్లనియె నట్లు ప్రభాతసమయంబుగా వచ్చినం గనుంగొని. 2

మ. చని పూఁజప్పర మొప్పుచుండెడు మణీ • సౌధంబులోఁ గెంపుఁటా
మొనముక్కుల్గలపచ్చతాచిలుకతో • నొప్పొందు బంగారపుం
బనిరంగారెడుతూఁగుటుయ్యలపయిన్ • బాగొప్ప మేన్సేర్చి యా
వనజాతాక్షి దినాంతవేళ మనుజ • స్వామిస్వప్రహాధీనయై. 3

చ. మిడిగలవజ్రపుం రవల • మిన్కులకమ్మలు జాతికెంపుఁటా
కడియములున్ సుపాణులచొ • కాటపుహారములున్ మృగీమదం
బడరెడుపట్టుచీరసొగ • సౌ ననఁ దాల్చి నృపాలుకేళికిన్
నడిచె వధూలలామతమి • నాటినచిత్తము తత్తరింపఁగన్. 4

క. ఆయెడ హంసకులాగ్రణి, యాయోషామణిని గాంచి • యనుపమవచన
శ్రీయలరఁగ నొకచిత్రో, పాయపుకథ విను మటంచుఁ • బలికి వచించెన్. 5

### ఎనిమిదవకథ.

ఉ. సాలము మిన్నునంటి ఘన • సంపదఁ గాంచె నగర్త యార్షశ్రీచేఁ
దాళక నంతభోగములు • తద్దయుఁ బద్దునఁ దాను జెందనా
మేలనఁ గోట యున్నతియు • మిక్కిలి ఖేయము లోఁతు గల్గి శో
భాలలితం బనంగ నొక • పట్టణ మొప్పు నితంబినీమణీ.

క. అవీటిలోన రంగా, జీవనులాంభోధి పూర్ణ • శీతమయూఖుం
డై వెలసి చిత్రఘనుఁ డనఁ, గా వార్తకు నెక్కె యతఁడు • కాఁపుర ముండున్. 7

తే. హరితహారిద్రకృష్ణర • క్తావదాత, శబలపాటలధూమల • శ్యామకపిశ
వర్ణములఁ గూర్చి చిప్పల • వాగెలునిచి, చిత్తరువు వ్రాయుగుళ్ళలోఁ • జిత్రఘనుఁడు.

క. సురవిద్యాధరకిన్నర, గరుడోరగసిద్ధసాధ్య • గంధర్వహరి
ద్వరయక్షాసురనలినజ, హరిహరమర్త్యర్షి వసుల • నతఁడు లిఖించున్. 9

సీ. హరికరిమృగఖడ్గ • కిటితరక్షుద్వీప, సైరిభగోకర్ణ • శరభచమర
గంధర్వరోహిష • గవయభల్లుకరామ, శశజంబుకోష్ట్రాశ్వ • శల్యకోక
వామీఖరోరణ • శ్యాసాతుకపిబభ్రు, సరటేర్యలూతాఖు • సర్పమకరి
శతపదిబస్తమ • శ్స్యధులీక్షీరాళి, గాధేయరక్తపా • కమఠనక్ర

తే. గోమహిషజలశుక్తి • చిక్రోడములను, సింగిలీకాలురయుమింద • చెలిది పురువు
కొక్కెవెంట్రుపనలికిరి • కోర్ణలాది, గాఁగలుగు జంతువులఁ జిత్ర • ఘనుఁడు దీర్చు.

తే. గరిశిడిబ్బంది చోఅషంది • గాఁడు మంప, గరడ జెగ్గోలురేచు గొర్గరమురాళ్ల
రాచిపెంపులజెట్టి పున్నారిపక్కి, పేచిచెక్కలచేరను • వేళ్లఁగలుగు. 11

సీసమాలిక. గరుడుండు సంపాతి • గండభేరుండంబు, చీకురా యాడేలు • చెవులపంత
వార్ణెయు భైరిజా • వళము సాళ్వము డేగ, గూడ బా తుల్లంగి • కుందటీల
పాల నారాయణ • పక్షి పామలమ్రింగు, డంచవేష్టము గ్రద్ద • క్రౌంచ మాబ
లగు గోదె గొరకు తెల్ల • పంతజలసట్టె, గూబ శంబరకాకి • గుడిలిగాము
సామాలకేతఁడు • నల్లాస కప్పెర, కాకి యంబటితాటి • గాఁడు మూఁగ
చిందర లకుముకి • చిలుత తీతువకోడి, కారుకోడేకుల • నారిగాఁడు
మునుగుకోడియును డాల • ముట్టెకోడియు బోద, పొన్నంగి కకశేటి • బొల్లికోడి
గొంగడి కక్కెర • గొక్కెర గోరవంక, పూరేలు కనుపెంటి • నీరుకాకి
వెలిచె లావుకపిట్ట • చిలుక జీనువకాఁజు, పెకిసకేర్జము డబ్బు • బెలవ నెమిలి
జిట్టువ మునుగప్పూ • జిట్టువ గిజిగాఁడు, వల్లడ పొడిపిట్ట • వంగపండు
బరతము కోకిల • పసిరిక తంగేడు, గోరవంక జక్కవ • చెరువుకోడి
పట్టుజీనువు కొంగ • పాపేసు పిచ్చుక, పోలిక పిక్కిలి • మీలమ్రుచ్చు
చిలుక చకోరంబు • జిబ్బిటామజటాయు, కొండపిచ్చుక వాన • కోకిలయును
క్రౌంసుపొక్కటిగాఁడు • మాలకాకి బెవాసి, పాపెర గోరవంక • పంది కైర
గబ్బిలంబును జాతి • కము కంకచిటిచెల్వ, పాసుపెంటి పేట్రింత • భూతపోతు
గున్నంగి కనకాక్షి • గుడిసె బయ్యకపుల్ల, నీతువ జెగ్గురు • జిక్కుతురుక. 12

ఆ. పికిలి నేల నెమిలి • పెనుగువ్వ బకదారి, పావురాయి సివము • పలువరింత
చదలుకోడి గువ్వ • వదయతోఁకలవేడి, యాది యైనపక్షు • లతఁడు దీర్చు. 13
వ. అదియునుంగాక. 14
ఉ. వానిమనోహరాంగవిభ•వంబును వానిముఖేందుకాంతియున్
వానిపటూక్తివిస్ఫురణ • వానివిలోచనదైర్ఘ్యసంపదల్
వానియురస్థలోన్నతియు • వానిభుజప్రతిభావిశేషముల్
మానిని యేమిచెప్ప నస•మానములౌను తదీయవైఖరుల్. 15
క. ఆతనిగృహమున విద్యా, చాతురికలశారి నృపులో•సంగ రహింపున్
జాతిహయవస్త్రభూషణ, మాతంగద్రవ్యమణిస•మాజము లెపుడున్. 16
క. పౌరుషముఁ దారతమ్యముఁ గారుణ్యము దానధర్మ•గరిమయుఁ గులవి
ద్యారసికత్వము వినయము, గారవముం గలిగి చిత్ర•ఘను• డట్లలరున్. 17
క. ఆచిత్రఘనునకలపల, రాచవజీరునిజిరాగు•ఖానకు నెనరై
సూచింపఁ దగినసావసుది, వాచాలి యనంగ నొక్క•వనిత చెలంగున్. 18
ఉ. ఆకమలాక్షి చంచలదృ•గంచలసీమల బెళ్కుతళ్కులా
యాకలకంఠిపల్కు లల•రార సుధారస మొల్కుకుల్కులా
యాకనకాంగియంగరుచి•హాటకకోటులఁ జల్కుబెళ్కులా
హాకుటిలాలకాసరసి•జాననుఁడై నను నేరఁ డెంచఁగన్. 19
క. హరు లాపల్కులు తుమ్మెద, గిరు లాకచరుచులు నడలు • కరులాకదళీ
తరులాతొడలిందునిబి, త్తరులాగోళ్లించఁ బ్రౌఢ•తరు లాసరసుల్. 20
సీ. మాటలా యమృతంపు • తేటలా కపురాల, మూటలా యని జారఁ•గోటులెన్నఁ
గన్నులా తెలిదమ్మి• చెన్నులా మగతేఁటి, యన్నులా యని పల్ల•వాళులెన్నఁ
జేతులా సుమలతా•జాతులా కిసలయ, ఖ్యాతులా యని యుప•కాంతులెన్న
గుబ్బలా యపరంజి•బిబ్బలా రుచుమించు, దిబ్బలా యని పాంథ•ధీరులెన్న
తే. గోరులా రిక్కసౌరులా • కులుకుతళుకు
నవ్వులా జాజిపూవులా • నాఁటునీటు
చూపులా వాఁడితూపులా • సొలపుదెలుపు
ననుచు విటు లెన్నదగు నింతి • యతనుదంతి. 21
చ. వగ లిగురొత్తఁ జిత్తగవుఃప్రాయము సారెకు దీనిఁ జూచుచుం
ధగ దని పద్మసంభవుఁడు • దారధయామతిమీరి మేలుబం

తిగ నొనరించి తత్పతికిఁ • దేకువనిచ్చిన మేటి జాళువా
జిగిబిగిగ్రమ్ము బొమ్మయన • సింధురగామిని యొప్పనున్నతిన్. 22

తే. కుచులు ఘనసంపదలఁ జెంది • కోమకుమిగుల
ముఖము రాజవిభూతిచే • మురియఁ దొడఁగెఁ
గటిమహాచక్రవిభవము • గ్గాంచె ననఁగఁ
జెలఁగు వాచాలిగమననిర్జితమరాళి. 23

ఉ. ముద్దులుఁగారు నెమ్మొగము • మోహరసంబులుఁ జిందు గుబ్బలున్
దిద్దినయట్టులుండు జిగిఁ, దేఱుచెక్కులు కావిమోవియున్
నిద్దపుజాళువాపసిఁడి • నిగ్గులు జిల్కు నయారెదేహమున్
దద్దయు నెన్నఁగా వశమె • దానినవీనవిలాససంపదల్. 24

తే. దానివగలకు లోఁ జిక్కి • దర్ప ముడిగి, దర్పకాస్త్రాగ్నికీల దం•దహ్యమాన
మానసుఁడుఁ గానివాఁడు భూ•మండలమున, వెదకినను లేఁడు సుమ్ము సా•ధ్వీలలామ.

చ. అది తమస్వామికేళిపుర•నందు దయన్నెలకొన్న భక్తకా
మదుఁ డగురామచంద్రపెరు•మాళ్లలరం దిరునాళ్లలోన నిం
పొదవఁగఁ దార్క్ష్యవాహుఁడయి • యున్నతితోఁ దిరువీధు లేగఁగా,
ముదమున నమ్మహోత్సవపు•ముచ్చటఁ జూడఁ దలంచి రా నటన్. 26

తే. పరఁగఁ బదియాఱుగుజ్జుల•ప్రభ యొనర్చి, గంటవేసియు బంగారు•కలశ మెత్తి
కంచుగుబ్బలు రావిరే•కలును లోవ, పక్షములు దీర్చి గొప్పచ•ప్పరమురాఁగ. 27

మ. జగతీజ్యోతులు కాగడాలు బలుబం•జాయీలు మోఁబత్తులుం
బగలొత్తు ల్దివిటీలుఁ దీర్ఘళిఖలుం • బంజు ల్మహాజ్యోతులుం
దగ సూర్యప్రభ లాయిలాయులును జం•ద్రజ్యోతుల్ మైనపున్
జిగటాల్నిచ్చెనపంజు లారతులు న•గ్నిజ్యోతుల్ వెల్గఁగన్. 28

వ. అప్పు డప్పద్మపత్రాయతాక్షునితాదృశమహోత్సవం బేకశరీరంబున నిరీక్షించిన సంతుష్టి గా దని కాయవ్యూహయోగసామర్థ్యంబున ననేకదేహంబులుఁ దాల్చి భక్తి సంయుక్తి నిరుచక్కిం జేరి వీక్షించు సూర్యచంద్రబింబంబు జడంబునం బొలుచు పట్టుగొడుగులు ధవళాతపత్రంబులు రాణింప గరుడధ్వజాదివివిధకేతన జాతవాతాహతి నంతరిక్షంబు న నుండ నళికిపడుచుండెడు సుమగణంబుల వడువున నక్షత్రబాణపరంపరలు చెలువు మీఱఁ బాతాళభూతలంబుల సంచరించు సంచున వియత్తలంబునఁ దారువిహరించం ద లంచి విషవహ్నిజ్వాలికలు గురియుచు గగనంబున కెగయు కాంచనరానీకంబుల వీక రివ్వురివ్వున నెగిరి చను నాకసపుఁజువ్వలు మింట నెఱయ ననంతకోటిబ్రహ్మాండ

నాయకుండైన పుండరీకనాభుం డేతేరం గనుంగొని ప్రమోదంబున మహావేదండయా
నలు నేసలు సల్లిన నుల్లసిల్లు వెండిపసిండి క్రొవ్విరితండంబుల పాండిత్యంబునఁ బలుదెఱ
గులబిరుసుల వింజామరల ఫెళ ఫెళారభటి నెఱయ రాలు సువర్ణవర్ణనీయంబు లగుపూ
వుముత్తంబులు భూనభోంతరాళంబులం గప్పి యొప్పుచుండఁ దదుత్సవవీక్షణకుతూహ
లసమాగత శుక్రబృహస్పతి బుధాదులపగిదిం బగులొత్తులు వెలుఁగ వెండియుఁ జక్ర
బాణంబులు నాకాశచక్రంబులుఁ బిట్టబాణంబులు శతముఖబాణంబులుఁ దాటబాణం
బులు దేలుబాణంబులు గురుజులు కుండబిరుసులు సంపఁగిపూలబిరుసులు జక్రబిరుసులుఁ
బంచవన్నెబిరుసులు గజబిరుసులు మొదలయిన బాణవిద్యలవైఖరులు చిత్రవిచిత్రంబుగాఁ
జూపుచు బాణకారులు ముందరనడువ డమరుపురభిడ్డమరు సహచర భయదఢక్కాహుఁ
డుక్కారవచానుకలహ పటాహ తమ్మటాపజనిస్సాణ ఝల్లరీమర్దళమురజపణాతుత్తు
భికజర్జరీ పాళక్రోళక్రోలు మోరీభేరులును డోలు గౌరు గుమ్మెత మ్మెట వీరణయురుమ
యొంటికంటియురుమ పంబజివిుడికతప్పెటగిడిబిడితుడుము చక్కిచుయ్యంకియునుఁదా
శమహోత్తాళంబులును జేగంట చిటతాళంబులుఁ జిటికెలు ముఖవీణ శంఖకాంస్యళ్యం
గకాహళంబులును సన్నెగాళెవఫీరు కరకొమ్ము నాగసరమును సుతిచెంగు చేసన్నాయి
సింగినాదము పిల్లఁగ్రోవిమ్రోలుఁ బీకలును వీణె రుద్రవీణ స్వయంభువీణె మనోహర
వీణ నారదవీణ బాణవీణ సరస్వతివీణె స్వరమండలంబు తంబుర రావణహస్తంబుర
వాలుఁ గిన్నరతిపిరి కిన్నర సిద్ధకిన్నర దండె మొదలయిన హృద్యానవద్యవాద్య విశే
షంబులు దిక్కులు బిక్కటిల్ల నిర్ఘోషంబులు భోరుకొల్ప నడుగడుగునకు నీరాజనంబు
లు నేకారతి పంచారతి యళఘారతి కుంభారతి శేషారతి గరుడారతి పురుషమృగా
రతి మంగళారతి యేకదశారతులు కూర్మ స్వస్తిక నభోమంటప రంగవల్లిక లింగస్వ
స్తిక సర్వతోభద్రగిరి బంధమయూర నాట్యనాగబంధవింజామరవ్యజనచ్ఛత్ర సింహ
తలాట బృందావన కల్పవృక్ష పాలసముద్ర గంగాతరంగ శంఖచక్రపద్మంబులను పేరు
గల్గిన ముగ్గులు మాణిక్యమౌక్తికప్రవాళ మరకత పుష్యరాగ వజ్ర నీల గోమేధిక వై
డూర్యంబు లను నవరత్నంబులం దీర్చి పుణ్యభామిను లెత్తుచుండ దశాంగగుగ్గు
సాంబ్రాణిసజ్జరసశ్రీవాససరళయావనవృక్షధూపంబులు ఘుమ్మురను వాసనలఁ గ్రమ్మ
కొనఁ బశ్చిమభాగంబునఁ బరమభాగవతోత్తములు శ్రీవైష్ణవులుఁ గులశేఖరులుఁ దై
వజ్ఞకులు యతిరాజవింశతి పూర్వదినచర్య యుత్తరదినచర్య క్షమాషోడశము శరగో
స్తవము శ్రీగుణరత్నకోశము ముకుందమాల యష్టశ్లోకి చరమశ్లోకి యాళవందా
స్తోత్రముఁ దిరువాయిమొడి తిరుమంత్రద్వయచరమశ్లోకంబులు మొదలయిన ద్రావిళశా
త్రప్రబంధములు ప్రపత్తిపూర్వకంబుగాఁ బ్రసంగింప స్థల పరస్థలంబులనుండి చూడవచ్చి

న బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులునుఁ గోమటి కమ్మ వెలమ వేకరి పట్రగొల్లబలిజ కమ్మర వలగండ బెస్తల చిప్పె కమ్మరి వడ్రంగి కాశె కంచరయగసాల పడసాలె సాలెనసాతని కటిక భట్టుజెట్టి జాండ్ర తొగట గాండ్లవారును జిత్రకార వందిమాగధవైతాళిక జైన ఘూర్జర గౌడమిశ్రులును ఖేరి భళియ ఘటికి సృగాలకచత్రజాతులను బోయరుయును చెంచు యేనాది జిలగరి వానివన్నెగట్టి తంబళి యాడిగె మేదర వీరముష్టి మాష్టీయొడ్డె యుప్పరులును నసిధావక మైలారి మస్నెరి తెలారి తురక పింజారి విప్రవినోదులును జాతికర్త దొమ్మరి డొమిణి బొమ్మలాట వారును నింద్రజాలిక మహేంద్రజాలిక హస్తలాఘవసూత్రనాటకక్షౌరకరజకులును బోగమువారును దెరనాటకపు జంగాలును జంగాలు బిద్దెమువాండ్రు తెల్లకోకబత్తులు సిపసత్తులు బత్తులు పలునాటిపీరులు పరిహాసకులు సుద్దులకుమాళ్లు కొమ్మారిదాసళ్లు తవిరుదాసళ్లు కోణంగులు సేవపరులు పరసలు పడిగెవారు కంచికావళ్లవారు పరంగు లింగిలీసులు పరాసులు పళెందలు సన్యాసులేకదండ త్రిదండు లేకాంగులు వానప్రస్థులు యోగులవధూతలుపరమహంసలు బైరాగులు జటాధారులు దిగంబరులు గోముఖులు నియమస్థు లూర్ధ్వబాహులును గోరడజోగులు కాటిపాపలు మందపిచ్చులు పిచ్చుగుంట్లు చర్మకర్తులు చండాలమాతంగులు తలక్రిందు జోగులు రామగోవిందులుమొదలగు వారును బహోభాగంబున నేలయీనిన చందంబున వెల్లివిరిసిన చాడ్పున నుసుళ్లవిధంబున మిడుతగమిలాగున బేడిసెకదుపు భంగిని యామఁ జిలుకలమొత్తంబు వంతునఁ బెరయీగలపగిదిని స్వాతిబకంబుల పీఁకను గంగాతరంగంబులకైవడి జలబుద్బుదంబులవైఖరి వర్ష ధారలపోల్కి ని రామరావణబాణపరంపరలరీతినిఁ బుంఖానుపుంఖంబులుఁ దండోపతండంబులు లక్షోపలక్షులు శాఖోపశాఖలుఁ గోటానకోటులు సంఖ్యాతిసంఖ్యలుగా నడుచు సమయంబున. 29

క. నెఱిఁగంట మాళ్లిదుదు ని, ద్దఱుమంచి కుమాళ్లుగలుగఁ ♦ దయచేసినయో
పెరుమాళ్లని యావాచా, లిరుమాళ్లనొసంగి ♦ మ్రొక్కిఁ ♦ యేగుచు నుండన్. 30

క. ఆయెడ వర దత్తుం డను, కాయజరేఖా సమాన ♦ కవితాకారుం
డా యింతి యున్నచక్కటిఁ, బాయకనిలుచుండి దాని♦పై మోహమునన్. 31

ఉ. కందువమాటలాడి వగ♦కారితనంబులుచూపి సన్నలిం
పొందఁగసల్పి చేరికల ♦ నుల్లము రంజిలఁజేసి తమ్మలం
బుదఁగనిచ్చి మెచ్చి భుజ♦మందుఁగరంబిడి నవ్వుచేష్టఁగే
లిందమిరేఁచి గుబ్బలు భ♦లీయని నల్చిరతైకచిత్తుఁడై. 32

క. అవాచాలిని సంకే, తావాసమ్మునకు రమ్మ♦టని ప్రార్థింపం
గావలచి మనసుమెత్తని, దైవానిమనోభిలాష ♦ మరలం దీర్చెన్. 33

క. అది మొదలు సుదతి మదమునఁ, బొదలఁగఁ దుదలేని మోహముల కాస్పదమౌ
మదిని ముదంబులు గుదిఁగొన, మదన ప్రవర ప్రభగ్న • మర్మస్థలియై. 34

చ. చవిఁగొని జారవీరవర • సంగమ సంగ్రహణక్రియా మహో
త్సవ పరిశుద్ధబద్ధఘన • తద్ధిత బుద్ధిని సంచరించ న
య్యువిదకు నొక్కపుత్రుఁడు స • ముద్భవ మొందె మఱింతెనైనఁ బ
ల్లవసురతంబు సద్వ్రతఁ ద • లంచక యెప్పటి యట్ల సల్పఁగన్. 35

ఉ. సొంపుల నింపుచిత్తమువు • జూడఁగ వచ్చితిమంచు వేడ్కమో
హంపువయస్సుదిచ్చటికి • నైపడితే ఆ నటంచు మీదె యీ
సంపదలుల్లసిల్లు ఘన • పద్మమటంచును దానికోసమై
గుంపులు గూడి వీటివిట • కోటులు వత్తురు బోటి యింటికిన్. 36

క. ఈలాగు జారకోటికి, మేలౌ నభిమతముఁదీర్చి • మెలఁగుచు నుండే
కాలమున నొక్కనాఁ డొక, జాలుండను విటునిఁ బిల్చి • సంధ్యావేళన్. 37

తే. పురము వెల్వడి కాళికా • పుణ్యభవన, సీమ సంకేతమటకీవు • చేరు మనుచుఁ
జెప్పివాచాలిపతిలేని • చొప్పుఁ జూచి, పుత్రు నిద్దురఁబుచ్చితాఁ • బోయె నటకు.

తే. పోయి యాకాళికా వెల • పొంత నిలిచి, కటికి మబ్బున నలు చెస • ల్గలయఁ జూచి
జాలుఁడాచాయ లేకున్న • సంశయించి మనసు దెలియంగ డాఁగెనో • యని తలంచి.

ఉ. చీమచిటుక్కుమన్న వినుఁ • చిమ్మట బుఱ్ఱవ నేగునంతలో
నేముదమంది చూచుసరఁ • ణిం బశుపక్షిమృగాదిజంతువుల్
వేమఱుఁబోవుచప్పుడులు • విస్మయమందఁగ నాలకించు నా
చోమటిరాకతక్కెనె య • టంచుఁ దలంచు వియోగవేదనన్. 40

క. వీరా తాళఁగలేరా, నారానన్నేచ నేల • రారా రావుల్
మేరా మోహనమూ పళ, రీరా యటుడాఁగి పల్క • రించవదేరా. 41

మ. అనివాచాలిప్రియుంపుఁబల్లవునిడా • యం బిల్వఁగా మ్రోయు వా
ద్యనులాలించి నిజాంగనాగళరవ • వ్రాతం బిదౌ నిశ్చయం
బనుచుం దద్విభుఁ డప్పుడొక్కపనికై • యాదారిగాఁ బోవుచుం
గనియిల్లెటికిఁ జేరెదీవనుచుఁ బ • ల్కంగాంత తా నంతటన్. 42

క. ఎటువలె బొంకఁగవలెనో, కుటిలాలక నీవు తెలుసి • కొమ్మనియనఁగా
నిటునటుఁ జూచిది తెలియదు, పటుసూక్తిని నీవె తెలుపు • పత్రిప యనినన్. 43

క. ఆ మాన సాకమప్పుడు, హేమావతికనియెఁదను ని • జేశుండడుగన్
భామిని ధైర్యము వదలక, తామగనికినసిరియె వేడ్క • దమకొత్తంగన్. 44

ఉ. అయ్యలు సందెవేళఁ జనియాడఁగ నింటికిరాక దక్కితే
నియ్యెడనీదు వెంటఁ జరియించుచు వచ్చెనొ యంచు భీతిచే
నుయ్యలలూగుప్రాణముల • నోర్వకఁజేరెద వీటఁజూచితే
నెయ్యడలేఁడుచెల్లనిఁక • నేమియొనర్తు మనోహరాధిపా. 45

క. అనివాపోవుచు సతిప, ల్కినవిని యాచిత్రఘనుఁడు • కినుకెడలి జగల్
గొనిమనసువకావకలై, చనఁజెడితి నెటేగెనంచు • సతితో ననుచున్. 46

తే. నగరమునకేగి యిద్దఱు • నాల్గుదిశలు, లరయుచుండంగవాచాలి • యంతలోన
భవనమునకేగి చనుదెంచి • భర్తతోడ, వేడ్కలిగురొ త్తఁజెప్పెను • వింతగాఁగ. 47

క. నేనింటికేగిచూడఁగఁ, దానిద్రాసక్తిఁ బూనితనయుండున్నాఁ
డో నవ మదనా రమ్మని, మానినిదో డ్తెచ్చెనుగని • మందిరమునకున్. 48

తే. అట్లు తోడ్తెచ్చినిద్రించు • ననఁగు సుతుని, లేపి ముద్దాడుకొనుచుఁ దొల్లింటియట్ల
చిత్రఘనుఁడును వాచాలి • చిత్తమలర, నిండుమోదంబున సుఖాన • నుండి రపుడు. 49

క. ఆరీతి నేర్పుగలిగిన, భూర మణునిఁ జేరుమనుచుఁ • బులుఁగులదొరతన్
జీరఁగ హేమావతివిని, యారాచెలియాగడంబు • టంచు గణించెన్. 50

క. ఈరీతి కథనఁజొక్కి ప, యోరుహముఖి మెచ్చు నప్పు • డుత్ఫుల్లత్వం
కేరుహ గంధానిల మరు, దేరఁగఁ దెలవారవచ్చె • దృఢమని యంతన్. 51

సీ. పట్టెమంచము మెత్త • పయిఁదల గడబిల్ల • లగరుధూపముదివ్వె • లడప ముచ్చిటి
చాపజాబిల్లికె • సానపువ్వులచెండ్లు • తబుకు దంతపుగద్దె • తావి కడుక
గొడుగుపావలు గంధ • వడి పెట్టె గంధపు • గిన్నె సున్నపుకాయ • గిండి సురటి
తంబుర నిల్వుట • ద్దము తమ్మపడిగము • వీణకస్తురి దుద • వీణ పునుఁగు
తే. కరపటంబాకు సంబళి • కప్పురంపుఁగ్రోలిబాగాలు బకదారి • గూడ్లఁదనరు
లోపతీనెలు చిత్తరువ • లీవిఁదనరు, కేళినిలయంబుఁజేరెన • కీరవాణి. 52

క. చేరి దినాంతంబైనవ, నేరుహశరకుసుమచాప • నిర్ముక్తశరా
సారమొకయింతసైపక, భూరమణీరమణుఁజేరఁ • బోయెదు బుద్ధిన్. 53

సీ. జలదావళిరహించు • చంచలాలతలన • వేణిఁగైతకదళశ్రేణి మెఱయ
దినవిభాంకురము మై • త్రినిదమ్మిజేరెనాఁ, గాస్మీరరేఖవ • క్త్రమునఁదనర
జమశంఖమునకు ము • త్తియపుఁజిల్లులుద్రేనె, మరుఁడు నాగళమున • సరులుదూఁగఁ
బువ్వుగుత్తులఁ గప్పు • పుప్పొడి యనగంధ, వడిపూఁత గుబ్బలఁ • బరిమళింప
తే. రమ్యమేఖలఘుళఘుళల్ • రత్నహేమ, కలితనూపురఝుళఝుళల్ • చలువవలువ
ఫెళఫెళల్ గిల్కుమట్టెల • గిలగిలల్ ర, హించరాయంచకడనిల్చెఁ • జంచలాక్షి. 54

తే. నిలిచి హేమావతీ నామ • జలరుహాక్షి, హంసకులపట్టభద్ర నే • డైన మాన
వేంద్రుకడ కేగుమని సెల • విమ్మటన్న, శిరము గదలించి రాయంచ • చెలియ కనియె.

శా. అక్కా రత్నపుబొల్లసొమ్ము లివి లే • స్సారెన్ దుకూలంబహో
చొక్కంబై తగెబుక్కపూతసుమముల్ • సొంపారె శాబాసు నా
దిక్కుం జూడు శిరోవిధూననము సం • ధిల్లన్ వచో మాధురిం
జొక్కంగజెప్పెదనొక్క గాధ విని మె • చ్చుల్ మెచ్చిపొమ్మంతటన్.

క. అనుచున్న హంసపలుకులు, వినుచున్ నలినాక్షి పలుకు • విని మెచ్చనిలన్
గనుచున్నం దేసె ధారలు, వెనుచున్ నవఫణితి వపుషు • బిసభోక్త్రి యనెన్. 57

తొమ్మిదవకథ.

క. వినుము సుధాబ్ధి యనుపే, రునం గృష్ణాతీరమందు • రుచిరోన్నత కాం
చనగోపురాధరీకృత, ఘనగోపురమైనపురము • గలదొకటి సతీ.

సీ. సౌధ ఖేల ద్వధూ • జనదత్త ఖనదీబి • సాహార తుందిల • హంసచయము
హితవయస్యార్పితకల్పతరుసుమ • స్రగ్వృత్త శోధయో • షాజినంబు
సాలశృంగగశాలి • కాళీపునఃపునః, పఠిత నిర్జర సతీ • భాషణంబు
జనకార్పితోద్గ్రాప్త • వనభూజఫలవృద్ధ, భర్మగోపురశుకీ • పైక గణము.
తే. మంచివవింటంకకలరవా • మంచ కలక, లారవప్రతిరావకా • ర్యమరనాథ
కేళికాగారమణి కుడ్య • పాళికంబు, దనరుచుస్తుసమృద్ధంబు • తత్పురంబు.

వ. వెండియు నప్పురంబు విబుధరాజ మనోరంజకంబై సుధర్మాస్థానంబై ఖరి బుధ
మాధిష్ఠానంబై మెఱుపుపోలికిని రాజశేఖరకుమారాధీనంబై యమరసైన్యంబుచే
జనసమృద్ధంబై యలకాపురంబు చాడ్పున నొప్పుచుండు.

క. కరితురగరథభటోర్వీ, సురభూవర వైశ్యశూద్ర • శుభసౌధాళీ
పరణజలఖేయతరుణీ, పురుషోపవనాదిగరిమం • బురమది వెలయున్.

ఉ. భూతియుం గావుబొట్టు మెయిం • బూసిన మూలికాలునుక్కకల్కముల్
చేతంగ డెంబుం దాయెతులం • జేర్చినమందులు మంత్రతంత్రకో
పేతపు నాగబెత్తమరం • బెట్టెలునొప్పంగ రౌద్రకర్ముండన్
భూతచికిత్సకుండొకండు • పొల్పుగ నచ్చటనుండు మానినీ.

సీ. పైగాలిసోకిన • బాలుం బిశాచక, తంత్రంబు లెల్లను • దల్లడిల్లి
పాలంకువం దనుంగొన్నం • బోవుదయ్యంబుల, విసరముల్భీతిచే • విస్తరిల్లి

పేరువిన్నప్పుడే • మూరమైచనుభూ, తచయములు దిగులున • సరభసిల్లి
తొడరి నిల్చినయంతఁ • దొలఁగు దుష్టగ్రహ, ప్రచయముల్ భయమునఁ • బరిఢవిల్లి
తే. యుజును నారౌద్రకర్మని • కరము సోఁకఁ, బ్రేతభేతాళమోహినీ • పిశితభోక్తృ
కామినీ శాకినీ ఢాకి • నీ మదాంధ, భయకరబ్రహ్మరాక్షసు • ల్వల్లటిల్లి. 63
క. క్రూరగ్రహచోరగ్రహ, చారగ్రహ కూర్మశాక • చండిగ్రహ కా
ళేరిగ్రహాంతరగ్రహ, వారిగ్రహములును బోవు • వానిఁదలంపన్. 64
క. వెలఁగల రావుల మఙ్జుల, వెలుఁగులఁ బాడిండ్లశూన్య • విపినస్థలులం
గలుఁగుల నిలువక తొలఁగును, మలయక భూతములు వాని • మంత్రోద్ధతికిన్. 65
క. ఈలాగు మంత్రమారుత, తూలతృణీకృత సమస్త • దుష్టగ్రహుఁడై
యాలోకాలోకాంచిత, భూలోకఖ్యాతి నతఁడు • పొలుపొందుసఖీ. 66
తే. వానిప్రియురాలు విరివాలుఁ • బూనజాలు, రేఁడు తమినేలు జవరాలు • రేఖఁబోలు
మేలుగల జాళువాడాలుఁ • బ్రగాలు ముద్ద, రాలు ఘనువాలు పేరు న • వ్వాలఁగంటి. 67
క. కుందనపుబొమ్మ తేనియ, చిందెడుక్రొవ్విరులకొమ్మ • శృంగారము చె
ల్వందెడు గుమ్మశుభాకృతి, గంధర్వుని కమ్మదాని • కథ విని పొమ్మా. 68
తే. వాలుమీలఁబోలు • వామాక్షి చూపులు, సోము సాముగోము • భామమోము
మించు మించు సంచు • నెంచుమై దులకించు, మిన్ను చెన్నుఁ దన్ను • సన్న నడుము.
మ. భళిరా ముద్దుమొగంబు తేటలవురా • పాలిండ్లసొంపద్దిరా
బెళుకుంగన్నులసోయగంబు కటిబ • ల్బింకంబు శాబాసురా
కులుకుం జెక్కులనిక్కు మిక్కుటపుఁ డెక్కు • ల్బల్పొంకాటంబురా
తలరా దీనికి సాటిలేదని విటుల్ • తక్కెమెచ్చ బోఁటొప్పగున్. 70
చ. ఘనకనకంపుసొంపుగల • కాయము కాయజుతూఁపు చూపులన్
జెనకిన చూపు కజ్జలవి • శేషముతోఁ పమఁ జిల్కు బల్కులుం
దనరునవీనసూనముల • నవ్వెడునవ్వులు తేనెసోనజా
ల్కొను పెనుతావిమోవియు • కోమలికేతగు నొప్పు చెప్పఁగన్. 71
క. నెలరా మొగమును నునువె, న్నెలరాజీవాక్షి నవ్వు • నీలపురా వ
న్నెలు రాజిలు బలుకీల్జడ, నెలరాలజయించు మిగుల • నెలతనఖంబుల్. 72
క. నెఱికురులగుఁ గంధరములు, ధరములకన్నను గుచములు • తగసుందరముల్
దరముల సిరి బిత్తరముల్, తర మెలతాతన్విగళము • ధరవర్ణింపన్. 73
క. ఇటులఁ దులలేనిరేఖా, పటిమయుజవ్వనముఁ దనరఁ • బతి పైనిడుచు
ల్లొటమరిల కన్యపురుషుల, ఘటియింపం దొడఁగె రతికిఁ • గాఖిని వేడ్కన్. 74

సీ. ఏనాటికేపాప మె, ఉగనికన్నులకిడియెఁ గాటుకరేఖ • లేపుగులుకఁ
బుట్టిపుణ్యమెఱుంగ • నట్టినెమ్మేనికిఁ, బసపుఁ బ్లుఘటించె • మిసిమి బెళుకఁ
గలసైనఁబూకించి • కలయదువ్వనివెంట్రు, కలుదువ్వి కొప్పిడెఁ • జెలువ మెలుక
నెన్నడుసొగసేని • యెఱుఁగని గుబ్బల, కలరించెఁ గంచులి • వలపుచిలుకఁ
తే. బూర్వమెక్కాలమందైన • ముడువఁగనని, విరిసరులుఁ జుట్టెఁ గ్రొమ్ముడి • సిరులుదొలుక
నుదుటవిటకోటినెన్నొటి • మదమునాఁటి, యాఅజనుమించి యాచంచ • లాక్షియపుడు.
ఉ. పాటలు మోము త్రిప్పులును • బైఁ దిమిరించుట లోరచూపులున్
మాటలు ముద్దు జంకెనలు • మవ్వపునవ్వులు గోఁటిచిమ్ములున్
నీటుదొలంకుచిన్నెలును • నెవ్వగసన్నలు లేని యాపుల్
మేటిగసల్పువింత వగ • మిండలఁ గాంచి యఘాటి మాటికిన్. 76
సీ. పూటపూట మెఱుంగు • నీటుగాఁ బెట్టుచుఁ, గమ్మలు క్రొమ్మించు • కాంతులీన
మాటిమాటికినూనె • పాటుగాఁ బదనిచ్చి, తలదువ్వి కొప్పిడు • వలపుఁ గులుకఁ
గడెగడెకును బెట్టె • నిడియున్న గడితంపుఁ, జలువలుగట్టును • జెలువు పనర
దినదినంబును వింత • దేఱఁ జొక్కటపుసొ, మ్ములుదాల్చు నెమ్మేన • దళుకులొలుక
తే. గళమునను బూయు గందంబు • గందవడియుఁ
గ్రొమ్ముడిని జెక్కుసవరంబుఁ • గ్రొవ్విరులును
సొగసు చనరార విటకోటి • సొక్కి తిరుగఁ
జిత్తజాయత్తచిత్తయై • చిగురుబోఁడి. 77
తే. మదనపీడితయై యన్య • మానవాళి, లాప మెదఁబూని యిటుల న • లంకరించి
తిరుగుచుండెఁ జూపినవాఁడె • వెరవుపఱుచు, కొనియెఁ దమిదీఱ నమ్ముద్దు • గుమ్మవిటుల.
క. కరణమును నూరిరెడ్డిని, గరిమందగుపాఱుపత్తి • గానిఁ దలారిన్
దటియైన వేళ నీనలు, గురితోఁ బాలివోనిరతులఁ • గూడి సుఖించున్. 79
సీ. పురిబాహ్యసంకేత • పరిగృహంబున కేగి, యామికాభిప్రాయ • మరలఁ దీర్చుఁ
దటియైనయెడఁ జేని • దగ్గర కేపోయి, ప్రియముగొల్పఁగ రెడ్డి • ప్రేమఁ దీర్చు
సంచారికాలయ • స్థలికిఁ బిల్పించుక, యధికారికోరిక • లమరఁ దీర్చుఁ
నెనయ వేళైయున్న • దనయింటికేపిల్చి, గరిమతోఁ గరణంబు • కాంక్ష దీర్చుఁ
తే. బగలురాతురులను నెడఁ • బాయకుండు, మోహపరితాపవేదన • ల్మదిరిచెదరి
చెదరఁ జేయంగ వేఱొక • చింత లేక, చండమదమత్తభద్రవే • దండగమన. 80
తే. సొగసిసొగయించు నెఱయోర • చూపుచూచి
ఫలికిపలికించుఁ జిన్నెలు • బయల నెరపి

భ్రమసి భ్రమయించుఁ దనకు లో • బడఁగఁ జేసి
వలచి వలపించు నది యెంత • వానినైన. 81

క. ఈస్థితిని గొంత కాలం, బాస్థవ్విటకోటిఁగూడి • యలరుచు మోహా
వస్థలఁ జరుపఁగఁ బతికొక, ప్రస్థానము సంభవించెఁ • బ్రమదం బెసఁగన్. 82

చ. పరపురభూమిభర్తకుల • భామిని కుగ్రములైనభూతము
ల్తిరముగఁ బట్టి బాధలిడు • తెంపునసుండఁగ నానిమిత్తము
న్నరపతి పిల్వనంప గమ•నం బగు వేడుక రౌద్రకర్మఁ డా
తఱి నెఱిమాంత్రికుం డగుటఁ • దద్దయు నేగెఁ జికిత్ససేయఁగన్. 83

తే. అటుల నిజనాయకుం డేగి • యన్యరాజ, పురవరముఁ జేరె నంతటఁ • బొలఁతి యలరి
తొడుసు మాసెఁగదా యంచు • దురుసుచేసి, విటుల నలరించె నిచ్ఛాను•వృత్తి మీఱి.

క. ఆజ్ఞ యొకింతయు లేమి మ, నోజ్ఞవయోవిటపులకు మ•నోభవసమర
ప్రజ్ఞలఁ జూపుచు రతిపై, సుజ్ఞానము వొడమి పడఁతి • సొంపున నుండెన్. 85

క ఈతీరు కొన్ని దినములు, చేతోజాతానువయుల•చేఁ దనరారన్
శీతాంశువదన మెలఁగఁగ, నాతలవరి యొక్క నాఁటి • యామినివేడ్కన్. 86

ఉ. పువ్వులతోడి కొరసిగఁ • బొందుగఁ జందురుకావిజాళువా
మవ్వపుటంచు పద్మపురు•మాలు సుగంధపుఁబూఁత నేతచే
రవ్వగుచల్వదుప్పటి క•రంబున నాకులుఁ జంక వట్రమున్
నివ్వటిలంగ దానికడ • నిద్దురఁ జెంద బిరానవచ్చినన్. 87

క. చూచి ముదమంది దిగ్గన, లేచినదై యెదురుగా ని•లిచియును నొకకేల్
దాచికొని పట్టి మెల్లనె, యా చెలి తన కేళిగృహము • నతనిం జేర్చెన్. 88

ఉ. చెర్చి సరాళముల్గలుగు • చిల్కలకోళ్ళఁ దనర్చి పట్టెచేఁ
దీర్చిన తూఁగు పాన్పునఁ గ•దించినకమ్మనిపువ్వుసెజ్జపైన్
దార్చి వినోదము ల్సలిపి • దర్పకదర్పరణప్రవీణయై
మెచ్చుచునుండఁగా రతికిఁ • జేర్గొని రెడ్డి ప్రియంబు సంధిలన్. 89

సీ. కమ్మిపచ్చడమును • గంటీలపోఁగులు, మొలఁజీటికమ్ములు • ముదుగుపల్లె
నిండుచల్వరుమాలు • రెండొంకు టుంగరం, బులుఁ జుక్క బొట్టుసొం•పొలయ మెడను
గందంపునునుబూఁత • కర్ణయుగంబున, నేర్పుగాఁ జెక్కు గ•న్నేరుపూలు
కత్తెరగండఁబు • గజ్జెలు నందెలు, నాదించు జిగిసక•లాదిలిత్తి
తే. పాదముల గిల్కుకిర్రని • పలుకు మెట్లుఁ, గుచ్చుటద్దాలుఁ జేపట్టు • కోలయమర
రెడ్డిప్రియురాలివాకిట • ప్రేమనిలిచి, వాకిలి సడల్పుమనుచుఁ బి•ల్వంగనపుడు. 90

క. తలవరి గడగడవడకిన౽, గల౽గకుమని పీఁపుఁజఱచి • ఘనురాలతనిన్
నిలిపె నొకమూల నటుక, న్నెలమినివాకిలిసడల్చి • హితమలరారన్. 91

తే. రెడ్డినింట్లోకిఁబిలిచినీ • రేరుహాక్షి, వాకిలిగడించియపుడుఁదా • వానికేలు
పట్టుకొనివచ్చిశయ్యపైఁ • బవ్వళించి, ననవిలుతు కేళినిద్దఱు • పెనఁగుచుండ. 92

చ. తెలితలపాగచొక్క మొల • తిత్తిభుజంబునఁ జల్వపచ్చడం
బలచిటిబ్రేలముద్రిక యొ • యారముమీఱఁ బొగాకుచుట్ట సొం
పలరెడు కావిదోవతి ప • దాబ్జయుగంబున ముచ్చెలొప్పఁగా
నలపిభుఁడంతగ్రామ కర • ణంబటకైచనుదెంచి వేడుకన్. 93

క. పెనుతలుపుగడియఁదీయని, ఘనురాలినతఁడుపిల్వఁ • గాఁపుకొడుకు తా
వినిదిగులొందిన వెరవకు, మని రెండవమూలనటుక • నాతనినుంచెన్. 94

తే. ఉంచికదలకుమిచ్చోట • నురగమొకటి, కలదటంచునుజెప్పియా • కాంత వేగఁ
గరణమును డాయఁగాఁబోయి • గడియఁదీసి, లోపలికిఁబిల్చిమరలఁ ద • లుపునగడించి.

మ. దయకద్దా యని పల్కరించి తమిఁజెం • దంజేసి లేనవ్వులం
బ్రియమొందించికడించి ముద్దులిడుచుం • బృథ్వీధరోరు స్తన
ద్వయిజల్ బొమ్మునఁగుమ్మిక్రుమ్మి యనుమో • దంబొప్పగావించి యా
వియదాకార సుమధ్యసంగమ సుఖో • ద్వేలస్పృహాధీనయై. 96

క. తనివార కసరికట్టుక, యనివారక మోహదోహ • ళామోదము హె
చ్చనువారట్లన్యోన్యము, చనువారఁగళాదులరసి • సమరతిఁబెనఁగన్. 97

వ. ఆ సమయంబున. 98

క. నిలువంగియోర మెలికల, తలపాగఖలీతిశాలు • తావి మెయిం బూఁ
తలుపోఁగులంగ్రఘురక్షలు, వెలయఁగ వేపాఁమిాఁతి • వెలఁదుకకడకున్. 99

మ. పగకాఁడై చనుదెంచి శివిని బహి • ర్ద్వారంబునన్ నిల్చి త
లుపుగడెందీయుమటంచు నాప్రవిమలాం • భోజేక్షణం బిల్వఁగా
దిగులుంబొం దినియోగియెట్టులనుచున్ • దేహంబుకంపింప నా
చిగురుంబోడియమాత్యువీఁపడచి తాఁ • జెన్నొంద శీఘ్రంబునన్. 100

క. మూఁడవమూలను నట్టుక, పైడించినియోగినయ్య • బలయధికారిం
గూడఁజని తలుపుసడలిచి, వేడుకఁగ్రీడాలయంబు • వేగ మెచేర్చెన్. 101

తే. చేర్చివాకిలిగడియించి • చెలిమి మించి, కాంక్షలూరించి చిన్నెల • కలిమిగాంచి
మొలకనవ్వులఁజేలించి • మోహముంచి, కళలఁగఱగించి సంధించి • కౌఁగిలించి. 102

చ. మునుకొని మూఁడుమూలలను • మువ్వురు గ్రుక్కిళ్ళు మ్రింగఁ జెంగలిం
చిన తమిచేత హెచ్చి మరు • చెట్ల తెఱంగున డొంకిడొంకి పా
ర్లినగతిఁ బొర్లు కాడి చను • లీలల నిద్దఱు నేకకాంక్షతో
ననవిలుకాని పోరునఁ బె • నంగెడు వేళ నిజేశ్వరుండొగిన్. 103

తే. పరధరాధిపు భార్యకుఁ • బట్టినట్టి, భూతముల వెళ్ళఁగొట్ట భూ • భుజుఁడు మెచ్చి
దనపరిష్కారవస్త్రము • ల్దనకొసంగి, యంపకము సేయఁ దనయింటి • కరుగుదెంచి.

క. తలుపుసడలింపు మనుచుం, గులభామను మాంత్రికుండు • కూ పెట్టినచోఁ
దలఁకెడి వ్యాపారి మన, శ్చలనము పోవీఁపుఁ జఱచి • సంభ్రమ మొదవన్. 105

ఉ. నాలవమూలయందు నుప • నాధుని నుంచి కృశాంగవల్లియై
యాలువు భక్తియుక్తిఁ దని • హెచ్చు భయంబునఁ దల్పుదీసి యా
నీలశిరోజ నేత్రముల • నీళ్ల నెకాళులఁ గడ్గి కౌగిటం
దేలిచి యింటిలోపలికిఁ • దిన్నఁగఁ దోడ్కొనివచ్చి మెచ్చుచున్. 106

తే. పరధరాధిపు భార్యకుఁ • బట్టినట్టి, భూతముల వెళ్ళఁగొట్టిన • భూభుజుండు
దనరఁగా నీకొసంగిన • ద్రవ్యమేది, కనఁగొనెదఁ జూపుమన రౌద్ర • కర్ముఁడపుడు. 107

చ. తెమలని చిమ్మచీఁకటిని • దీపములేమిని జూపుటెట్లు దీ
పముగొని తెమ్ము చూపెదను • భద్రముగా నివి నీవె దాఁచిపె
ట్టుము మునుదాఁచుమూలనె క • ఠోరకుచా యని పల్కరింపఁగా
నమితభయార్తచిత్తులయి • యయ్యధికారిముఖుల్ చలింపుచున్. 108

క. మునుదాఁచు మూలదాఁచు మ, టనిభార్యను బొడిచియాడె • నదిదీపము చూ
జినఁ జూచి పీఁడు మష్మే, మనునోయనుశంక చేత • మదితహపడుచున్. 109

చ. నలువురుగుప్పుగుప్పునను • నాలుగుమూలలనుండి దూకి వి
చ్చలవిడిఁ బాఱసాగినను • సాహసమొప్పఁగ దద్విభుండు గొం
దలపడి చూచి వీరెవరు • దాఁచక చెప్పుము చెప్పకున్న న
గ్గలమున నిన్వధింతు నని • కత్తిని దానొఱదూసి పల్కినన్. 110

క. ఆవేళ నెట్లు బొంకం, గావలయునొ కొమ్మ తేట • గాఁ జెప్పి ధరి
త్రీవిభుని నెనయ జనుమనఁ, గావినియోజించి వనిత • కళవళపడుచున్. 111

ఉ. వింతకథారహస్యములు • వీనులవిందుగ వింటిఁ బార్వతీ
కాంతునకైన శక్యమిది • గాదు వచింపను బ్రహ్మలోకప
ర్యంతము చూడఁదోఁచదిది • హంసవతంసమ నీవె చెప్పి భూ
కాంతునిఁ జేర నన్నునుపు • గాథలచేత నెప్రొద్దుబుచ్చగన్. 112

క. అనవిని మేల్నెలజాణవు, గనఁ జెప్పఁగరాదె యెంత • కథయిది నే నీ
కును దెలియకున్నఁ జెప్పెద, వినవే ఘనురాలిబోంటి • విశదముగాఁగన్. 113

చ. వినుమునిజేశ నీవుచని • వేఱొకయూరికిఁబోవ నాఁటిరా
త్రిని నొకతెంబరుండఁ గను•దృష్టికిఁగన్పడెఁ గొన్నిరూపముల్
కనుపడి మమ్ము నీమగఁడు • కాలిడనీయఁడు మాస్థలంబులం
దునిమెద మేము నిన్ననుచుఁ • దాటిన నందొక భూతమయ్యెడున్. 114

తే. నాతియావేళకును గాచి•నాము నిన్ను, నీదు మగఁడింటికరుదెంచి • నిలిచి నపుడు
మాతెఱవు దానురాకుండ • మఱవిచెప్ప, చెప్పకుండిన నీచావు • సిద్ధమనుచు. 115

క. బెదరించినాఁటిరాత్రికిఁ, గదలెన్ భూతమ్ములంతఁ • గనుగూర్కెడు వే
ళ దినముదినమును వడినా, యెదుటం బొడకట్టి నాప•యింబడి యల్కన్. 116

క. పదిగైదు నాల్గు భూతము, లదయత నను జూచి నీ ని•జాధిపుఁడు మమున్
మెదలంగనీయఁ డిమ్మెడ, విదళింతుము నిన్నుఁబట్టి • వెలఁదీయనుచున్. 117

క. ఇంతకుమును పనుకను న, న్నెంతయు బాధించెనింటి • కీవిప్పుడు రాఁ
బంతము చెడి నీభయమునఁ, గాంతుఁడయవిపాత్రి పోయెఁ • గడువడిఁగంటే. 118

క. ఈరీతినీభయంబునఁ, బాలైడు భూతములఁజూచి • భామా వారె
వ్వారని సంశయమున ననుఁ, గారింపందలఁచి తహహ • కరుణయులేకన్. 119

క. నీవింట లేనితఱి భూ, తావళిచే నొచ్చుకంటె • నదయుఁడనీచేఁ
జావగుట లెస్సతనకటుఁ, గావుననిదె నలుకుమనుచుఁ • గంఠమువంచెన్. 120

ఉ. వంచినభామినీమణి న•వార్యకృపం గని తద్విభుండు హ
స్తాంచితమండలాగ్రము ర•యంబున నవ్వలఁ బాఱవైచి రా
ణించినవేడ్కఁ గౌఁగిటను • నిల్పి నెఱులొక్కనగోళ్ళఁ దీటిలో
నుంచక భీతియంచు విన•యోన్నతి నూఱటఁబుచ్చె యంతటన్. 121

తే. భూతకాపును బెట్టి వి•భూతిఁ బెట్టి
యంత్రములుగట్టి వెఱుపను • మనసుఁ దట్టి
పోయెలెమ్మన్న స్నానాన్న•భుక్తిరతుల
మగనిఁ గలఁగించి ఘనురాలు • మమతనుండె. 122

క. అనియంచ పలుకు నత్తఱి, నినుఁ డుదయాద్రిని వసింప • నింటికిఁ జని యా
దినమెల్లఁ గడపి యామిని, చనుదెంచిన నృపతి నెనయు • సంతోషమునన్. 123

ఉ. కొప్పున జాజిపూలు మణి•కుండలము ల్చెవులందుఁ గంధర
గొప్పసుపాణి పేరుఁ జను•గుబ్బలఁ గుంకుమపూఁత పుక్కిటం

గప్పురపుఁ బిడెంబుఁ గనఁ • గంపు కడెంబులు చేతులం గటిం
జొప్పడు చల్వదువ్వలువ • సొంపు ఘటింప లతాంగి వచ్చినన్. 124

క. కనుఁగొని హంసము తరుణీ, విను మొండొక చిన్నకథ వి • వేకముతో నే
వినియెద నని నీ వడిగిన, వినుపించెద ననిన విరహ • విహ్వలబుద్ధిన్. 125

క. దినములు నీ గాథలచేఁ, జనఁగాని నృపాలుఁ జేర • సాగక పోయెం
జనియెద నేఁ డైనను నా, మనవిని విని వేగ దెల్పు • మాపతగమణీ. 126

## పదునొకండవకథ.

క. అని పలికిన హేమావతిఁ, గని పల్కెఁ బతంగవిభుఁడు • కనకంబను పే
రునఁ దగు పురి నొక విప్రుం, డనవద్యుఁడు చండశర్మ • యనఁ దనరారున్. 127

వ. అతఁ డక్షర లక్షణ ఋగ్యజుస్సామాథర్వణంబులు వేదాంత వైశేషిక భాట్టప్రభాకర పూర్వోత్తర మీమాంసశాస్త్రంబులును, బ్రహ్మాండ విష్ణు నారద మార్కండేయ వామ నాగ్నేయ గారుడ భవిష్య ద్భాగవత స్కాంద మాత్స్య లైంగ కూర్మ వాయు వరాహ పద్మ బ్రహ్మవైవర్త బ్రహ్మోత్తరఖండంబు లను పదునెనిమిది పురాణంబులును ఆది సభారణ్యో ద్యోగ విరాట భీష్మ ద్రోణ కర్ణ శల్య సౌప్తిక స్త్రీ శాంత్యనుశాసనీకాశ్రమవాసాశ్వమేధ మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణంబు లను పదునెనిమిది పర్వంబులును, శిక్షాకల్ప జ్యోతిర్వ్యాకరణ నిరుక్తులును, ఉక్త అత్యుక్త మధ్యప్రతిష్ఠ సుప్రతిష్ఠ గాయత్రి ఉష్ణిక్ అనుష్టుప్ బృహతీ పఙ్క్తి త్రిష్టుప్ జగతీ అతిజగతి శక్వరి అతిశక్వరి అష్టి అత్యష్టి ధృతి అతిధృతి కృతి ప్రకృతి ఆకృతి వికృతి సుకృతి అభికృతి ఉత్కృతియను నిరువదాఱు ఛందస్సులును, శైలజ రోమజ వాసిష్ఠ సోమసూర్యాది సిద్ధాంతంబులును, నుపమా రూపక దీపకావృత్త్యాక్షేపార్థాంతరన్యాస వ్యతిరేక సమాసోక్త్యతిశయోక్త్యుత్ప్రేక్షా హేతుసూక్ష్మలేశక్రమ సర్వప్రియోర్జస్విపర్యాయోక్తి సమాహితోదాత్తాపహ్నవశ్లేషోక్తి తుల్యయోగితా ప్రస్తుతప్రశంసా వ్యాజస్తుతి నిదర్శనాసహోక్తి పరివృత్తి సంకీర్ణ విభావనాద్యలంకారంబులును, నమరామర శేష విశ్వశాశ్వత శబ్దార్ణవ యాదవ వైజయంతీ నానార్థరత్నమాలికాకార హలాయుధ వాగురి కేశవ తారపాల ధన్వంతరీ ధరణీ ధనంజయ రభస విశ్వప్రకాశ మాధవ చింతామణి జయప్రతాప శుభాంగజయపాల క్షీరస్వామ్యేకాక్షరాది నిఘంటులును, సంస్కృత ప్రాకృత శౌరసేని మాగధి పైశాచి చూలికోక్త్యపభ్రంశాంధ్రములను నష్టభాషలును స్వరనిత్యసమాసప్లుతకాక్వాదేశ ప్రాదిప్రాదియోగవృద్ధ్యభేద దేశీయోభయశకంధ్వఖండవిభాగ వికల్ప ప్రభునామ భిన్నవర్గ సంయుక్త వికల్ప సం

యుక్తములను జక్కటియెక్కటిపోలికలును సరసానుస్వార బుజువు లనంబరఁగు
యతుల విధంబులును సమనామసంయుక్త సంధిగతోభయ ప్రాది వికల్ప బిందు
బిందు బుప్రాస త్రికారసమలఘుప్రాస మైత్ర్యంత్య దుష్కరద్వంద్వ త్రిప్రాస చ
తుర్థప్రాసా ద్యష్టావశ ప్రాసంబులును, మగణ యగణ రగణ సగణ తగణ జగణ
భగణ నగణంబులును, జంద్రేంద్ర సూర్యగణంబు లను నుపగణంబులును బ్రయోగింప
తత్తద్దేవతాలక్షణంబు లెఱింగి శర్కరా ద్రాక్షా నారికేళపాకంబుల కవిత్వరచన లెఱింగి
సకల విద్యాపారంగతుండై యుండె నప్పుడు. 128

తే. అతఁడు తనసతు లిద్దఱు • నహరహంబు, వావొనర్చుట సైఁపక • వలపుఁగులుకు
పిన్నపెండ్లా మపక్షమై • పెద్దభార్య, భాషిణీనామఁ గడసుంచె • దోషమనక. 129

సీ. నెఱిగొప్ప నెఱరంగు • నీలంపుసరులచుల్, నాకదభావంబు • జూఱగొనఁగఁ
గలికి కాటుకకంటి • చెలువుభారద్వాజ, గరిమంబునైనఁ జే • కాను పలుప
మించు సిబ్బెపుగుబ్బ • మీనుపలు కుంభజ, సన్నవృత్తమంతయు • జడియఁజేయ
మందయానపుఁ బ్రౌఢిమము మతంగజధైర్య, పర్యాయ మెంతయుఁ • బగులఁజేయ
తే. నవసుధామయ మధురోక్తి • నైపుణములు, శుకమనోవృత్తి నెంతయుఁ • జులుకఁజేయ
మెఱుఁగు జిగినిచ్చ వగజక్క • నెఱతనంబు, వెలయఁ జరియించు నదియు నవ్వీటిలోన.

తే. మగఁడు కైలవాడవైచిన • మట్టుమీఱి, బిడ్డపాపలఁ గనియెత్తి • పెంచుజోలి
లేదుగావునఁ దిండిచే • నూఁది పోఁత, బొమ్మవలెఁ నుండు నక్కొమ్మ • యెమ్మెచిమ్మ.

చ. కుడువ సమస్తభాగ్యములు • కోరికమీఱఁగఁ గట్టవస్త్రముల్
దొడుగ విశేషభూషణములుం దనరార నలంద గంధముల్
ముడువను మంచిపువ్వులు • మొత్తముగల్గిన భోగహీనవై
పడఁతుక లుండనేర్తు రటె • ప్రాయమునం బెఱ ప్రోవనాయకన్. 132

తే. పిఱుఁదుఁ బిక్కలుఁ జెక్కులు • బెడఁగుఁ దొడలు
వెడఁద యొడలును జన్నులు • వెంద్రుకిడను
సందులేకుండ బలియుట • సకియమనసు
జార సంభోగకేళికి • స్వారివెడలె. 133

వ. అది మఱియును. 134

క. జారుల మదిజారఁగ నా, నారీమణిమోవి లేఁత • నవ్వేసగించున్
హారంబుల వారంబుల, హీరంబులనర రదాళి • యించుక మెఱయన్. 135

తే. మనసు నిలువక తమిహెచ్చి • మాఱుమగల, వెనకఘుండంగ నప్పుడా • వీధి వెంట
వింతపరదేశి చతురాఖ్యు • విప్రుఁ డొకఁడు, వచ్చె భాషిణి కనువిచ్చి • మెచ్చిచూడ

ఆ. విప్రుఁ డివ్విధమున • వీధి నేతెంచుచు, సొలసి కెలకు లరసి • చూచికొనుచుఁ
దన్నుఁ జూచుచున్న • ధరణీసురాగ్రణి, తరుణిగాంచి దాని • దఱియవచ్చె. 137

తే. వచ్చి ధర్మాభివృద్ధిఁ గా•వలె నటంచుఁ, బరమభాగీరథివి మహా•భాగ్యశాలి
వనుచు దీవించి నా కింత • యన్న మనుచు, వేఁడ భాషిణి యావిప్ర•విభున కనియె.

క. వే రెయ్యది యూ రెయ్యది, మీ రెయ్యెడ కేగఁదలఁచి • మెట్టితి రిటకం
చారసి యడిగిన జాడబ, సారసలోచనకు వేడ్కఁ • జతురుం డనియెన్. 139

చ. మునుపు ప్రసిద్ధిమీఱఁ దమ•మూఁడవతాతతరాన నుండియుం
·డిన యది కాణయాచిగను • డెంకణధారుణియందుఁ దండ్రి నక్
గని చదివించు బుద్ధి నయ•గారికి నప్పనసేయ నక్షరా
స్యునిగ నొనర్తునంచు బడి•కొయ్యనఁ దోడ్కొనిపోయి యచ్చటన్. 140

సీ. నన్నయ్య వారలో • నామాలు దిద్దుకొ, మ్మనినచోఁ గడుపునొ • ప్పనుచు నేడ్చి
దండమ్మునను గుణిం•తము పెట్ట రమ్మన్న, నంగుళివ్రణమాయె • ననుచు జుణిగి
శిష్యులచేఁ గాలు • సేతులు గట్టించి, తెచ్చి పద్యముఁ జెప్పఁ • దెమలకుండి
పలక వ్రాయు మటంచు • బడి కెత్తుకొనిపోవ, బలపంబు లేదని • పలుకకుండి

తే. యలుకచే నుండ బుగ్గలు • నులిమి తిట్టి, తొడలు వడిపెట్టి కోదండ • మడరగట్టి
రెట్ట లెగఁబెట్టఁ బట్టించు • నూపు మాపుఁ, గొట్టుబెట్టుగ సజ్జన•కోలదెగను. 141

సీ. గద్దించి వడిదిట్టి • దిద్దుమంచును వ్రేలు, వెట్టింప నచట నేఁ • బెట్టకుండఁ
బలుమాఱులో యని • పల్లుమంచును గొట్టి, చెప్పినశిలవృత్తి • దప్పకుండు
నొకటికి సెలవియ్య • నుఱికి చీఁకటిదాక, బసులగాపరులవెం•బడినపోదు
జననియడుక్కొని • చదువుకోఁ బొమ్మన్న, వినక వేసుఖువెక్కి • వెక్కియేడ్తు

తే. సారెపద్యపుఁబలుకపైఁ • జమురుపూఁతు, నెప్పుడును బెద్దపలక పా•క్కెత్తజేతు
బాలరామాయణము పుస్త•కాలు దాఁతు, వేయుసజ్జనకోలలు • విఱిచివైతు. 142

క. చరిసుండ పగులఁగొట్టుదుఁ, బరువడి సూత్రంబు ద్రెంచి • పారగవైతున్
మరిమరి బలపము లిచ్చినఁ, బోరిదినమును బగులఁగొట్టి • పోయె నటందున్. 143

తే. నన్ను బింగీలు పెట్టించు • నాఁడె యయ్య, వాఁడు నిగ్రింపఁగాఁ జూచి • చేరి యచటఁ
జింతవ్రేల్కొమ్మవంచుక • సిగనుగట్టి, విడిచియు ఱికిలి నయగారు • మిడికికూయ. 144

తే. అంతఁ దలిదండ్రు లయగార • లదిమొదలుగ, వేడివెసలట్లు వేసరి • విడువ నేను
గొంటెవగ నాతతాయులఁ • గూడుక పలు, గాకిచేష్టల నాటలఁ • గ్రందుకొంటి. 145

వ. అంత మఱియును,

సీసమాలిక. దాఁచియు జాబిల్లి ♦ బూచి కన్నులకచ్చి, గుడిగుడిగుంజాలు ♦ కుందెనగిరి
చీఁకటిమొటికాయ ♦ చింతాకుచుఁబుదులు, పులియాటలును జిట్ల♦పొట్లకాయ
తూరనడుక్కాలు ♦ తూనిగతానిగ, చిడుగుడు మొకమాట ♦ చిల్లకట్టె
దాఁగిలిమూఁతలు ♦ తనుబిల్లయాలాకి, గుబ్బట గురిగింజ ♦ కొండకోఁతి
చిక్కణబిల్లయు ♦ జెల్లెము గొడుగును, బిల్లబిద్యము లక్కి ♦ బిక్కడండ
గడ్డైనబోడియొ♦క్కసికొక్క బరిగాయ, పోటు గీరసగింజ ♦ బొంగరములు
పెంచులబేరిదో♦పిల్లుగావిపటంబు, సరిజేసి పుటచెండు ♦ చాకిమూట
గోట దొర్లుడుకాయ ♦ గొబ్బిళ్లమోపిళ్లు, నీగపోగిసబంతి ♦ దాఁగిలాట
వెన్నెలకుప్పలు ♦ వ్రేలుబొట్టగ గిరి, సింగన్నపత్తియుఁ ♦ జిందుపఱుపు
గచ్చకాయలు కిట్టు ♦ గానుగత్రిప్పళ్లు, గుట్టపెక్కడు పంటి ♦ గూళ్లుసూళ్లు
కాలికంచంబును ♦ గట్టెగుట్టముబినా, యసతిరితూనె కొట్లాటచెమట
కాయెత్తుగొడుగు బొం♦గరమురామన్నాట, పాడుగుళ్లుసుయ్యాల ♦ బొర్లపక్క
బండ్లికలును జొప్ప ♦ బెండ్లమంచంబులు, గంగెద్దులాటలు ♦ గనికెసుండ
వీనెగాజులు పోతు♦టీనెగుట్టంబులు, నాల్గుకంబాలాట ♦ నట్టకోఁతి
ఉంటికిన్నరమంటె♦గంటిపోట్లాటలు, సింగన్నదాటులు ♦ జిఱుసురాతి
దాబాటలను మంచి ♦ తాటాకు చక్రచ, క్రాలత్రిప్పుడుతోఁచి ♦ గాయపదుపు
పాడుపాతరమాళ్లు ♦ పాతరల్ బంతులు, చిమ్మనగ్రోఁపులు ♦ చిట్టుబుట్ట
లాకుపీకలు జండ్ర ♦ లాటలు చంద్రాళ్లు, గిలకలు చిటుకెలు ♦ కీచుబురలు
కోలాటములు పిల్లఁ ♦ గ్రోవులు గుమ్మడి, క్రోవికూఁతలు నూఁదు ♦ క్రోపులొడ్డు
విడుపునెట్టునుగాయ ♦ విండ్లమ్ములాటలు, పులిజూదములుకట్టె ♦ పుట్టెచెండ్లు
దాయాలు సొగటాలు ♦ దాత్రాయ చదరంగ, మునుజోటు రాళ్లును ♦ మూఁతపాడుపు
వామనగుంటలు ♦ వడిగుప్పిగంతులు, చెఱకులపందెముల్ ♦ చిమ్ముతాయి
తుమ్మెదరేఁపుళ్లు ♦ కుమ్మరసారెలు, బందారుబసవన్న ♦ పత్తికాయ
తిరుగుడుబిళ్లల ♦ త్రిప్పుళ్లు జరుగుళ్లు, చటితాళమిాళలు ♦ నెటికెతట్లు
తే. తాటియాకులచిలుకలు ♦ తాళ్లపాము, లకటయగచాట్ల ప్రాంతనై ♦ యాడుకొనుచుఁ
జదువుపై సంధ్యపై నాస్థ ♦ చాలలేక, పొలతి యీరీతి నేఁబ్రొద్దు ♦ పుచ్చుచుండ.
క. విను మాట్లాడఁగ బెద్దలు, ననుగని పనినేయుమనుచు ♦ నాటినకోపం
బున నేవలాడ వినలే, కనుదేశభ్రమణవృత్తిఁ ♦ గైకొని మఱియున్. 147
క. సత్రాశన పాత్రుఁడనై, విత్రాసము మాని వింత ♦ విషయములవడిన్
యాత్రావస్థలఁ దిరిగితి, రాత్రి పవళ్లనక వినుము ♦ రాకేందుముఖీ. 148

వ. ఇంత యేమిటికంటేని. 149

సీ. తల్లికిఁ గలనైన • దయలేదు నామీఁదఁ, దండ్రి యెప్పుడు చూచి • వేండ్రపడును
బినతండ్రి బెదరించుఁ • బెదతండ్రి కారించుఁ, బెదతల్లి యారక • బెట్టుఁదిట్టుఁ
బినతల్లి నెటికెలు • వెళ్లనవిఱుచును, నన్నదమ్ములు చూడ • రతులకరుణ
నదినెలు మఱఁదండ్రు • వదరుచు శాసింతు, రక్కలుఁ జెల్లెండ్రు • లెక్కఁగొనరు

తే. మేనమామలు భావలు • గానివానిఁ, గాఁగఁ జూతురు మావాడ • కట్టువారు
కంటగింతురు నన్నంటేఁ • గమలజాతు, వ్రాఁతఫలమేమియో కాని • వనజగంధి.

తే. ఇంక నెన్నైనఁగలవు నా • హీనదశలు
నాపదలుఁ జెప్పనేఁటి మీఁ • దాఱునెలలు
పట్టునది యేటిజోలి నా•పాపఫలము
నేటితోఁ దీఱె నోకొమ్మ • నిన్నుఁ జూడ. 151

క. అని చతురాఖ్యుఁడు నేగనె, తనవృత్తాంతంబుఁ జెప్పి • తరలాక్షి క్షుధా
ర్తిని డస్సితి భోజనమిడు, మని భాషిణినడుగఁ గానె • యది యిట్లనియెన్. 152

క. ఈవేళమాత్ర మన్నము, గావించెదఁగాని మాపు • కదలక దినముల్
నీవు పరుండెదవా సుఖ, జీవితముగ నిచట నొకటి • నెప్పెద నీకున్. 153

తే. అనినఁ జతురాఖ్యుఁ డామాట • కాశఁ బొంది
నీవు చెప్పినమర్యాద • నిజము నేను
జేయఁ గలవాఁడ నని బాసఁ • జేసి యపుడు
భోజనమొనర్చి వెలువడి • పోయి యతడు. 154

సీ. అప్పుడె యేమని • యడుగనైతి నటంచుఁ, బలుమాఱుఁ దలఁచి యా•ర్పులునిగుడ్చు
నీసారిచనివేఁడ • నేమనునోయని, సంకోచమునఁగొక్కి • చక్కఁబోవు
నస్తమానముగా దఁ•టంచుఁ బాదచ్ఛాయ, లొనరించు వ్రేళ్లెంచి•కొనుచునుండు
నీయూర గడియార • మేడలేదా యని, వీథివెంబడిఁ బోయి • వెదకి చూచు

తే. లీలఁ బవళించు దిగ్గన • లేచిపోవు
నిలుచుచోటను నిలువక • నిప్పఁద్రొక్కు
కోతిచందానఁ జతురాఖ్య • కుండఁదిరుగు
వెలఁదిపై మోహమెద నొత్తి • వెఱ్ఱియెత్తి. 155

క. ఇటులఁ దమిహెచ్చి మారుఁడు, సటలం బెట్టంగ నొచ్చి • సడి నటునిటుఁ జెం
దుటకు వెఱసొచ్చి రతిసం, ఘటనార్థము మిగుల వేగు•కాలమునందున్. 156

ఉ. భానుఁడు గ్రుంకఁగాఁ గని య•పారముదంబునఁ బొంగి భాషిణీ
మానిని యిల్లుచేరి వగ•మాటల తేటలఁ బ్రొద్దుపుచ్చి యా
హా నిపుణోక్తులుం జెనక • నాబిడఁ జూ చిటురమ్మటన్నచోఁ
బూనికె నిట్లు! చేకొనెడు • బు ద్ధిటువచ్చితి నేమి చెప్పరా. 157

తే. మంచి తగినగృహస్థుఁడ • వెంచఁబరక, కత్తుకొమ్మన్నఁ బాతికె • కత్తుకొంటి
వనినఁ జతురుండు వణఁకంగ • నప్పళించి, జడియకు మటంచుఁ గౌఁగిటఁ•జక్కఁ జేర్చి.

క. తరితీపు వగలుఁ జిన్నెలు, మరిపెములు వినోదకథలు • మోహపుభాష
ల్పరిపరివింతలవలపులు, నెఱయంగాఁ జూపి సురత • నీరధిముంచెన్. 159

వ. ఇట్లు చెలంగి. 160

చ. కురు సురతక్రియాం ప్రణయ•కోపమతిం త్యజ పూర్వసంగమం
పరిచినుదేహిగాఢభుజ•బంధనమంగజశాస్త్రివాసనాం
స్మరదదఖండనంఘటయ • మామవమాశశరాన్నఖక్షతం
విరచయయంచుఁ బల్కుచును • వేడ్కపచింతురు జారదంపతుల్. 161

వ. ఇట్లన్యోన్యసరసస్సల్లాపంబుల నెడతెగని మోహాతిరేకంబున సంఫుల్లహల్లకభల్లమల్ల యుద్ధమహోద్ధతసన్నద్ధబుద్ధిని సరికట్లం బెనంగి యుల్లసిల్లి కరంబులు కరంబుల నురంబు నురంబున ముఖంబు ముఖంబున యూరువు లూరువు లంగీలు కొల్పికొని నిద్రించు సమయంబున. 162

చ. వనితయు నిద్రలేచి తెల•వారెను లెమ్మని జారులేపి నీ
వనుదిన మిట్లు రాత్రిసమ•యంబునవచ్చి యనంగసంగరం
బున నను డాయు మంచు నెర•మోహముతో వినుతింప మంచిదం
చను పచియించి వేడ్కపడు•చుం జతురాహ్వయుఁ డేగె నెంతయున్. 163

తే. ఏగి సంధ్యాద్యనుష్ఠాన • మెలమిఁ దీర్చి, పురములోఁ రచ్చతావులఁ • బ్రొద్దుపుచ్చి
యస్తమయము సమీపమా • నంత నేటి, కేగి మజ్జనమాడి య•థేచ్ఛతోడ. 164

క. అక్షసరం బార్ద్రాంశుక, మక్షయ కరపాత్ర మమర • నతఁ డప్పురిలో
భిక్షాందేహి యటంచు న, పేక్షం బ్రతిగృహముఁ దిరిగి • భిక్షంబెత్తున్. 165

తే. ఎత్తితెచ్చిన భిక్షాన్న• మెల్లఁజల్ల, శాకమిడునింట భుజియించి • సకలవైశ్య
జాల యాచితలబ్ధతాంబూలచర్వ, ణోష్ఠశోణిమమోమున • నొఱపు నెఱప. 166

క. మనుజులు నిద్రాశయులై, యొనరినతఱి నాల్గుదిక్కు • లొగిఁ జూచుచు వే
చని భాషిణియింటికి ముద, మునఁ జతురుఁడు నిచ్చ దాని • ముచ్చటఁ దీర్చున్. 167

వ. ఇట్లు ప్రతిదివసంబున నతండు భాషిణీయోషాభిప్రాయంబు దీర్చునంత. 168

మ. ఉహుహూ కారిలనూవిఘూనన జన•వ్యూహోపభూజృంభమా
ణహసంతీజ్వలనంబు శీతపవమా•నస్పర్శరోమోద్గమా
వహనాంగాఖిలజంతుసంఘము హిమ•వ్రాతాంబుజాతాండ మి
మ్మహిమీఁదం బొడసూపె నెయ్యెడల హే•మంతంబు దుర్దాంతమై. 169

సీ. సకలదిశావ్యాప్త•బకసితీకృతములు, బహుళనిద్రాముద్ర•పంకజములు
నిబిడవర్షితసహో•నీహారకణములు, శీతలోత్తరజాత•వాతతతులు
వర్ధితనిర్ధూమ•వహ్నివాసంతులు, నైగవవికసన•కారణములుఁ
దాలవృంతవిహార•కేళిదారణములు, యామినీసముదయా•యామసములు

తే. సరసమృగమదమేచకా•గురుసుగంధ, బంధురశ్రీకుచద్వంద్వ•బాధయుక్తి
చకితపురుసావళీశీత•సాధ్వసములు, భాసురము లయ్యె హేమంత•వాసరములు. 170

ఉ. శాంతములయ్యె నెండలు ని•శాంతములయ్యె వధూకుచంబుల
త్యంతము వాడి వేడిమికిఁ • దాంతములయ్యె పయోజము ల్వ్రిణీ
క్రాంతములయ్యె వాతెఱలు • కాంతములయ్యె మహోష్ణవస్తులా
శాంతములయ్యెఁ దావులు ని•శాంతములన్ హిమవారివారికిన్. 171

తే. అట్టి హేమంతకాలంబు•నందు నొక్క, నాఁడు చతురుండు భాషిణి•తోడఁగూడి
రాత్రిఁ బరిపరిరీతుల • రసికవృత్తి, సురతకేళుల నైపుణిఁ • జూపునపుడు. 172

చ. నెలవునఁ జండశర్మను గ•నిష్ఠకుటుంబిని లేనిపోనివా
దులజగడించు యిల్వెడలఁ • దోలిన వ్రాలిన చింతనొంది యా
ర్పలెనయ దైవమా యనుచుఁ • బొక్కుచు నెవ్వఁడు బల్కరించుఁ జే
రెలుఁగున భాషిణీయుపతి • యింటికి వచ్చె నతండు ఖిన్నుఁడై. 173

తే. వచ్చి యచ్చండశర్మ తా•వాకిటకడ, నిలిచి తనయగ్రమహిషినిఁ • బిలువఁగానె
గుండె ఝల్లని చతురుండు • కొంకుచుండ, నతని నెట్లింతి యిలువెళ్ళ• ననుపవలయు. 174

క. ఇది దెలిసిన నృపునెనయం, బద మని రాయంచపలుక • భామామణి నాఁ
కదితెలియ దెటుల ననిపెను, విదితముగాఁ దెలుపు మనిన • విహగం బనియెన్. 175

తే. ఆటుల నిజపతి తనుఁబిల్వ • విటునికేలు, పట్టి తోడ్తెచ్చి భాషిణీ • పద్మగంధి
తలుపుఁ దెఱచుచు నామూల • నిలిపి వాని, నాత్మనాథుని కెదురుగా • నరిగి యపుడు.

ఉ. నెయ్యము మీఱఁగాఁ జరణ•నీరజము ల్తలసోఁకి మ్రొక్కి వే
డ్కయ్యెడఁ బల్లవింప హృద•యంబున భాషిణి యాత్మనాయకున్
శయ్యకుఁ దాల్చి దివ్వె లిరు•చక్కి వెలుంగ ముసుంగువెట్టి నే
డెయ్యెడకైన నేగవె చెలీ యని పల్కి పసండెఁ దిన్నఁగన్. 177

చ. అనువచనంబు దన్ను నొకయన్యగృహంబున కేగు మంచుఁ బ
ల్కినదని యాత్మ నెంచి వడి గేహము వెల్వడి యావిటుండు పో
యినతరువాత భాషిణి నిజేశునిదగ్గరఁ బండ సైచకం
గొనకొనలేనివాడు లొనగూర్చి చరించెను వేగునంతకున్. 178

క. జారులపై నాసక్తులు, నారుల కన్నటుల నాత్మ నాయకులపయిం
గోరిక లున్నవె యని ఖగ, మారయ వచియించుతటి నిశాంతం బైనన్. 179

మ. కని హేమావతి దాని మెచ్చుచు సమగ్రస్వర్ణసౌధాంతరం
బున నక్షీణనిజాళివాగ్గొలుసులన్ బొల్పొందునుయ్యాలపై
ఘనతం జేరి వసుంధరాధిపతి యోగ్రప్రాప్తిమగ్రాంతమా
దనుకం గుంది తమిస్రమాట కెడ మోదం బంది యాశిమ్మటన్. 180

సీ. సకటాక్షదీప్తికాంచనరత్నతాటంక, ధగధగల్ చెక్కట్లు దలఁగఁద్రోయ
సకపోలకాంతి మౌక్తికహారవల్లికా, చకచకల్ సాంద్రచంద్రికలు గాయ
నవలయధ్వని హేమసప్తకీకింకిణీ, ఘణఘణల్ శ్రుతి కౌతుకము గ్రమోయ
సస్థానకసుగంధసారసదళదామ, ఘుమఘుమల్ ఘ్రాణోత్సవముగఁ జేయఁ
తే. గళుకుపనిచిల్కవగలేఁత తళుకు లొలుకు, జాళువాకమ్మి సరిగంచు చలువవలువ
ధళధళల్ జాజిపువ్వుమొత్తములు గురియ, నంచకడఁ జేరె సాతానిఁ బెంచుబోఁడి.

క. చేరిన హేమావతి ముఖ, మాఱసి నెఱజాణవౌదు వనుదినము నెయి
న్వేరొక వగ గుల్కఁగ శృం, గారింపఁగ ననుచు ముదము గల్పించి యనెన్. 182

పండ్రెండవ కథ.

చ. మనవి పరాకుమాని విను మానిని పూనికమై కళింగభూ
మిని సిరి కాస్పదంబు జనమేజయుఁ డేలు సుగంధబంధురం
బనుపుర మల్లసిల్లు మణిహర్మ్యవినూతనకేతనచ్ఛటా
జనితసువాతఘాతసురసాలపతత్సుమధౌతవీథియై. 183

శా. అం దుండున్ భసితత్రిపుండ్రమును గామాత్తుల్జడ ల్కక్షపా
లందున్ దండము కావివస్త్రములు రుద్రాక్షల్ దువాళించు కా
లందె ల్పాదుకలు న్మృగాజినము బెత్తం బొప్ప సంసారి యో
గీంద్రుం డొక్కఁడు శూద్రుఁ డీశపదభక్త్యేకాగ్రచిత్తాబ్జుఁడై. 184

వ. అతండు పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లను పంచభూతంబులును, త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణంబు లను జ్ఞానేంద్రియంబులును, వాక్పాణి పాద పాయూపస్థలను కర్మేంద్రియంబులును, శబ్ద స్పర్శ రూప రస గంధంబు లను విషయేంద్రియంబులును

మనో బుద్ధి చి త్తాహంకారంబు లను నంతఃకరణచతుష్టయంబును, జీవునితోఁ గూడి పంచవింశతితత్వంబు లగు నని యెఱింగి యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లనంబరగు నష్టాంగయోగంబులఁ జతురుండై కమల యోగ బ్రహ్మ గారుడ సుఖ వీర కూర్మ సిద్ధానంత కుక్కుటాసనంబుల నిశ్చలత నిలిచి రేచక పూరక కుంభకంబులను, ప్రాణాపాన వ్యా నోదాన సమానంబు లను ప్రధానవాయువులను, నాగ కూర్మ కృకర దేవద త్త ధనంజయంబు లను నుపవాయువులను స్వాధీనత నొందించి యిడా పింగళ సుషుమ్నా మార్గంబులను, నున్మని మనోన్మనులను నాదబిందుకళలను, సాంఖ్య తార కామనస్కంబులను, మంత్ర హఠ లయ రాజయోగంబులను, మూలాధార స్వాధిష్ఠాన మణిపూర కానాహత విశు ద్ధాజ్ఞా సహస్రారంబు లను చక్రంబులను దెలియనేర్చి యా త్మాంతరాత్మ పరమా త్మ జ్ఞానాత్మ స్వరూపంబు లెఱింగి సత్పురుషుల నాశ్రయించియుఁ దత్ఫల లబ్ధిఁ గానక కేవలంబు శైవమతధురంధరుండై యుండె నంతట. 185

క. ఆరాధ్యుఁడు తమవంశా, చారమునకు గురుమహత్వ • స త్తముఁడు ప్రియం
బారఁగ నతనికిఁ బెట్టిన, పేరును శివదత్తుఁడంద్రు • బిసరుహగంధీ. 186

తే. సంతతమ్మును జంగమా•ర్చనలు సల్పి, సోమవారంబునను వీర•భద్రుపళ్లె
రంబు నిడి వారిపాదతీ•ర్థమున భుక్త, శేషమునఁ దృప్తిఁబొందుచుఁ • జెలఁగునతఁడు.

సీ. అయ్యావళీ ముఖ్య• మై తనరా రెడు, మిండజంగంబులు • మెఱసి నడువ
గౌరఘేమల్లప్ప • గంగకు ననుకంచి, కావళ్ల వారును • గలసి చనఁగ
గుమ్మెత లిక్కన్నర • ల్గూడి వాయించుచు, భైరవజోగి వెం•బడిని కదల
బసవగంటలు బృహ•త్పటుశంఖములు మ్రోయ, శివరాత్రిజంగాలు • చేరి కొలువ

తే. లశునతిలపిష్టచూర్ణభా•గశనమిసిమి, యుల్లిపచ్చళ్లు పులిదోసె • లూరుబిండ్లు
నూటజోలలు చిటిగాళ్లు • మ్రోసితేగ, నాతఁ డేఁటేట శ్రీశైల • మరిగివచ్చు. 188

తే. వీరశైవంబు ముదిరి యే•వేళనైన, హరహర శివా మహాదేవ • యనుచుఁ బల్కు
పలుకులేకాని యితరసం•భాషణంబు, లాఁడ డెన్నఁడుఁ బెండ్లాము•తోడనైన. 189

క. ఆతనికి విశాల యనం, గా తరుణియొకర్తు దనరుఁ • గమ్మవిరిలకో
రీతురకశాతులాయను, లోతే జీరతన మనుచు• లోకులు వొగడన్. 190

క. దానివిలాసపువదనము, దానిచొకాటంపుగబ్బి • తళుకులగుబ్బల్
దానిపసమించుదేహము, మానవతీ పొగడశక్య•మా విధికైనన్. 191

సీ. నీలాల రుచినవ్వు • నెఱివేణిమొత్తమ్ము, తమ్ములనిరసించఁ • దగుమొగంబు
గంబూరభంగభంగ • గ్గిలపించు నునుఁ బల్కు, పల్కుఁదు రాణుల • పసను మించు

నించులనిర్జించు • మెయితీవపొంకంబు, కంబుసోయగముల • గళముమారు
మాపుగుడారము • ల్మానినిగుబ్బలు, బలుదీవి నగు నితం•బంబుమహిమ
తే. హిమమయూఖాస్యయూరుల • యేపుదెగడు
గడుసు రంభలసొగసు జం•ఘలుజయించు
నించు విలుకానిశరధుల• నేణనయన
యనఘ పదములుకెంజివు • ల్లపహసించు. 192
క. చివురా వాతెఱ నల్లని, కవురా నునుసోఁగ వెంట్రు•కలు పుత్తడి మేల్
నవురా దేహము ముద్దుల, దవురా యని జనులు పొగడ • నాబిడ యమరున్. 193
తే. దానినెమ్మేను మెఱుఁగుఁ దాఁ • బూనఁగడఁగి, పుత్తడి వెలంది చిదపలై • ముద్రవేసి
యొఱసియొట్టంబు వడికాఁగి • నెఱయఁజిమిడి, కఱఁగి నీరయిపోవును • గలువకంటి.
ఉ. సారసమానపీనఘృణి • సంపదకాంచును నెమ్మొగంబు కా
సారసమానవిభ్రమము • సారె జయించును నాభియుక్ సుధా
సారసమానమాధురిని • జాలరహించును మోవిచంద్రికా
సారసమానహృద్యరుచి • సంతతిమించును గాంతహాసముల్. 195
శా. పున్నాగంబును గెల్వఁజాలు రుచిరాం•భోజాస్య వేణీరుచు
ల్పున్నాగంబును నవ్వనోపు నెఱయక్ • లోలాక్షియానంబులుం
బున్నాగంబును గేరిమీఱి మెఱయుం • బూఁబోఁడినూగారుడాల్
బున్నాగంబును మించు నాభిచెలువం•బుక్ సారె వర్ణింపఁగన్. 196
క. అతను జయధర్మలీలా, హితవృత్తిక్ గర్వ్బములు రహించె ననుచుఁ దా
నతను జయధర్మలీలా, హితవృత్తి రహించి మించు • నింతిపదంబుల్. 197
చ. అదిపతిభక్తిమీరక ది•నాంతముదాఁకను సేవఁజేసి యిం
పొదవఁగ నారగించి వస•నోత్తమభూషణపుష్పగంధసం
పదలనుదేలి రేలు ప్రియ•భర్తను నిబ్బెపుగబ్బిగుబ్బలక్
గదియఁగఁ గౌఁగిలింపఁ జనఁ•గాఁ గని కోపవిఘూర్ణితాత్ముఁడై. 198
క. శివదత్తుఁడు హరహరయని, యవలికిఁబో రంపలాడి • యని తనుఁద్రొబ్బం
గ వయసుదిగనుక నాశల, దివురు ప్రతి కతివ సాహ•దీక్ష చెలంగన్. 199
సీ. పదము లొత్తెద నంచుఁ • బతిజంఘికలు దన, తొడలపై వ్రేసికొ • నుడిసిపడును
నడుము పట్టెద నంచు • నాథునిచిఱుతొడ, ల్పుడికినఖీయని • పొరలునవల
నుపబర్హ మెగఁద్రోయు • నుంకించి మోమ్ముపై, మోముఁజేర్చినఁజూచి•ముదుగులా
వ్రేల్మెటికెలు దీయ • నెసనెత్తి హస్తంబు, కుచములపైవ్రేసి • కొనినదిట్టు

తే. బక్కలోఁ జేరి కౌఁగిటఁ • జిక్కఁ బట్టి
కులుకుగుబ్బల నెదఱొమ్ము • గుమ్మి క్రమ్మి
రతి బలాత్కారమునఁ జేయ • ధృతి వహించు
ప్రేయసిని జూచి రోయుచుఁ • ద్రోయు నతఁడు. 201

క. ఈలాగు నిచ్చనిచ్చలు, వాలుగు టెక్కెంబుఁ బూను • వానిదురంబుల్
లీల నొనరించఁ జూచు వి, శాలను ఛీ రంకులాడి • చను మని తిట్టున్.. 202

తే. అతఁడు పరసౌఖ్యమునె కోరి • యాస బొంద, డిహామునం దుచ్ఛసౌఖ్యాప్తి • కింతయైన
రాతి కిడునట్టి గిలిగింత • లై తనర్చుఁ, గాని ప్రియురాలిచేష్టలు • గలచవశని. 203

వ. అది మఱియును. 204

సీ. ఎడలేకఁ గవగూడి • యేప్రొద్దు రతిసల్పు, వారివైఖరుల కేఁ•కారఁ దొడఁగు
నయ్యాటములు గల్గు • జంపతీక్రీడసఁ, గెరలి వేమాఱు గ్రుఁ•క్కిళ్లు మ్రింగుఁ
గందర్పకేళులఁ • బొందు సతీపతు, లాసక్తికిని భావ•మందుఁ గుందు
సురతఖేలనవధూ•వరుల మైత్రికి మాన, సమున నిట్టూర్పులు • సల్పి పొక్క

తే. విరి లకోరీ దునేదారి • దురముఁ గోరి, మిారి పోరాడు సుకుమార • మిధునతతుల
వైభవముఁ గాంచి హా యంచు • వడిఁ దపించు, సంగమవిహీన యైన యా•జలజనయన.

తే. కుడువఁ గట్టను దొడుగను • ముడువఁ బుడవ, నెంతగలిగినఁ బ్రాయంపు•టింతులకును
గ్రామ్యధర్మంబు లేకున్నఁ • గలుగు దుఃఖ, మొతని వచింప వచ్చునో • దంతిగమన.

తే. వినుము నానావిధంబుల • దినము దినము
రాత్రి రమణుని గదియఁ బో • రంకులాడి
పోవె యని త్రోయ గుబ్బలఁ • బొందు పైఁట
చెరఁగుఁ బఱచుకఁ బండు నుఁ•స్సురు మటంచు. 207

ఉ. మిన్నక యిట్లు భర్త తన•మిాఁద విరాళి వహించకున్న యా
కన్నియ చూడి యీమదిబి•కారునితోఁ బని యేమి నా కటం
చు న్నిరసించుఁ బంచశర•సుందరరూపుల జారవీరులన్
గ్రొన్నన వింటివానిమొన•కుం గదియించెన నంచు నెంచుచున్. 208

క. వేవిన శివదత్తునకును, సేవలు సేయుటలు మాని • చిత్తం బలరన్
భావజనిభు లగుజారుల, త్రోవలు గనుచుండె విరహ•దోహళకాంక్షన్. 209

చ. చికిలి విభూతిరేఖ జిగి•జిల్కెడు కప్పులకాంతిజోఁక హా
టకమణిభూషణంబుల మిఁ•టారపుఁ డెక్కులమాఁక వాసనా

ధికసుమగంధసంపదల • తేటగుసిస్తులవీఁక యొప్పఁగా
నకట విశాలనామసఖి•హర్షముతోఁ జరియింపు చుండఁగన్. 210

క. అంతట నితాంతహర్ష, స్వాంతయుతద్యూత జనర•వ త్రుభితహరి
ద్వంతిశ్రుతిరై నగర, ప్రాంతంబున కోడి పదువు • పందెము సాగెన్. 211

తే. కావిప్రాఁతలు దారాలు • కట్టుముళ్లు, ముష్టులును నీళ్లముంతలు • మూలికలును
గత్తులపొదుళ్లు మంత్రము • లక్కట్టుపసరు, లెనయ వచ్చిరి పందెగా • ల్లేపు రేఁగి.

తే. డేగ నెమిలి పింగళి కోడి • డేగకాకి, పన్నెలై దింటె కిరులండు • పన్నెలండు
రాజ్యభోజనగమననిద్రామరణము, లను విచారించి యుపజాతు•లను పచించి. 213

సీ. పట్టెజుట్టుది మైల•పుట్టమిట్టుది గూబ, బిలుకజుట్టుది మూఁగ • బిట్టుకోడి
పట్టుమార్పుది యర • జుట్టుది బోరది, బూడిదెవన్నెది • పొడది సెల్లు
కాలుది గుజ్జుది • గాజులగాడునో, గలది పండెబ్బది • గద్దెకోళు
దెబ్బనిదురగలి • దీకెలదారెము, నల్లది కొప్పది • తెల్లయురగ

తే. పిల్లవేళ్లది మొద్దుది • నల్లయురగ, లనఁగఁ దగుకత్తికా ల్పుంజు • లందులోనఁ
బనపుపావళ్లు కాలందె • లెనఁగునట్లు, గావిరేకలు బిరుదులు • కీవి గలుగు. 214

సీ. గరుడండు శరభంబు • కంచుడమారము, రణభేరి కార్చిచ్చు • రాతిబొమ్మ
రాముబాణము మిత్తి • రాహుత్తి పిడుగు హ, వ్వీరుండు పుంజుల • వేరువిత్తు
గండగత్తెర గుండె • గాలంబు మాష్టీఁడు, పట్టభద్రుఁడు బెట్టి • భైరవుండు
కత్తులపొది సింహ • గాలి బేతాలుండు, పసులపాతర పాద•రసము చిలుకు

తే. టమ్ము సుడిగాలి చక్రంబు • నలజడదరి, శూలము పిరంగి వెలినక్క • సాలువంబు
కాళరాత్ర్యంతకుఁడు పందె•గాండ్రు మెచ్చ, లనెడు పేరులపుంజుల• గొని ముగించి.

చ. చౌరఁబడి కాంచి ప్రాఁతలును • చుట్టియుఁ గత్తులు వ్రేసి సందిటం
బెరయఁగఁ బట్టి చెక్క గఱ•పించి గి రేర్పడ గీచి నిల్చి కొ
క్కొరమఁగఁ జూచి పందియపు • టెంకువ దిద్దుచుఁ జిక్కొవేసి స
ల్లిరి మరివో యటంచును ఖ•ళీపెళిపుంజులు దన్నులాడఁగన్. 216

క. కృకలాకువులం బుట్టిన, కకపికలా దడచుచుండఁ • గాలజ్జరణో
ర్వికడను నిలిచిన శకనా, మకు నొకనాయకునిఁ జూచి • మానిని మెచ్చెన్. 217

ఉ. మెచ్చినయింతలోఁ జిగురు•మే లడిదంబు శిరాన దూసి బల్
పచ్చనివింటి బోయచెలి•పైఁ బడి నిబ్బరపుబ్బుసిబ్బెపు
న్మచ్చగలట్టి గుబ్బకవ • నాఁటఁగ చిక్కన గుమ్మిగుమ్మి తా
నచ్చుగఁ బేర్చి యార్చె హరి•ణాక్షిమనంబు గలంగ నెంతయున్. 218

తే. అపుడు తనుదానె తెలుసుక • యబ్జనయన, కులుకు గుబ్బలఁ జిన్నారి • కోట్ల రవిక
పిగులఁ బోకము దూడిపోఁ • బేర్మితోడ,శకునిఁ జూచుచుఁ దనయింటి•చక్కి నిలిచి.

చ. అతఁ డొకనీటికాల్వకడ • కంతట వేచని తామ్ర చూడ శో
ణితయుతహస్తముల్ గడుగు•నేర్పున నుండఁగ వానిచెంతకుం
గుతుక మెలర్పఁగా జని శ•కుం గని కోమలి కొంకుపాటుతోఁ
గొతుకుచుఁ బల్కె నొంటి నిటు•గూడునె రాఁ దనవంటిదానికిన్. 220

క. అని నీళ్లఁ గాళ్లు గడుగుచుఁ, జనఁ గావలె నమ్మ చెల్ల • సరె తడనాయెం
గన నెవ్వారును లే రని, ఘనకుంతలపల్కుచుండఁ • గా శకుఁ డంతన్. 221

క. ఇంతీ యెవ్వరు లేరని, గొం తేటికిఁ జేసె దెవరు • గొనిపోయెదరే
యెంతపనివచ్చినను నిదె, చెంతనె యున్నాఁడ భీతిఁ • జెందకు మనినన్. 222

చ. విని చిఱునవ్వు నవ్వి భువి•వింతలు వోమగనాండ్ర నీగతిం
బనుపడి యొంటి నుండఁ గని • పల్కుట న్యాయమె యంచు బల్కె నీ
వినుదిన మెందు నుందు వెవరైనను • వచ్చెద రేల చెప్పుమా
ననవిలుకానివంటి నెఱ•నాయక యంచు విశాలవేడినన్. 223

క. నేనుండు దెపుడు మాహురి, లోన న్నాపేరు శకుఁడు • లోలాయత నే
త్రానాయుల మానసములు, పూని కనుంగొనెడు బుద్ధి • భూమిఁ జరింతున్. 224

వ. అని చెప్పి నవ్వుచు వెండియు నిట్లనియె. 225

క. ఈవీట నొండు చిత్రము, గావించెడిపాటిదానిఁ • గన మీవఱకున్
నీవైతె జాణ వౌదువు, గావోలు న్మాట లటులఁ • గా వినఁబడియెన్. 226

క. అదిగాక నిన్నుఁ జూచిన, మొదలుక్ మదనాస్త్రతతుల • మొనఁబడితి ననుం
గదియించి గబ్బిగుబ్బల, పొదుగున నీడేర్పు రతులఁ • బొసఁగించి సఖీ. 227

తే. అనిన విని యావిశాల సూ•రా యటనుచు, మెచ్చి తనమదిలోఁ గల • మేలి మెల్లఁ
దెలిసితివి జాణ వౌదని • పలికి యతని, రమ్ము నాయింటి కిపు డని నెమ్మిమీర. 228

క. త్వరితగతిం దనయింటికిఁ, దిరిగి తిరిగి చూచుకొనుచుఁ • దెరవయుఁ జనె నా
సరణిని వడి శకుఁ డాబిడ, శరణమునకుఁ జనియె వేడ్క • సఫలతఁ బొందన్. 229

తే. ఇద్ద ఱీరీతి నింటిలో • కేగినప్పు, డొంటిపాటయ్యె శివదత్తుఁ • డింటలేని
కతన నని పొంగి యన్యోన్య•కాంక్ష లూర, సురతకేళికిఁ జెలరేఁగి • చొచ్చి హెచ్చి•

చ. అలసటలేక సహ్యగుణ • మందక తగ్గక తొట్రుపాటునం
గలఁగగ పాలుమాలక వి•కారముఁ బొందక యాలసించకం

దొలఁగక నిద్రమబ్బుగొని • త్రూలక నిద్దఱు నేకకాంక్షతోఁ
దలిరుకటారి వానిబెడి•దంపుదురం బొనరించి రెంతయున్. 231

చ. లకుముకులట్లు సర్పముల•లాగునఁ గుక్కుటజాతిచాడ్పునం
బికములలీలఁ బావురపు•బిట్టలతీరునఁ జెట్లవీఁక ఘే
నుకములవైఖరిం గపుల•నూఁకుడుభంగిని భైరవాశ్వయు
గ్మకములరీతి సింహముల•కైవడిఁ బోరి రనూనచాతురిన్. 232

తే. అటులఁ దమిదీర కుండెడి • యాస్థతోడ
ముచ్చటలు దీర నిరువురు • మొనసి పెనఁగు
వేళ శివదత్తుఁ డింటికి • వేగ వచ్చి
చూచె నాశ్చర్యకోపవి•స్ఫురితుఁ డగుచు. 233

వ. ఇత్తెఱంగున. 234

క. ఘర్షించి కనులనిప్పుల, వర్షంబులు గుఱియఁ జూచు • వల్లభునకు నా
ధర్షిణి యపు డేవిధమున, హర్షము గావింప వలయు • నని యడుగుటయున్. 235

తే. హంసకులసార్వభౌమ నీ • వనుదినంబు, కథకుఁ గథ కిట్లు నన్నడు•గంగ నేల
చెప్వ మేలాగు హర్షింపఁ • జేసె మగని,నని హేమావతిని జూచి • హంస యనియె.

క. విను మటుల మగఁడు కోపము, పెనఁగొని ఘర్షించి పలుక • భీతిల్లక యా
వనజదళాకారవిలో, చన ధైర్యము చెదరనీకఁ • జతురత ననియెన్. 237

క. మరుకేళిఁ గవయు కవ్వలి, కరుగవె చీ రంకులాడి • యనినను సిచ్చల్
నిరసింతువు యోగివి గన, నరకా నీవాకె తాఁకె • నాసెం జూడన్. 238

చ. పలుమఱు రంకులాడి యని • పల్కెదు నీవచనం బమోఘమై
నెలకొని తాఁకె సిద్ధుఁడవు • నీమహిమం బదియేల వ్యర్థమై
తొలఁగు నటంచుఁ బల్కి చెలి • దూరిన నాత్మతపోవిభూతిచేఁ
దలకొను వాక్యసిద్ధికి ముం•దంబు గొనెన్ శివదత్తుఁ డెంతయున్. 239

చ. అటుల నిజాధినాథుఁ డపు • డాత్మమహత్త్వగుణోపలబ్ధి కు
త్కటమగుమోదమందఁగను • గామినిఁ జూచినయం బతివ్రతా
పటిమ వహించు మంచు బహు•భాషలఁ బల్కుము పల్కకున్న నీ
కిట ఘటియింతు హత్యతను •, వేటికి నేఁటికి నింద వచ్చినన్. 240

తే. అనెడు సతివాక్యమునకు స్త్రీ•హత్యకులికి, తనదువాక్సిద్ధికిని నద్భు•తంబుఁ జెంది
నీ విఁక మహాపతివ్రతా•భావమహిమ, వెలయవే యని యోగి దీ•వించెఁ బ్రీతి. 241

క. అటువలె దీవించుచు నె,ప్పటియట్లనె వేఱుసేని • పక్షంబున న
జ్జటిలుం డుండెను జెలియును, బటుముదమున మెలఁగుచుండెఁ • బడఁతుక వింటే.
క. ఆరీతి మహోపాయము, నేరిచిన ట్లాఁగవయు • నెలకొను మన నా
కార జగజంత యని తెల, వాఱుటఁ గని భామకేళి • వసతికి జనియెన్. 243
వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పినవిని హర్షంబు నొంది నలుండు దరువాతివృత్తాంతం బాన
తి మ్మని ప్రార్థించిన. 244
మ. నిరవద్యస్వయశోవినిర్జిత సుహా • నీహార నీహార భూ
ధర పుత్రీశ్వర కావ్యగోత్ర విధికాం • తా గౌరవా గౌరవా
కర మందార పటీర శంకర పతా • కాతారకా తారరా
డరవిందోద్భవవాహ పథ్యతిథిపా • కాహార కాహారపా. 245
అనులోమవిలోమకందము. రామాకుజరాజనుత ర
మామరసుమరాగకర సు • మాకర సమరా
రామ సరకమాసుర కగ
రామ సురమమారతనుజ • రాజకుమారా. 246
తోటకవృత్తము. వారణ వారణ • వారణరక్షా
సారస సారస • సారసపక్షా
శారద శారద • శారద కీర్తీ
హారిమ హారిమ • హారిమమూర్తీ. 247
గద్య. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధి సంపూర్ణ పూర్ణిమాచంద్ర సహాయ కవిత్వ నిర్మాణ చాతుర్య నిస్తంద్ర శ్రీరామనామ పారాయణ నారాయణామాత్య ప్రణీతం బైన హంసవింశతి యను మహాప్రబంధంబు నందు దృతీయాశ్వాసము.





శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# హంసవింశతి

## చతుర్థాశ్వాసము.

### పదుమూఁడవకథ.



రాజితజితవారిధి
వారిధితనయాంశజాత • వసుధాపుత్రీ
హారిస్తన కుంకుమఘన
సారమృగీమదసుగంధ•చర్చితవక్షా. 1

వ. అవధరింపుము ప్రత్యుత్పన్నమతి నలున కిట్లనియె నట్లు ప్రభాతకాలంబుఁ గావచ్చినఁ గనుంగొని. 2

క. చిగురాకుబోఁడి యప్పుడు, మగరాజిగిరాయిడించు • మందిరభూమిన్
బగ రాజిల్లెడు తొగరా, జగరాతికి నది రసించు • సాయం బైనన్. 3

క. కని జలకమాడి సొమ్ములుఁ, దనరంగ నలంకరించి • తరలేక్షణరా
డ్తనయునిపై మోహంబునఁ, జనఁగా గాయంచ చూచి • సఖితో ననియెన్. 4

తే. అక్కఁరుచిఁ గల్గు చక్కెర • లానవాలు, వెట్టెదవె యొక్కగాథఁ జె•ప్పెదను వేడ్క
నది నవీనప్రవాళరా•కాధరోష్ఠి, వినిన నొక్కింత నేర్పు నీ • కెనయు సుమ్మి. 5

క. అనవిని చిఱునవ్వొలయం, బని చెలుఁపులకథలు చెప్పి • పార్థివుఁ జేరం
జననీయు వైనఁ జెప్పుము, వినిమెద నన సతికి హంస•విభుఁ డిట్లనియెన్. 6

తే. పూర్వమున బ్రహ్మసభకు నేఁ • బోయి కొంత.
కాలమందుండి యచ్చ డంప•కంబు సేయ
మానససరంబునకు వచ్చి • మామకీన
కులజులను గాంచి భువిఁ జూచు•కోర్కె వొడమి. 7

సీ. హిమవన్నిషధ మేరు • హేమకూటాస్తోద, య ద్రోణమలయ విం•ధ్యా త్రికూట
మాల్యవన్మందర • మైనాక గంధమా, దన సహ్యపారియా•త్రక సువేల

ఋక్ష మక్షత శృంగ • ఋశ్యమూక మహేంద్ర, సామాన గోశృంగ • చంద్రవృషభ
శాలేయ సుశిరబీ•జ మతంగ కైలాస, శతకేతు భృగునీల • చక్రవాళ
తే. కనక మేఘాంశుమత్పుష్ప • గరుడభద్ర, చిత్రకూట సుదర్శన • శేషసింహ
రోహణ శ్రీగిరిక్రౌంచ • రుద్ర మత్స్య, సూర్యరోహణముఖగిరు • లూచి యంత. 8

సీ. కోరింద నలతుమ్మ • గొట్టికె కోడారయ, వెణుతు మూఁడుగ దంతి • వెట్టిసమ్మ
చిటిగార సుందరి • చీ కెట్టిదుమ్మయుఁ, దెల్లదు మ్మల్లింద • కల్లితొట్టి
జమ్మి బబుసు గార • చంద్రదపటికి తెల్ల, వుప్పిలొద్దుగ జిడ్డు • బుడ్డతుమ్మ
కలివిరి గుండ్రయు • గచ్చ పెన్నంగయు, దుడ్డుమంగయు భూత • తొట్రుకోవె
తే. మాడ్చు చిట్టికొక్కి సీకాయ • మండ్ర తొట్టి, వెలగ వాకుడు పల్లేరు • ములక వేఁప
నగిరె నీర్గొబ్బి మొదలుగా • జగతిఁ గల్గు, కంప లన్నియు వేవేగఁ • గడచి కడచి. 9

సీసమాలిక. జిల్లేడు బెంపలి • జిడ్డువెంపలి పైఁడి, తంగేడు తంగేడి • తగిడి నుస్తె
ములువెంపలి ములుస్తె • గలిజేరు గుంటగ, జ్జేరను దంతిబం•దారి నేల
తంగేడుమెట్ట బం•దారి దుండుగ బ్రహ్మ, దండి భూతులసెట్టి•దొండి చల్ల
పిల్లిమాడుపు చార • పిల్లడ్గు చిత్రమూ, లము నల్లతీఁగె కో•లాకు పొన్న
ముయ్యాకు పొన్నయు • మొగబీర తుత్తెర, బంకదుత్తెర హంస•పాది గంటె
కామ జిలుగు మెట్ట•దామర వెట్టిసె, నగ జంబిరము కాచి • నల్లకాచి
శ్రీతులసియు సంబ•రేణు నేలుసిరి శే, శ్వరి నేలవే మూటి • చల్లగడ్డ
సహదేవి జుట్టుప • చలిపిండి చిటిముటి, పెన్నేరు విషబొద్ది•పిండి దొండ
నెనుటాయి గొలిమిడి • నీరుబచ్చలి ప్రబ్బి, వేసు గన్నేరాఁడు • బీరనేతి
బీరపేరా ముట్టి • పీచరములు గొలి,మిడి చేదుపొట్ల యు•మ్మెత్త తిప్ప
తీఁగె విష్ణుక్రాంత • తీంగ్రెడెట్టి చిత్రమూ, లము దొండతీఁగె ము•ల్లంగి గొల్ల
జీడెద్దు మట్టేకు • చేగొడ్డ చంద్రకాం, తెట్టనియబ్బెంద • యెట్టతుమ్మి
కుప్పి సూర్యక్రాంత • ముప్పడు నరవండు, గాడిదెకడపర • కన్నెకొమర
నల్లగెంటెనపూలి • తెల్లగెంటెన యుత్త, రేణు గుబ్బిరి సంబ•రేణు బండి
గురిగింజ గురివింద • తురతపత్తియుఁ బత్తి, తలదిడ చబ్బంద • నులియుచీకె
వెలగ విషమదారి • వెట్టికుందెన మంచి, కుందెన కలబంద • గువ్వగుత్తి
మామెనయును నేల•మామెన యటకమా, మిడి దూల గోవెల • ఘేఁక ఘేయు
తే. నాకు నల్లేరు నులిజము • డాకుఁజెముడు
నేలత్రటుక సింధియుఁ • గోలచెముడు

బొంతచెము డుల్లియును సదా • ముష్టి మొదలు
గాఁ గలుగునట్టి చిలుచెట్లఁ • గాంచి యంత. 10

సీసమాలిక. రావి మామిడి కొండ•రావి మేడియు బ్రహ్మ, మేడియు జీడిమా•మిడియుఁ జింత
పులిచింత మోదుగు • ములుమోదుగును వెల్గ, పుల్లవెలగ వెట్టి•బిల్ల చిల్ల
బూరుగ కలుగొట్టు • భూతపాపిరి కుక్క, బూరుగ చిటిగొట్టి • భూతనెరిద
నేరేడు మజ్జి యల్ల• నేరెడు పాదిరి, తడగూబ తడవేఁకు • కడపబట్ట
కడపకొడిశ పాల•కొడి శెట్టులొద్దుగు, చిరివేఁకు లొద్దుగు • జీడిపాల
కలు జువ్వి వావిలి • గండువావిలి యేపు, మద్ది మద్దియును నేఁలొద్ది యొద్ది
తెల్లకాంచనము తుంఁదిల మెట్టకాంచన, ముష్టి తెల్లుష్టి నీఁరుప్పి యిప్ప
తాండ్రచందన మేపి • దాసాన మెట్టుదా, సానము బందుగ • జారబేన
మట్టివిరికి తొండ్లి • మట్టుతూ కిచ్చెడ, పెద్దవిరిగి పక్కి • గద్దనెల్లి
కాకితూ కందుగు•కానుగ వరగోఁగు, గోఁగుబొట్టు కచిక్కి • గోగుకొండ
గోగుపొగడ ములు • గోరంటలును బెద్ద, వెలమ సుంకేసరి • వెట్టిచిక్కి
నాపుప సురపొన్న • వారిజమును బొన్న, నెల్లి మూలుగబిల్లు • నెమిలియడుగు
కొండగుమ్ముడు రేఁగు • గొరమి సంపగికొండ, సంపెంగ మారేడు • సరళదేవ
దారు గుమ్ముడుమోవి • తపసియుఁ గుమ్మర, పోల్కి గుగ్గిల మెట్టు•పోల్కి వేగి
దేవదారు రుసిరికె • తిలకము తెల్లన, గిరి వేఁప కరివేఁప • తురకవేఁప
వేపుపనస గుత్తి • వెట్టినారు వరేల, పనస కరక కొమ్మి • పలుకరేణి
బండచింతయు నల్ల•బలుసు సురభి చీకి, రేని కూకుడు నెమ్మి • ప్రేంఖణమ్ము
భూతాంకుశ మశోక • భూర్జపత్రమ్ములు, బోళము మంకెన•పులుసు గంగ
రేఁగు తక్కిలి ములు•వేగి భూచక్రము, మొక్కన కొక్కన • మొల్లమాను
హనుమంతబీర మంఁకెన గిరికర్ణిక, పెడముల్లె కొండముఁక్కిడియుఁ గోల
ముష్కదాడిమ బీర • మొగలింగ గోదాడు, నేదాడు ఖర్జూర • మీత నేల
తాడి బగిస పోఁక • తాడు కొబ్బెరచెట్టు, పెద్దమాను పతంగి • బెండగలుగు

తే. కణుదు రిఖుకుడు కాలుగ • కాన్గ సన్న, విఁగి సోమింద గున్నంగి • దిరిసెనంబు
మొదలుగాఁ గల్గు బహువిధ•భూరుహములు, నిండి యుండెడు కానల•పిండు లరసి. 11

క. వెన జంబూప్లక్షుక్రౌం, చకుపుష్కరశాల్మలికుశ•శాకద్వీపా
లెనఁగఁ గనుగొంటి లవణే, క్షుసురాఘృతదధిపయోవి•శుద్ధజలాబ్ధుల్. 12

సీ. స్వాయంభువోత్తమ • స్వారోచిష బ్రహ్మ, దక్ష వైవస్వత • తామసేంద్ర
రౌచ్య రైవత రుద్ర • భౌచ్య చాక్షుష సూర్య్య, లనెడు చతుర్దశ•మనువు లమరి

బ్రాహ్మ్యార్ష దివ్యబా•ర్హస్పత్య సౌరచాం, ద్ర గురు పావన పితృ•నామకసన
మానమ్ములును గేతు•మాల కింపురుష హి, రణ్మ యైలావృత • రమ్య కకురు
తే. భరత భద్రాశ్వ హరిసంజ్ఞ • వర్షములును, భార తేంద్ర కశేతు గ•భస్తి నాగ
తామ్రరోహిణి సౌమ్య గాం•ధర్వ కాఖ్య,లమరు నవఖండముల నొప్పు • నవనియందు.
సీ. ద్రవిళ విదేహ మా•ళవ మత్స్య మళయాళ, కొంక ణాంగ విదర్భ • కురు పుళింద
చేది టంకణ వత్స • సింహళ కర్ణాట, మగధ ఘోట కళింగ • మద్ర యవన
కుకురు బాహ్లీక పౌండ్ర • ఘూర్జర నేపాళ, శక వంగ కాంభోజ • సాల్వలాట
సౌరాష్ట్ర చో ళాంధ్ర • శబర పాండ్య వరాట, కుంతల కేక యా•వంతి కాశి
తే. నాట కరహాట సింధు గాం•ధార నిషధ, కేరళ తురుష్క పాంచాల • శూరసేన
కోస లోత్కల కాశ్మీర • కుత్స బర్బ, రముఖ హూణాఖ్య సర్వదే•శములు చూచి.
క. యమునాతమసామధ్య, క్షమకమలోత్పలమరంద•సంగ్రహణాద
భ్రమతిభ్రమద్భ్రమరవి, భ్రమగీతత తాభ్రసురత•రంగిణి చెంతన్. 15
సీ. పొడయెండ గాయని • పొన్నగున్నలనీడఁ, గ్రొమ్ముత్తియపుటరుం•గులు చెలంగ
గొజ్జంగి పొదరిండ్ల•పజ్జలఁ బచ్చక, ప్రములు నిండినద్రాక్ష•పందిలితగ
శశికాంతకుట్టిమ•స్థలులను బన్నీటి, పరజల్లు జలయంత్ర•పాళిదనర
కేళి కేకాకూళి • క్రేప చక్ర చకోర, హంస భ్రమ త్సార•సాదికలిత
తే. కలకలారావ విస్తార • కమల కుముద, సౌర భాగార నీహార • నీరపూర
వీచికావార దుర్వార • విహృతి ధీర, శీతలసమీర కాసార•సీమఁ గంటి. 16
వ. మఱియుఁ దత్కాసారంబున నిమిషసంచారయోగ్యంబై యమరావతీపురంబును, శంఖమకరకచ్ఛపాధిష్ఠానంబై యలకాపట్టణంబును, ధార్తరాష్ట్రవిహారస్థలంబై హస్తినగరంబును, బకనివాసంబై యేకచక్రంబును, శంకరాధారంబై కాంతారంబును, శింశుమారచక్రవికాసితంబై మేరువునుం బురడించుఁ దత్తీరంబున. 17
క. పల్లవిత కలిత పుష్పిత, సల్లలిత మరంద వళిత • సత్ఫలిత మహీ
జోల్లసితాభ్రంకషమై, యుల్లము రంజిల్లఁ జేయు • నొకవన మొప్పన్. 18
ఉ. ఆవనసీమ నొక్కతరు • వంబరచుంబితశాఖియై చుమం
బావహిలంగఁ జేయఁ గని • యాగమనశ్రమమున్ క్షుధార్తియుం
బోవ ఘటింపఁ బూనియును • భూజముపై వసియించి నాకగం
గావనజాతజాతబిస•ఖండము లానుచు నుంటి నయ్యెడన్. 19
ఉ. కొండలక్రిందుమీఁదుగను • గూల దిశావళి వ్రీల నుష్ట్రవే
దండము లుర్వి వ్రాలఁ ద్వరి•తంబున వారిధు లింకి గ్రాల బ్ర

ష్టాండము తూల నాదిమము • హాహిపసూకరకూర్మమూర్తు లొం
డొండ గలంగి సోలఁ జటు • లోద్ధతి నుర్లెను నేలయ న్నొగిల్. 20

వ. అప్పుడు. 21

చ. హరిశిఖిదండిదైత్యపరు • ణానిల యక్షపభర్గు లెక్కు యా
మరకరిమేషవాహరిపు • మానవవక్రమృగాశ్వనందులన్
గురుపవిశక్తిదండవర • కుంతగుణధ్వజఖడ్గశూలభృ
త్కరులయి కుంభయంత్రగతిఁ • దాల్చిరి దిక్పరసైన్యసంగతిన్. 22

క. ఆతఁడె నే నాకసమున, కాతలసంరంభగతుల • నతిజవ మొప్పం
గా తెలివి నెగసి చూడఁగ, భూతలచలనం బడంగి • పోయినపిదపన్. 23

క. ధరణీసుర భూభృద్వి, ట్చరణజభటరథగజాశ్వ • సద్వస్తులచే
నిర వొందు పాండ్యభూమిని, బరిపూర్ణం బనఁగ నొక్క • పట్టణ మున్నన్. 24

తే. కని మహామోద మొనరింపఁ • గాపురంబు
కాపురంబున నుండెడు • ఘనజనముల
కలిమి బలిమియు వీక్షించు • కాంక్ష వొడమి
యొక్క సౌధంబుపై డిగ్గి • యుంటి నందు. 25

తే. పరకతలగుడ్డ యొకసాటి • పచ్చడంబు, ముసుక నీర్కావిదోవతి • మొలనుసంచి
తిత్తి వెండుంగరము వ్రేల • హత్తి యొప్పనుండు శతుఁ డను పేదని • యోగి యొకఁడు.

సీ. క్షేత్రఘాతంబుల • స్థితు లవకాణించి, సౌవర్ణగణితోక్త • సంఖ్య దెలిసి
మిశ్రితగణితార్థ • మిళితమనస్కుఁడై, గాఢప్రకీర్ణక • గణిత మెఱిఁగి
త్రైరాశికాద్యంత • సారాంశము గ్రహించి, సూత్రగణితమునఁ • జొచ్చి కలఁచి
మఱిభిన్నగణితంబు • మార్గ మెల్లను గాంచి, పరగణితంబులు • పారఁజూచి

తే. నిఖిలసిద్ధాంతసూత్రము • లేర్చి జగతి
గణకకులసార్వభౌమత్వ • గణనకుఁ దగి
గణితమర్మజ్ఞుఁ డితఁ డని • ఘనులు మెచ్చఁ
దెలిసి యతఁ డెంత లెక్కైనఁ • దేటపఱుచు. 27

గణితము పేరులు.

సీ. త్రైరాశికప్రకీ • ర్ణసువర్ణ పంచరా, శికమేషపార్ణరా • శికసమాధి
కారవీరాచార • ఘాతకుంటాహ్వాయ, చ్ఛాయార్యభటబృహ • జ్జాతకోత్క
లితసప్తరాశిక • లీలావతీవర్గ, వర్గమూలక్షేత్ర • వాస్తుభాగ
గణితసారచతురం • గఫలంసాథళీ, నాదీయబీజభి • న్నసవరాశి

తే. ఘనఘనామూలశిల్పసం♦కలితసూర్య, సోమసిద్ధాంతయుగలబ♦ర్గోధరత్న
ఘట్టిత్రైకోనరాశ్యాది♦గణితతతులు, దెలిసి యతఁ డట్టిక్రైక్కానఁ ♦ డేటపలుచు. 28

తే. సరవి గుడికట్టుగా చెంగ ♦ వరసి వ్రాసి, యంతకము లేసి కులవర్గ ♦ లాయకట్లు
దీర్చి దినవహీనపరగ♦తిప్రతీర, నారవణి నిర్ణయింప శే♦షాహి యతఁడు. 29

ఉ. చదువులుచెప్పి చూచె మఱే♦సారెసఁ గూలికి లెక్కవ్రాసి చూ
చదయతఁ గోలుకాఁ డగుచు ♦ నన్నిఁట మండువలన్నిటించి చూ
చదియును గాక రాయసపు♦టార్యుల ఘంటము లాకు దుద్దులున్
వదలక మోసి చూచె నొక♦పట్టునఁ బొట్టకు లేక దక్కినన్. 30

క. పొరుగిరుగువారికలిమికి, గుటిగాఁ దా నెంతకూడు ♦ గుడుచుచు వీటం
దిరుగాడి ప్రొద్దుగ్రుంకెడు, వర కొకపాతికకుఁ గొలుచు ♦ వడిఁ గొని తెచ్చున్. 31

తే. తెచ్చి సుఖమతి యనునామ♦ధేయమునను
పరఁగు ప్రియురాలిచేతి కే♦ర్పడఁగ నీయ
నాబిడన్నంబు సంకటి ♦ యంబలియును
చేయ సమరేయివేళ బో♦నేసి పోవు. 32

క. అతఁ డీలాగున గ్రాస, స్థితికై యూరెల్లఁ గలయఁ ♦ దిరుగాడంగా
నతనాలు మఱనికేళికి, వెతఁగొని తిరుగున్ భుజంగ♦వీథులఁ గలియన్. 34

క. ఒసపరి పగలది ముద్దుల, నసియాడెడుగాను గలది ♦ యందము గలపైఁ
డి సరైనమేనుచాయల, పస గలదని విటులు దాని♦పని కలవడుచున్. 35

తే. ఎనయ నేవేళ నెందైన ♦ నేపురేగి
పురిని గలజారు లత్యంత♦మోహు లగుచు
గ్రుక్కిళులు మ్రింగికొనుచు నొ♦క్కొక్క రొకరె
తిరుగుచుందురు దానింటి♦తెఱవుఁబట్టి. 35

ఉ. ఇందుఁడు కందునిద్దపుర♦హిం దగు సుందరిమోముగోము తా
నందమి నిందిరేందుముఖి♦నంపనుఁడుం దన డెందమందు నిం
దిందిరకందబృందకచ♦దృక్తతిచంపముఁ జెంద జాలువా
లొందమిఁ గుందు జాలిక♦యుగ్మలిఁ బొందమిఁ గంది కుందరే. 36

శా. నెత్తావుల్ వెదచల్లుపువ్వులతల ♦ న్నెమ్మేనుసింగంపురా
మొత్తంబున్ నునుగాను శ్రీలగరిమం♦బున్ వీనులం దమ్ము ద
ళ్కొత్తుం గ్రొవ్విరిగుత్తులున్ మినుకులో♦లుక్కున్ గబ్బిచన్నుబ్బులున్
నెత్తమ్మిన్ గళదేరుమోము దెగడు ♦ న్సీమాటిరంభన్ నగున్. 37

క. అసుఖమతితరుణవయ, శ్శ్రీసంగతి నలరు విటులఁ • జేరి రతులకున్
వేసారక నుసికొల్పఁగఁ, దా సుఖపడి వచ్చునట్టి•ధన్యులలోనన్. 38

చ. ఒకనికి మోముచుంబనము • లొక్కనికిన్ మొనగుబ్బపోటు వే
ఱొకనికిఁ జెంపపెట్టు మఱి•యొక్కనికిన్ బిగికౌఁగిలింపు లొం
డొకనికి గాఢసంగమము • లొక్కనికిన్ రతిబంధనైపుణుల్
కకవికచూపుమన్మథుఁడు • గట్టినధట్టి సడల్ప నియ్యకన్. 39

చ. దుసికలఁ జారుచీఁకటుల • దూఁకొనుచుండెడుకీలుగంటుపైఁ
బస పొనరించునిగ్గు గల • ఫాలతలంబునఁ జాదుబొట్టు దృ
గ్వసతికిఁ గజ్జలంబునర•కాలుననంచులుఁ జీఱుచీరఁ దా
రసమగుపుష్పకంచుకము • రంజిలఁగాఁ జరియించునీఘులన్. 40

తే. ఇటులఁ జరియించఁగా దాని•యెమ్మె లెఱిఁగి, పట్టియనుమానములచేత • బెట్టుగుంది
కని విరూపినిఁగాఁ జేసి • కాంతవీడి, చనియెద నటంచు నెమ్మది • శకుఁడుఁ దలఁచి.

క. ఒకనాఁటిరాత్రి యింటను, సకియకడం బవ్వళించి • సంభ్రమమునఁ బొం
డ్రకదేశమునకుఁ జనియెద, నొకపని కని వేగ యామ • ముండెడువేళన్. 42

తే. పయినమై లేచి పోవుచో • భార్యతోడఁ, జెప్ప నొక్కింతదూర మ•చ్చిగురుబోఁడి
సాగ నంపి బహిశ్శంక • కేగ నతఁడు, దిరిగి కికురించి వేగ మం•దిరము సొచ్చి. 43

ఉ. దూలముమీఁదియట్టుకను • దొంగవిధంబున నిశ్చలాంగుఁడై
తాలిమిఁ జిక్కబట్టి కుల•తామరసేక్షణచర్యలెల్ల నా
మూలముగాఁ గనుంగొనెడు•బుద్ధిని నాశకుఁ డుండునంతఁ బ్రా
క్శైలశిఖాగ్రభాగమున • సారసమిత్రుఁడు దోఁచె నంతటన్. 44

క. పనిపాటఁ దీర్చి సుఖమతి, పనివడ నేఁ డింటితోడుసు • బాసెఁ గదా యం
చును వెల్వడి చని వీథిని, మనసిజవేదనల జాలి • మాలి తిరుగఁగాన్. 45

సీ. గౌరిపంచాంగంబు • గౌళిపంతులపంచ, పక్షుల శకునము • లైప్రఁడికంటి
పలుకులరీతులు • ప్రశ్నభాగంబులు, గల్యులు గూయంగఁ • గలుగు మేలు
కీడును బోచిళ్ల•జా డెఱింగెడు నేర్పు, దిక్కువిదిక్కులు • దెలిసి నుడువుఁ
దుమ్ములక్షణములు • తొడరు కాకరవంబు, సాముద్రికస్థితిఁ • జతురమహిమఁ
తే. దెలియ నేర్చినయొకమహా•ధీరవరుఁడు, శకునవిద్యావిచక్షణా•ధకుఁడు సౌకు
మార్యరేఖల మారట•మారుఁడైన, యమనిదివిజుండు మతిమంతుఁ • డనెడువాఁడు.

క. ఎదురైనఁ జూచి సుఖమతి, కదియం జని వాని సొబగు • కలిమికి మోదం
బెదనొంది యతని నో నవ, మదనా యని పిలుచునంత•మాత్రనె యతఁడున్. 47

తే. దీనిఁ దగిలించుకొనవలెఁ • దియ్యవిలుతు, దురము పనిలోకి నేఁడు ముద్దుగ నటంచు
దలఁచునంతటిలో జాణ • తనములాడి, లోఁబఱచి వానిఁ దోడ్తెచ్చె • లోలనయన.
మ. అటులం దోడ్కొనివచ్చుచోఁ గులుకుటొయ్యారంబుగాఁ జూచి చొ
క్కటపుఙ్ జిబ్బెపుగబ్బిగుబ్బసెలవంక ల్లాను గాన్పించఁ బై
పట మొక్కింత సడల్చుఁ బచ్చిదొరలఙ్ • భాషించు లేనవ్వుతో
సటలుం జేష్ట లొనర్చుఁ బైపయిఁ బడుఙ్ • జాయందు హర్షింపఁగన్. 49
చ. నిలయములోని కిల్లు విటునిఙ్ జెనఁ దోడ్కొని వచ్చి హెచ్చి కం
బళము ముదంబునం బరిచి • పల్లవుఁ డందు వసించినంత న
య్యలికచ యేక్రియం గనెనొ • యట్టుకపై నిజభర్త యుండుటం
దెలిసిన భీతిలేక సుద • తీ యపు డేమని బొంకెఁ జెప్పుమా. 50
చ. అని యలవాన జాలిపులుఁ • గా వనజాక్షినిఁ జేరి వేఁడినఙ్
విని తలపోసి చూచి యిది • వింతసుమీ తెలియంగలేను నే
ర్పున నది భర్త కింపు మదిఁ • బుట్టఁగ నెట్టులబొంకెఁ జెప్పవే
యన కలహంస వంశకల • శాంబుధిచంద్రుఁడు కాంత కిట్లనున్. 51
క. విను హేమావతి సుఖమతి, తనపల్లభుఁ డటుకమీఁద • దాఁచుక యున్నాఁ
డని తెలిసి ధృతి చలింపక, యనుపమచాతుర్యధుర్య • యై విటుమ్రోలన్. 52
క. పక్కా కిడి సద్భక్తిని, మ్రొక్కి కనుంగీఁటి శకున • ములు చూడు పరుం
డెక్కార్యంబున కేగెనొ, యక్కార్యము లెస్సఁగ సఫల • మౌనో కాదో. 53
తే. లెస్సఁగాఁ జూచి చెప్పుము • లేమిచేత
జనిన నాపతి శీఘ్రింబె • సఫలుఁడై సు
రక్షితంబుగ వచ్చునో • రాఁడో యనుచుఁ
దెలప యడిగిన నాసైఁగఁ • దెలిసి యతఁడు. 54
సీ. అంగుళక్రమమున • నశ్విని భరణియుఁ, గృత్తిక రోహిణి • మృగశి రార్ద్రి
పొసఁగఁ బునర్వసు • పుష్య మాశ్లేషయు, మఖ పుబ్బ యుత్తర • మఱియు హస్త
సరవిఁ జిత్రయు స్వాతి • పరఁగ విశా ఖానూ, రాధలు జ్యేష్ఠయు • రమణ మూల
పూ ర్వోత్తరాషాఢ • లుర్విని శ్రవణ ధ, నిష్ఠలు శతభిష • ప్రోష్ఠ పదలు
తే. నుత్తరాభాద్ర రేవతు • లొనర నెంచి
మేష వృషభ మిథున కర్కి • మృగప కన్య
కాధటాళి ధనుర్లగ్న • కలశ మీన
రాశి సంఖ్యలు వరుస నేర్పడ గుణించి. 55

తే. సూర్య శశి భౌమ బుధజీవ • శుక్ర మంద, రాహు కేతుగ్రహస్థాన•రాశికూట
చారచోరోపచయకేంద్ర•సారనీచ, పరమస్వోచ్చాంశలగ్నము • ల్పదిలపఱిచి. 56
తే. జన్మకర్మసాంఖ్యాతిక•సాముదాయ, కాంగజామిత్రవైనాసి• కారివామ
పార్శ్వవేధలులత్తలు • భావమస్ప, భావనీవా స్తసుయసులః • బరిహరించి 57
సీసమాలిక. ద్వాదశాబ్దాబ్దమా•త్రగ్రహమాత్ఫన, క్షుత్రాంశరాశినా•సదిన మరసి
పద్మసింహాసన•పణకూర్మనరచాప, కుంతలఖలజీవ•కుంభవర్గ
శనిఖడ్గరథగజా•శ్వవ్యూహనాడికా, దిద్విధచ్ఛత్రద్వి•తీయపంచ
విధదశవిధరాహు•వృశ్చికలాంగూల, పంచసప్తశలాక•పక్షిడింభ
కామాఖ్యతోర్మణ•గౌళిక్షుత శ్యేన, యాత్రాత్రికాలసూ•ర్యఫణిజయక
ఘోరకాలానల•గూఢకాలానల, భూచరఖేచర•పుణ్యభూమి
చంద్రకాలానల•సంకటసూర్యకా, లానలరాహుకా•లానలకలి
వర్తులభాస్వర•వామగౌడద్వితీ, యతృతీయమాతృకా•చతురదీర్ఘ
వర్ణేశ్వరావ్వాదైవతయోగతుంబురు, ప్రస్తారసర్వతో•భద్రకలశ
లాలకోటామహా•లక్ష్మీనఖక్షితి, వలయలక్ష్మీక్షేత్ర•వాలభూమి
తే. ఘనపుళిందకొల్లాపురి• వెనకపటక, కాలరేఖమహామాలి•కానిరామ
యాఖ్య లలరారుచక్రము•లందు బీజ, పంక్తి లిఖియించి తత్ఫలా•ఫలము లరసి. 58
తే. ఈలాగుచక్రముల గ్రహ, జాలము లిఖియించి చూచి • చంద్రాస్యవరుం
డాలయమున దాఁ గుండుట, కాలజ్ఞుఁడు దెలిసి పలికెఁ • గౌతుక మెసఁగన్. 59
క. కడుపులోఁ జల్లగదలక • కలికి వినుము
నేఁడు రేపటఁ దలపువ్వు • వాడ కతఁడు
రాఁగలఁ డటంచు శపథ మేర్పడఁగఁ జెప్పి
యతఁడు దానిల్లు వెలువడి • యపుడ చనియె. 60
ఉ. ఆసమయంబునందు శకుఁ • డట్టువపై వసియించి యుండి యెం
తో సుముఖత్వ మొప్పఁ గని • తొయ్యలిభక్తికి సచ్చరిత్రలీ
లాసుగుణప్రసిద్ధికి భళా యని మెచ్చుచు డిగ్గి వచ్చి రా
వే సరసీరుహాక్షి యని • వేగమె కౌఁగిటఁ జేర్చి వేడుకన్. 61
క. ప్రమదానీపాతివ్ర, త్యము భక్తియుఁ గంటి సందియము లే దీఁక నం
చు మనోరాగంబున శకుఁ, డమితస్తుతు లొనరఁ జేయ • నది యిట్లనియెన్. 62
తే. కాంత నే నెన్నకోరాదు•గాక నిన్నుఁ
బోలఁ గలసాధ్వు లున్నారె • పుడమిలోన

ననఁచుఁ జలితోడఁ జెలరేఁగి • యాడుకొనుచు
నింపుమోదంబున సుఖాన • నుండి రపుడు. 63

చ. అని కలహంస చెప్పిన న•యారె కథాస్థితి యంచు మెచ్చికొం
చును దపనోదయప్రభలు • సుందరి గన్గొని యింటిలోనికిం
జని పవళ్లెల్లఁ బోఁగడపి • సారసమిత్రుఁడు పశ్చిమాద్రికిం
జనినయనంతరంబ మను•జప్రభుపై విరహంబు మీఱినన్. 64

సీ. కళబేరు కస్తూరి•తిలకంబు వాసన, ల్లపరగంధములపు • లంచ మొసఁగ
నవరత్నతాటంక•వివిధకాంతిచ్ఛటల్, నునుఁజెక్కుజిగికిఁ గా•నుక నొసంగ
నలువమానికపుసో•యగఁపునందల మెక్క, కలితాంగదీప్తికిఁ • గట్న మీఁడఁగఁ
జెంగావిపలి పెంపు•చీరందు సరిగడా, ల్పదశోణఘృణులకుఁ • బగిడిఁ బెట్ట

తే. మదనమదహస్తివిడి పడ్డ•మాడ్కిఁ బడఁతి, పుడమి యొడయనికడ కేఁగ•బెడఁగు నడల
నడుమునడిఁ గడుఁ గ్రొమ్ముడి • నడలి వివుల, జడి వొడమ నిల్లువెలువడి • ఘనఁగనపుడు.

క. కని రాజహంసవరుఁ డి, ట్లను భళి మేల్జాణ వౌదు•వా సాగ సమర్ధ
జననాథు నెనయఁ బోయెదొ, విని పామ్మెకకథ యటన్న • వెలఁదిట్లనియెన్. 66

మ. కలహంసాధిప నీస్వబుద్ధి నిటులం • గల్పించెదో కాక పె
ద్దలచేఁ బూర్వము విన్నవాఁడవో మహా•దైవప్రసాదంబొ విం
తలుసు మ్మట్లు వచింప నన్యులకు మే•ధాశక్తినిన్ బోలువా
రలు లేరింక భళారె చెప్పు మను మ•ర్మ • రాజాస్య ప్రార్థించినన్. 67

పదునాలుగవకథ.

క. ఆమానసౌక మభినవ, తామరసమరందబిందు•తరబృందంబుల్
నేమించుగురియు వాక్కుల, హేమావతి కనియె మోద • మిగు రొత్తంగన్. 68

చ. వినుము విదర్భదేశమున • విశ్రుతమై సిరులందు విప్రులం
బన నొకపట్టణం బమరు • నచ్చట నొండొకవైశ్యుఁ డెంతయుం
దనకు హిరణ్యగుప్తుఁ డను•నామముతోడఁ దదీయభార్య హ
స్తిని యనుపేరునం బరఁగు • జెప్ప నశక్యము దానివైఖరుల్. 69

క. మిలమిలమిలఁ దళుకులబలు, పొలయలరుల వలపుగులుకు•పొలతుఁక నవ్వుల్
మొలకరికల్చల దలకలు, చెలి సొలపులపలుకు లలరు • చిలుకలకొలికిన్. 70

క. విరులా నగవులు నీలపు, సరులా కురులుఃబ్బుగబ్బి•చన్నులు జాళ్వా
గిరులా యూరులు నంట్ఖుల, సిరులా యని జనులు మెచ్చఁ • జెలువ చెలంగున్. 71

క. చిందం బనఁనగు గళమును, సుందమ్ములతీసరవవఁగోరకపంక్తుల్
మందమ్ములు గమనమ్ములు, నందమ్ములు పొగడఁ దరమె యతిపపదమ్ముల్. 72

ఆ. కలువచెలువు చెలువుఁ గైకొనుకన్నులు, జగ మెఱుంగఁ గరఁగు జిగి మెఱుంగుఁ
గులుకు దొలుకు మొలకగుబ్బల పసగల, వనిత మేలు కొక్కవనిత మేలు. 73

సీ. బలితంపు పులినంపు వెలఁబెంపు జఘనంబుఁ, బోఁడి మెన్నఁగ నొక్కనాఁడుపట్టు
వికితమ్ములను గ్రమ్ము సిరిఁజిమ్ము వదనమ్ము, చెలువ మెంచుట కొక్కనెలయుఁబట్టు
నిరులెప్పుడును గుప్పు నెఱికప్పు గలకొప్పు, పరిణుతింపఁగా మహాబ్దంబు పట్టు
జితజంభ కరిశుంభ తతడింభ కుచకుంభ, యుగ మెన్నుటకు నొక్కయుగము పట్టుఁ
తే. జొక్కటపుఁ బిక్కగమినిక్క, మెక్కుజక్క, నఖముల నుతింపఁగల్పకాంతంబు పట్టుఁ
గెంజిగురు సంజకెంజాయఁ బుంజిఁ దెగడు, పదము లెన్నంగ బ్రహ్మకల్పంబు పట్టు.

క. ఘనజఘన స్తనయుగములు, వెనుకను దన్నుఁ మోల నుద్దవిడి నొత్తంగాఁ
జన లేక యామమరఁగుల, బనుపడ దాఁగె నఁగౌను భామకుఁ దనరున్. 75

సీ. విష్ణుపాదంబంటె వేమఱు మేఘంబు, చంద్రుండు ముట్టె నీశ్వరుశిరంబు
తీర్థంబులోఁ గొని ధృతి నిల్చె శంఖంబు, కోరి ప్రసాదంబు గొనె ఘటములు
దండఁవండిన సాధుతరులదాఁటెనులత, లతను ధర్మములతో డనిరెవిరులు
పుణ్యనదీనదంబుల నిల్చెఁ బులినమ్ము, లలపితామహునాజ్ఞనలరె నంచ
తే. కుంతలానన కంధరకుచసుబాహు, నఖకటీయానపటుశోభనత వహించి
దీటురావే మటంచును దృఢమనీషఁ, జెలియ యంగమ్ములకుఁ బొాస చేసినటుల.

ఆ. మొగము నిండియుండు మోహంపుఁగన్గవ, యురము నిండియుండు నుబ్బుచనులు
వీఁపు నిండియుండు వేనలిజొంపంబు, దానిఁ బొగడఁ దరమె మానవులకు. 77

క. ఆహా స్త్రీని యావనము, త్సాహమునన్ బిడ్డపాప సందడి లేనిన్
మోహనతరవిటపుభత, వ్యూహములకు వల్లెత్రాఁటిరొయెఅపున మెఱయున్. 78

చ. మిడిమిడి గాసిచేకటులు మేలిమిసూనలచండ జోడుబోల్
కడెములు సందిబొందె విడి కమ్మలమించులమించుమించులన్
నిడి బుగడల్ జరాసరిహారణీల దనర్చినకట్ల దండచే
గడ కుతికంట్లు నూసకము ఘల్లను మెట్టెలు పూని వీఁగుచున్. 79

క. అది గరగర నగుపురుషుం, డెదుటం ఒడ పీఁకు జీవితేశ్వరుఁ డయినన్
మది గలుఘుఖం బెల్లను, దునుముట్టు నటంచు మోహదుర్దశ నొందున్. 80

వ. అది యెఱిఁగియును. 81

చ. మదమునఁ బల్లెబట్టలకు • మూఁటకు ముల్లె కటంచు నాథుఁ డిం
పొదవఁగ నేగ జార జన•యూధహితప్రదభాగధేయమై
కదిసి చరించుచిన్నెలను • గాసిలఁ జేయుచు మోహకాంక్షతో
మదనుఁడు సానచిమ్ములు సు•మాళములోఁ దుతఁ జిమ్ముచుండఁగన్. 82

వ. ఇట్లు సంచరించు నయ్యవసరంబున. 83

సీ. హేరాది యొడ్డాది • భారాదులనువచ్చు, గోనెలు తణగాలు • గోతములును
నూలాసునగలు కం•ట్లాలు కంబడికట్లు, మూఁటలు చిక్కాలు • బాటసందు
పలలావణము పట్టి • వారతుక్కాలును, సుంకము బీటికా•సులునుమగలు
కావలి దేవళ్ల•కాసులు కుప్పబ, త్తెము విశేషము దోవ•తీర్వ మర్థ
తే. మాన్యములు తరుగు విడుపును•మడుపుమణియు, గానికోల్కానిబంట్రోతు•కరణములకు
నారిసెట్టి బసివిగణా•చారు లచట, వాదిలెక్కలు రాఁబట్టు•వాఁ డొకండు. 84

ఉ. సుంకరకొల్వుకాఁడు సర•సుం డనుపేరిఁటివాఁడు చూడ నే
ణాంకవసంతకంతులజ•యంతుని నెంతయుఁ బోలువాఁడు ని
శ్శంక నలంకరించుకహు•శాయనవీథికి వచ్చి యప్పు డా
పంకజలోచనం గని సె•బా సని మెచ్చినయంతలోపలన్. 85

చ. పొగడలు చారుచెంగలువ•బొంవల మేలకిపువ్వు ధట్టి సం
పఁగి విరితేఁటిమేల్గనిన • పాగశిరీషపుగోష్ఠిఫేషుమేల్
జిగితొగడాలు జాజిబరి•సిం గొని చిల్కలవాజి నెక్కి పెం
దెగువను గంతుపాదుషహా•దే యని యార్చెప బొమ్ము గ్రుమ్మినన్. 86

సీ. వ్రీడావహిత్థప్ర•వేగోన్మదోగ్రరో, షప్రబోధవితర్క•చపలదైన్య
పరుషసత్రాసక•చరమలీలాపని, ర్వేదనాసూయవి•షాదగర్వ
మోహాంచితాస్మృతి•మోహనమాధుర్య, జడగుప్తిఘృత్యప•స్మారహైన్య
హర్షవిజ్ఞానశం•కాలస్యసుఖనామ, ధేయముల్ గల్గి వ•ర్తిల్లునట్టి
తే. ముప్పదియు మూఁడు సంచార•ములను బ్రమ్గి, స్వేదవైవర్ణ్యరోమాంచ•విస్రుతాస్య
కంపముల్ ప్రళయస్తంభ•కము లనఁ బను, సాత్త్వికప్రభావములచేత • జడిసి తెలిసి.
సీ. సాక్షాత్కరించిన • చంచలాలతికయో, మాటాడ నేర్చిన • మణిశలాకొ
జీవంబువచ్చిన • చిత్తరుబొమ్మయో, కడుమూపుదాల్చు శృం•గారరసమొ
చేష్టలు వెలయించు • చిన్నరుపూరెమ్మయో, చెఱలాడు జాబిల్లి•చిన్నికళయొ
కలితరేఖ నటించు • కమ్మవెత్తావియో, మోహింపఁ జేయు స•మ్మోహనంబొ

తే. కాకయుండిన నీతన్క • కాంతిముఖువు, సొగ సలంకృతికళయును • సురభిశుభద
విభ్రమంబులు గలవే త్రి•విష్టపముల, నిండి యున్నట్టి చెక్క•ని • నెల•తలందు. 88

క. కరములు సుమలతికాశ్రీ, కరములు చిఱునవ్వు లబ్జ•కరములు పద్మా
కరములు నాభీసుచు లా, కరములు సొగసులకుఁ జెలికిఁ • గలయవయవముల్. 89

క. నారికెన సఖులు లేరే, లేరే దొరదెగడు నిటల•లీల లయారే
యా రేవునమరునారే, నా రేఖకు దనఘనాళి• నాగను నెరయన్. 90

క. బాలాదృక్తతివాలా, వాలాబుంగన్నులతుల•వనజశ్రీలా
శ్రీలాచెవులు సులీలా, లీలావతికంఠరవము • లెరభా బాలా. 91

సీ. శశిరేఖశశిరేఖ • సత్కళా సౌందర్య, ములు మాయఁ జేయు ని•చ్చెలువతీరు
పద్మినీపద్మినీ•పరిమళజాతుల, నలరింపుచుండు ని•క్కలికిసొగసు
రేవతీరేవతీ•రేఖావిలాసముల్, తలకింపఁ జేయు నీ• త్తరుణిచుఱువు
వరహేమసరహేమ•సురుచిరలీలలు, గఱఁగంగఁ జేయు నీ•కాంతహాసవు

తే. తారతారసుదారను•దారసించు, భద్రభద్రను భద్రను • బరిహసించు
నౌర యిట్లుండ వలదె శృం•గార మనుచు, మెచ్చి పల్మాఱు బలుమోహ• మెచ్చికెరలి.

క. మిణు కైనయాకృశాంగీ, మణి నిప్పుడు మోహినీసు•మతమంత్రాక
ర్షణకళ నాకర్షించుక, కణకం బలుగతుల రతులఁ • గవిసెద ననుచున్. 93

క. మది నూహ చేసికొని తన, సదనంబున కపుడె వచ్చి • చలమునఁ దన్నుకా
మదనుం డేచఁగఁ దమిచే, నొదవిన యొకయమ్మృతసిద్ధ•యోగమునందున్. 94

సీ. వైష్ణవి కౌమారి • వారాహి చాముండ, బ్రాహ్మీమాహేశ్వరి • బగళ లలిత
కాత్యాయనీంద్రాణి • కాళరాత్రి భువనే, శ్వరి మహామాయి పం•చదశ దుర్గి
భగవతి మాతంగి • బాల మహాకాళి, కామేశ్వరియు భద్ర•కాళి శక్తి
మలహరి కృష్ణాక్షి • మాధవీ శాంభవీ, శాకంభరియు లఘు • శ్యామలాంగి

తే. మోహినీ కామరాజాఖ్య • ముఖ్యదేవి, రాజరాజేశ్వరియు మంత్ర•రాజరాజ
ముఖి వరూపిణి భైరవి • ముఖ్యమాల, మంత్రములలోన మోహినీ • మంత్ర మరసి.

సీ. కడుభక్తి శుక్లప•క్షమునఁ బుష్యార్కమి, నాఁడు హస్తిని వీథి • నడుచువేళఁ
గుడియడు గిడుమన్ను • గొని తెచ్చి శయనమం, దిరము గోమయమున•నెఱయనలికి
మధ్యమంబున నెట్టి•పంటిపట్టిడి పస, పునర్ము గ్గొసఁగి మధ్య•మునను మన్ను
నెఱపి యామైని న• స్నెలతరూపము వ్రాసి, చుట్టుదుమంత్రము గురు•స్తుతి యొనర్చి

తే. మొదల నోం శ్రీం వినిర్మించి• మోహమోహి, నీపటుస్వాహ యని మంత్ర•నియతిఁదీర్చి
యందు దిగ్బంధన మొనర్చి • యరుణగంధ, పుష్పదీపాదులను లెస్స • పూజఁ జేసి,

ఆ. లక్షజపముచేసి • లక్షణయుతముగఁ, దద్దశాంశను మధు•తర్పణంబు
తద్దశాంశ మగుచుఁ • దగు పలాశలతాంత, హోమవిధియు దీర్పు • చున్నయపుడు.

సీ. మినుకొప్పు నునుకొప్పు • మినమిన ల్దూలాడఁ, గన్నుల ధళధళ • మిన్నులాడ
బునుఁగిడ్డ నెఱపూత • భుగభుగ ల్చెరలాడ, గుబ్బలచకచక • ల్డొబ్బులాడ
జిగిపూని తగుమేని • ధగధగ ల్దిరుగాడ, నగుమోము నిగనిగల్ • నాట్యమాడ
గుమిగూడు విరిదండ • ఘుమఘుమ ల్పొరలాడ, నందెలఝుళఝుళ • ల్చిందులాడ

తే. నెదుట సాక్షాత్కరించు మో•హినికి నతఁడు
గరిమతో లేచి మ్రొక్కినఁ • గరుణఁ జూచి
తనకుఁ బూర్ణాహుతి యొనర్చి • తప్పకుండ
దంత్రము ముగించుమా నీవు • దలఁచినట్టు. 98

క. పర మొసఁగెద నన నటువలె, జరిపి మనోజాతపంచ•శర యని యంత్రా
వరణము దుడిచి మదీప్సిత, మురయంబునఁ దీర్పు మనిన • మోహిని యంతన్. 99

తే. మంచి దని యచ్చెలిని నావ•హించి శక్తి, తెచ్చి ముందట నిల్పి య•దృశ్య యైన
సంభ్రమంబున సరసుండు • సరసరతులఁ,బరవశత్వంబు నొందించి • భ్రమను గొల్చె.

చ. కనుఁగవ విచ్చి చూచి యల • కామిని యెక్కడి దీనికాంత మీ
ఘనుఁ డితఁ డెవ్వఁ డిట్టిరతి•గల్గుట యేమని విస్మయంబుచే
మనమున నెన్నియే మయిన • మంచిదె నామదిఁ గోర్కెఁ దీర్చెఁ బ్ర
బ్బనమకరాంకు నింకఁ దన•భృత్యునిగాఁ బని పూని యేలెదన్. 101

వ. అదియునుంగాక. 102

తే. భద్రుఁ డన దత్తకుఁ డనంగఁ • బరగు కూచి, మార పాంచాల విటపీఠ • మర్దనాగ
రికవిదూషకు లనఁ బ్రౌఢ•రీతి మెలఁగు, నాయకులవంటిరసికుఁ డీ•నాయకుఁ డని.

చ. మనమున మెచ్చి నాయకుఁడ • మా నెఱజాణవు ప్రౌఢవేక్రియన్
గొని రతి నేలినాఁడ వను•కూలము నా కిది నిచ్చనిచ్చలున్
ననవిలుకానికేళికల•నన్ వెలయించు మటంచుఁ బల్కినన్
విని సరసుండు మంచి దని • వేడుక నాతినిఁ బంపె నింటికిన్. 104

క. అది మొదలుచేసి హస్తిని, మది రంజిల సరసుమీఁది•మమతను నిచ్చ
ల్మదనునికేళికిఁ బిల్చును, దుదఁ దనగృహమునకు సందు • దొరికినయెడలన్. 105

వ. ఇట్లు విహరింపుచుండి యొక్కనాఁడు. 106

క. మధ్యాహ్నవేళ జనతా, రాధ్యుం డగుసరసుఁ డలరి • రతిపతికేళీ
సాధ్యతబుద్ధిమతాంకిమ, సాధ్యం బని యావధూటి • సదన మె చేరెన్. 107

తే. చేరినప్పటేనరసుని•తీరుఁ జూచి, భుజము లుప్పొంగి హ_స్తినీ•పుష్పగంధి
కలయఁబడి మత్రిపన్నిటఁ • గాళ్లు గడిగి, మేల మాడుచుఁ దోడ్తెచ్చె•మెచ్చు హెచ్చి.
సీ. జీవదంతపుజగా•జీనిసఖాసు మే, _ల్తళుకుటద్దపుబిళ్ల • బెళుకురవలు
వింతసంతనఁ జేసి • విప్పుగా దాపిన, హురుమంజుపూసల • మెఱుఁగుకుచ్చు
లునిచి తీర్చినసొంపు • మిను కైనకెంపురా, మొనముక్కులూడెడు • ముద్దుగులుకు
కళుకుగ్రొంబని పచ్చ•చిలుకలు రహిమించు, తొగరాచలువరాల • నెగడు లోవ
తే. గలవగలనిండుపచ్చని•జిలుగుప్రతిమ, కతల నిరవొందు చిత్తరువ్వ • కప్పురంపు
మెప్పు మేల్కట్లు చవికెలో•మెరయు హంస, తూలికాతల్పమునఁ జేర్చి•తోయజాక్షి.
క. తొడరి నునుగబ్బిగుబ్బల, పొడ వడఁగఁగఁ గౌఁగిలించి • పొడమినదార్ఢ్యం
బెడలంగనీక మన్మథు, బెడిదపుదురమం దతనికిఁ • బ్రియ మొందించెన్. 110
తే. ఇత్తెఱంగున వారిద్ద • ఱేపురేఁగి
మిథునకార్యప్రవిష్టులై • మెలఁగుచుండ
దాసిపతియింటి కరుదెంచి • తలుపుదెరువు
మనిన నది యెట్లు బొంకంగఁ • జనునొ చెపుమ. 111
తే. తెలిసెనా నీకు హేమావ•తీలతాంగి
తెలియకుండినఁ జెప్పెదఁ • దెలిసికొనుము
విభుఁ డటులఁ దన్నుఁ బిలిచిన•విటుఁడు వడఁక
వెఱువకు మటంచు ధైర్యంబు • గరపి యపుడు. 112
చ. ముసుఁగిడి పండుకొమ్మనుచు • మోహముతోడ వితర్దిఁ జూపి తా
నుసు రసు రంచు ఖిన్నయయి • యొయ్యన నేగి కవాట మవ్వలన్
బెసబెసఁ ద్రోచి మూఁట దలఁ • బెట్టుకవచ్చినభర్త కింతసా
ధ్వస మొదవంగఁ జెప్ప విని • వాఁడు వితావిత యేమి యంచనెన్. 113
వ. అని హీనస్వరంబున. 114
క. అడిగినపతితో ని ట్లను, దడవాయెను సుంకరీడు • తమ లెక్కలకై
పడియున్నాఁ డిదె కనుమని, పడఁతి యతనిఁ జూపఁ జూచి • భయ ముప్పొంగన్.
క. వెను కడుగు లిడుచు నవ్వలఁ, దనపొరుగింటను విభుండు • దాఁగినచో జా
రుని రతితృప్తాస్థ వే, తనిపి వెడల ననిపి తరుణి•ధవునిం బిల్చెన్. 116
తే. పిలువ నతఁ డెప్పటట్లన • ఖేదపడకఁ, గూర్మితో నుండెఁ బతిదాను • గుందరదన
వింటివా యిట్టిచాతుర్య•విశదశక్తి, నీకుఁ గలిగినఁ బోవమ్మ • నృపతి నెనయ. 117

చ. అని కలహంస సెప్పఁగ మ•హాదరణంబున నాలకించునం
తనె తపనోదయప్రభలు • తద్దయుఁ గాన్పడఁ గేళికానికే
తనమున కేగి యచ్చట సు•ధాకరబింబనిభాస్యప్రొద్దుగ్రుం
కినఁ దన కాపియోగమునఁ • గేవలమున్ వైలఁ జెంది యుండుటన్. 118
క. కుముదమ్ములు కుముదమ్ములు, సముదమ్ములు గాఁగఁ మెరయు • సాయం బైనన్
రమణీమణి ఘనరుచిభా, రమణీఘృణి సిరులు నిరులు • రంజిలువేళన్. 119
సీ. తారకావృతపయో•దముమాడ్కి సుమధామ, పరివృతం బగుకొప్పు • పరిఢవిల్లఁ
దీఁగను ననలు హా•త్తినచందమున మేన, సొగసుగా రతనంపు•సొమ్ము లలర
వదనచంద్రునిఁ గూడ • వచ్చినరోహిణి, మఱువునముత్తెఁపు•ముక్కు రమర
మంచు గప్పినగట్ల • సంచున వలిపెంపుఁ, బైఁటలో గబ్బిగు•బ్బలు చెలంగఁ
తే. బరఁగు జగడాల పగడాల • ధరణిలోనఁ, గ్రాలు మగరాల నిగరాల • లీల విడెపు
టరుణరుచిఁ జిల్కు నోరఁ బ•ల్వరుస మెరయ, వచ్చినిల్చినయాహేమ•వతినిఁ గాంచి.
క. జలజభవాశ్వం బిట్లనుఁ, జెలియా యింకొక్కగాధ • చిత్రతరంబై
చెలు వొందెడిఁ జెప్పెద వినఁ, గలవే యని యడుగ వినెదఁ • గాకని నిల్చెన్. 121
వ. హంసం బిట్లనియె. 122

## పదునేనవకథ.

మ. ఇతరధ్యానము మాని నీవు వినుమా • హేమావతీ ద్రావిడ
క్షితిలోఁ జిత్రవిచిత్రవస్తువితతిన్ • జెన్నారు కాంచీపురిన్
స్థితుఁడై కాఁపుర ముండుశూద్రుఁ డొకఁ డా•శ్రీదృష్టికిం బాత్రమై
శ్రితనానాజనభాగధేయ మగుచున్ • నీరాంకనామంబునన్. 123
సీ. ముంగిటఁ బులిజూద•ములు గీచి యుండిన, రచ్చబండలు గొప్ప•ప్రహరిగోడ
పంచదిన్నెలు చాదు•పట్టెలు ముమ్మూల, గూండ్లు దీర్చినయట్టి•గోడ లలరు
దేవరచవికెపం•దిరికొళ్లగూడులు, గొఱ్ఱుగుంటుకకాడి•క్రొత్తపల్పు
లట్టువగలగాడి•కొట్టంబు పలుగడి, కంపపాతినవేగ•కదుపుదొడ్డి
తే. ప్రత్తిగూటంబు తొట్టియు • బలకపీట, బావిషిడకలకుచ్చెల • పసులమేపు
మంగలముదాలిఱోలుల్కి•మాసిసంచు, గలిగి విలసిల్లు నాతని•నిలయ మెపుడు. 124
వ. ఇదియునుంగాక మఱియును. 125
తే. ముద్దగిద్దజపులమార్పు•ముసుకుపచ్చ, మార్పుజింకపురిపరంగి•మల్లెమార్పు
పాల్పనరకొమ్మునూగూరి•పైరజిల్లి, మసరవల్లెజొన్న ల•మ్మంగగలవు. 126

సీ. జడకొట్ట కొఱ్ఱలు ♦ చామలు వెలిచామ, కుట్టారి కారికె ♦ కొండబరిగె
బరిగె సజ్జయు గిడ♦గిరసజ్జ మజ్జపా, ల్గిడ్డచే న్పెద్దరా♦ గెయును యవయు
గోధుమ పెదనువ్వు ♦ కులునువ్వు తెలినువ్వు, కుసుమవె ల్లగిసెయు ♦ గోగు జనుము
చిటితోట వెలిపెద్ద♦ చెపరంగి పేరామి, దము చక్కెర చిగామ♦ దమును మజీయు
తే. మినుము వెర తెల్లకంది చి♦ర్సెనగ సెనగ, పిచ్చ నలపిచ్చ కులుకిల్ల ♦ పెసరగాయ
మల్లు వలసందు లుబ్బడాల్ ♦ నల్ల తెల్ల, యులవలు పటాణములు పుట్ల♦కొలది గలవు.
సీసమాలిక. బంగారుతీగెలు ♦ గంగాజలమ్ములు, కస్తూరినిగరాలు ♦ కటకసరులు
నిప్పపూరాజనా ♦ లేనుంగుకొమ్ములు, మల్లెశ్రీగంధులు ♦ మదనగంధు
లేలికరాజనా ♦ లీశ్వరప్రియములు, రావిపూరాజనాల్ ♦ రత్నసరులు
కుసుమపూరాజనా ♦ ల్గుత్తిబల్గుత్తులు, కస్తూరిపట్టెలు ♦ గంధసరులు
మందిగండ్రలు నాగ♦మల్లెలు తీగెమ, ల్లెలు కృష్ణనీలాలు ♦ వెలువడాలు
మన్మథబాణాలు ♦ మదవంపుమొలకలు, సన్నమణింగెలు ♦ జున్నుగ్రబాలు
పొన్నశ్రీరాజనా ♦ ల్పునుగురాజనములు, ముద్దుప్రాలారళ్లు ♦ ముత్తుసరులు
సన్నసూదులు పచ్చ♦గన్నేర్లు గోదండ, రామను ల్కేసర్లు ♦ రాయసర్లు
చంద్రవంకలు జీని♦సరులు కాంభోజులు, వంగాకు బొడమలు ♦ పొంగుప్రబాలు
జిలకర రాజనా ♦ ల్చింతపువ్వులు గోరు, రాజన ల్బాదపోరిల్ ♦ రాజనాలు
రామబాణాలు రె♦క్కాకులు వెన్నము, ద్దులు జిల్మ బుడమలు ♦ దాళువాలు
గొబ్బికాయలు బలు♦గుత్తులు పాలమీ, గడలు శ్రీరంగాలు ♦ కామదార్లు
తెక్కపాలలు కాకి♦తెక్కలు పుష్పమం, జరులు సీతాభోగ♦సరులు గౌరి
కుంకుమల్ రణబెండ్లి♦కొడుకులు పిచ్చుక, గోళ్లు ప్రయాగలు ♦ గొజ్జుగ్రబాలు
గరుడసరు ల్పోతు♦గంటరాజనములు, మోదుగతోడిమలు ♦ ముదుకసరులు
పచ్చసరుల్ రెడ్డి♦పాలవంకెలు సుఖ, భోగులు పచ్చక♦ర్పూరసరులు
నివ్వరు ల్దెబ్బస ♦ ల్నీరుకావులు గాజు, కప్పెర ల్కురువడా ♦ ల్కంఠసరులు
సాలంక లలుగురా♦జనములు సంభావు, లవసరదార్లుమో♦హనపుసరులు
మణిసరు ల్మసరులు ♦ మంకెన ల్పగడంపు, తీగెలు మడిప్రాలు ♦ దేవసరులు
లత్తుకబొత్తులు ♦ లక్ష్మీమనోహరా, ల్భారతీసేసలు ♦ బాహుపురులు
వజ్రపుదళుకులు ♦ వాసనరాజనా, ల్జవ్వాజివంకెలు ♦ గవ్వసరులు
సంపంగిపూవడ్లు ♦ జాజిరాజనములు, గంబూరరాజనా ♦ ల్కన్నెసరులు
తుమ్మిపూరాజనా ♦ లమ్ముదుకొణిగెలు, జీనువముక్కలు ♦ చిలుకముక్కు
లేదుకట్టులు వంకె ♦ లిసుకరాజనములు, పులిగోళ్లవంకెలు ♦ బొగడసరులు

తే. జిలితో గలరా జనమ్ములు • నలవపులును, దెల్లనల్లచెన్నంగులు • దీవసులు
నాది యగుపేరు గలుగువ•డ్లలతనియింట, నంజు శలకోటిపుట్టు లొ•క్కొక్కడినుసు.
తే. దొండకాయ ములుకకాయ • తొట్లకాయ, జంబికాయయు నెట్టిల•సందకాయ
వెలయు నుస్తెకాయయు రాము•ములుకకాయ, మేడికాయ కాచరకాయ•గూడ నింక.
సీ. రామగుమ్మడియో బ•రాజుగుమ్మడి చార, గుమ్మడి బూడిదె•గుమ్మడులును
గిండిసొఅయు దీఁగె • కిన్నరసొఅయును, బీఅ సముద్రపు•బీఅ నేతి
బీఅ పిచ్చుకపొట్ల • పెద్దపొ ట్లేనుఁగు, దంతపుపొళ్లు • తంబలు పెలి
కాకర పొట్టికా•కరలు మేఁకచెవి చి, క్కుడుపొలగణపుల•గోరుచిక్కు
తే. డులు సుగంధాలు బొంతనం•టులు సురళులు,గంజి పందిటికపురపొం•కాయతపులు
బూజుపచ్చ కురాసాని•పుచ్చ పెద్ద, దోస నక్కదోసలు వాని•తోఁటఁ గలవు. 130
ఆ. చేమ కంద గెనుసు • చిఱిగోసు పెండ్లము, పొనఁగు తెల్ల గెనుసు • భూంత గెనుసు
లల్లి మల్లి పసపు • ముల్లంగి వెల్లుల్లి, గాజరయును మొదలు•గాఁగఁ గలవు. 131
చ. గుఱుగెఅ బొద్దిచెంచలియు • గుచ్చలి చిత్తి తగిర్సి తుమ్మి దు
స్సరి బలుగూటిబొద్ది నెలి • చల్మిలి పల్లెరు రూకపొత్కె వె
ల్వరిగిసె ముష్గ వెల్గ చెవి • పొవిలి దొగ్గలి పొన్నగంటి దే
దరి నరవంజిచేల రసఁ•బాపయు గొండలికొండ పిండియున్. 132
తే. పొలవా మింటతక్కలి • బచ్చలి కొయి, గూర చక్రవర్తము చిల్క•కూర గోళి
కూర దుంప బచ్చలితోఁట•కూర కొతిమ,రాచ సోపు మెంతాకు చు•క్కాకు గలదు.
సీ. పనస సీతాఫలా•ల్చిన నిమ్మ గజనిమ్మ, దూదినిమ్మయు నార•మాదిఫలము
నారదఖర్జూర • నారికేళాదులు, రామఫలంబులు • జామఫలము
లలరారు బొంతకి•త్తళియుఁ బోకయుఁ బోక, పిప్పలి నేరేడు • పెద్దవెలగ
రామానళియు గమ•రకజీడిమామిడి, బాదంగి పెనురేఁగు•పాల ఫలము
తే. చెట్లు పండెడితోడలు • చిట్టుగొట్టు, చెఱకు రసదాళిచెఱ కెట్టి•చెఱకు నల్ల
చెఱుకుతోఁటలు కలుజొన్లు • సీర్పి దినుసు, కారపొ కావుతోఁటలు • గల వతనికి.
సీ. మామిడికాయయు • మారేడుగాయయుఁ, గొండముక్కిడికాయ • కొమ్మికాయ
గరగుకాయయు మొల్ల•కాయ యందుగుకాయ, లుసిరికెకాయలు • నుస్తెకాయ
లేకరక్కాయయు • వాకల్మికాలుయుఁ, జిటినెల్లికాయయుఁ • జిల్లకాయ
కలబంద గజనిమ్మ•కాయ నార్దపుకాయ, చిననిమ్మకాయయుఁ • జీడికాయ
తే. కొందనపుకొమ్ము మామెన•కొమ్ము బుడమ, కాయ యల్లము మిరియంపు•కాయ బీర
కాయ కంబాలు కరివేప•కాయ లాది, యైన యూరుఁగాయలు గల • పతనియింట.

తే. పంట మోటాటి పెడగంటి • పాకనాటి
యరవెలమ లాదికొండారె • మెఱుఁగుఁగోన
కొణిదె కాఁపులు మొదలైన • క్షోణిఁ బనుల
కాఁపులను నెల్లమిన్న య • క్కాఁపుకొడుకు. 136

తే. అతనికొక్క కులాంగన • యగ్రమహిషి, చనినపిమ్మట సత్యకే • శిని యనేటి
పేరు గల్గినచిన్నాలు • బిసరుహాస్త్రిఁ, డేలు ప్రియురాలు నాఁగ సొం • పెక్కి క్రాలు.

సీ. మెఱుఁగంచుకమ్మలు • మెణ్ణాయి నెరలను, క్కర యుడ్డబుగడలు • కట్లసరులు
దండితీరైన చిం • తాకుతీఁగెయు నాను, పల్లేరుబూఁవులు • బన్నసరము
కుప్పెసౌరము మెచ్చ • కొన్నసూసలదండ, యొంపగించినజోడు • సందిబొందె
నిగర మైనసిరాజి • పగడాలచేకట్లు, కాంతికడెంబు లుం • గరపుజోళ్లు
తే. గిలుగుమట్టెలు గెంటీల • గుఱుకు అవికె, సన్నమూ వేయుఁగన్నుల • చలువచీర
పసిమిఁ జిల్కెడుముంజేతి • పచ్చలమర, దుడ్డెతనమునఁ దిరుగాడు • రెడ్డిసాని. 138

క. ఆచొక్కపుజిగి చన్గవ, లాచిక్కని మెఱుఁగుటూరు • లామోమంపం
బాచక్కనిరూపము పస, చూచిన మరుఁడైన భ్రాంతి • సోలయకయున్నే. 139

సీ. మేఘేందుకార్ముక • మీనదర్పణస్రజ, కచముఖభ్రూ నేత్ర • గండ నాస
దరసుధాబింబకుం • దశ్రీమణీకీర, గళవాగధరదంత • కర్ణ జిహ్వా
పద్మలతాధర • భంగభోగమృగేంద్ర, కరభుజాకుచవళి • కక్షమధ్య
బిలతుండచక్రకా • హాళిశాతారపల్లవ, నాభ్యూరుకటిజంఘ • నఖరపాద
తే. ప్రసవవిద్రుమచలపళి • పత్రకనక, కదళికాపర్ణ కౌముదీ • గంధసార
మారవాంగుళ్యనంగస • ద్మరుచిర మగు, హాసవాసన యగుచు న • య్యబల మెఱయు.

క. మినమినలీనెడు నునుమే, నున నొనరిన ఘనజనయన • నూతననలినా
నలమున ననువుగఁ గనుఁగొనఁ, దనరిన కనదనఘనఖని • దానసునాభిన్. 141

సీ. పలుకులు కప్రంపుఁ • బలుకుల వర్షించుఁ, జూపు మారునితూపు • పూఁపుమాపుఁ
గరములు బిసభీతి • కరములై సిరులొందు, జడజగ్గు వియలను • జడత సేయు
మందయానము హంస • మందము నిరసించు, మించుమై సిగ్గు క్రొ • మ్మించు నొంచుఁ
గుచములపసలాలి • కుచములనిర్జించు, జెక్కుల్లు ముకురాలఁ • జెక్కువైచుఁ
తే. దావి కెమ్మోవి యమృతంపు • బావి కీవి, యూరు చెన్నారు చీమల • బారు దూరు
నూరు లలరారు నరఁటుల • సౌరు గేరుఁ, గాంత యగుఁ గాంత లతికాంత • కంతకేళి

క. కమలంబుల కమలంబుల, గమలాననలోచనముల • కాంతి జయించుం
భ్రమదాళుల భ్రమదాళుల, రమణీమణివాలుఁజూపు • రహి నిరసించున్, 143

తే. దానిబిగిగబ్బిసిబ్బెంపుఁ • దళుకుటుబ్బు, గుబ్బచన్నుల కౌఁగిలి • గోరనట్టి
మానవాగ్రణి వసుమతీ•స్థానములను, వెదకి చూచిన లేఁడు పో • విద్రుమోష్ఠి. 144

తే. అది మనోజ్ఞము లైనయా•హారములను, గండమెం డైనమదముచే • గన్నుగాన
కమితపల్లవరతికేళి • కాస వొడమి, మీఱుచిత్తము తోడ నే•కారఁ దొడఁగె. 145

సీ. పనివంటవాప్పల•బాధ లించుక లేక, తీరిన మంచిసం•సార మొదవె
యుత్తమామలపోరు • నాపదూ రెఱుఁగక, పొం దొంద నిచ్చకాఁ•పురము దనరె
కుడువఁ గట్టను బూయఁ • దొడుగ వస్తువులు య, థేచ్ఛముగా నుండు •నెల్లి దొరకెఁ
బట్టిపల్లార్చ కే•పట్టున దయఁ జిల్కు, మనసు గల్గినయట్టి•మగఁడు గలిగె
తే. నింతగల్గిన నేమి నా•హృదయ మెఱిఁగి, మమత దీరను బదివేల•మంది మగలఁ
గలుగజేయక చెడుబో•కారిబ్రహ్మ, యొకనిగాఁ జేసె ననుచు నూ•రక కపించు. 146

క. ఆపాప మేమి సెప్పదు, గాఁపుది మద మెత్తి కన్ను • గానక పురిలోఁ
జూపసల నెవరి నైనను, నేపున సంభోగకేళి • నెరయంజూచున్. 147

చ. అటువలెఁ జూచువేళ నొకఁ • డంగద నామకుఁ డాయుధోపజీ
వటుకుఁ బ్రయోజనార్థము ర•యంబున వచ్చిన వానిటెక్కుచొ
క్కుటపుటొయ్యారమారఁ గని • కాపది మోహము నిల్పలేక మి
క్కుటపురతిప్రయత్నమున•కుం గలగించెద నంచు నిట్లనున్. 148

తే. ఎన్నడును రానివాఁడ వీ • వేమి పనికి, వచ్చినాఁడవు కూర్చుండు • వన్నెకాఁడ
మంచ మదె తెచ్చి యింటిలో•నుంచినా న,టన్న వినివాఁడు పోవలె•ననుచుఁ బలుక.

ఉ. పోవలెనంటి వారమణి•మో మటుచూడక నీడ నుండ లే
వో విలపించుబిడ్డలకు • నొయ్యనఁ జన్నిడి నిద్రఁ బుచ్చఁ బోఁ
గావలెనో భ్రమించు విటు•కత్తెలయల్కలు దీర్పఁ బోయెదో
శ్రీవిభవోత్తమా యెఱుఁగఁ • జెప్పు మటంచును జెక్కబట్టుచున్. 150

తే. కోళ్లు నిండారఁగా దొడ్డ•కొంగ డపుడు, పరిచి యాకసిమంచంబు • పైకిఁ జేర్చి
వలచి వలపించి చిన్నెల•వగలు చూపి, యెనసి రతికేళి నేలె న•య్యిగురుబోఁడి. 151
152

వ. ఇత్తెఱంగున.

క. అనిరుద్ధచేష్టఖేలన, మనివారితదంతఘాత • మతిచిత్రతరం
బనిశము పూర్వానందం, బనుపమగురుసురతసౌఖ్య • మబ్బినయంతన్. 153

క. ఈలాగు నిచ్చనిచ్చలు, మేలుగఁ గోరికెలు దీర • మిధునత నన్నుం
దేలింపు మనుచు ననిపినఁ, జాలం బాదుగ నతండు • సలుపుచు నుండెన్. 154

సీ. కాంభోజి కేదార • గౌళ శోకవరాళి, పున్నాగ గుమ్మకాం•భోజి శంక
రాభరణము మేఘ•రంజి తోడి వరాళి, నాదగామక్రియ • నాట రీతి
గౌళ రామక్రియ • మేళగామక్రియ, గౌళ నారాయణ•గౌళ మధ్య
మావతియు ముఖారి • మలహరి సామంత, పంతువరాళియు • బౌళిరాగ

తే. చెంచు మలహరి దేశాక్షి • శ్రీవరాళి, మాళవియుఁ బౌండి సింధురా•మక్రియయు వ
సంత సామంత శుద్ధవ•సంత గుజ్జ, రియును హేజజ్జివ్వ నీలాంబ•రియు ననంగ. 124

తే. పొసఁగు ముప్పదిరెండు న•పుంసకములు, మాళవశ్రీ యనంగను • మలహరి యన
దేవమలహరి రేగుప్తి • దిరముపంచ, మలనా రన నైదుమిశ్ర లీ•మర్మ మరసి. 125

తే. షడ్జ గాంధార మధ్యమ • ర్షభ నిషాద
పంచమ సుధైవతాఖ్య స•ప్తస్వరములు
మంద్ర మధ్యమ తారక • మహిమ లెఱిఁగి
యాడఁ బాడగ నేర్చు న•య్యబలఁ జూచి. 126

క. వలచి యతఁడు కడుమోహము, తలమునుకలుగాఁగ మదని•తామరవిరితూ
పులకకటికలకు లోఁబడి, మలయుచుఁ దా వెంట జాలి•మాలం దిరుగున్. 127

వ. ఇట్లు దిరుగుచుఁ దాఁ జేయుయత్నంబులఁ దన కభిమతంబు ఘటియింపం దలంచని
యారతిసేనను మరులుకొల్ప నూహించి యాపల్లపుండు వైద్యసహవాసం బొనర్చి
యంత. 128

తే. ఇంద్రగోపంబు గోచన • మెట్టులు వెలి, గారము జలభ్రమణములు • నీరుగొబ్బి
వి త్తనా ల్పుట్ట పందుర•సోత్తరమగ, నూరి మదుపునఁ బెట్టిన • సారి వలచు. 129

నీ. నల్లేరు కణిక గం•దము తేనె వగనూరి, లేపించి కూడిన • లేమ వలచు
కరక తాండ్ర యుసిరి•కలు కోష్టు పాలచే, నూరి పట్టించిన • సారిచేరు
వెలిగారమును నెట్టి•విసెపూలు నిజతనూ, జలముల నూ రిడ్డ • చెలియ కలియుఁ
గలుగొట్టు నీరావు • కాల్మడిచే నూరి, విడెములోఁ దగిలింప • వెలఁది చిక్కుఁ

తే. గూర్మి జిల్లేడుదూదిని • గోశఫలర, సమునను మెదించి వర్తిగాఁ • జక్కఁజేసి
కుసుమనూనెను దీపంబు • పొసఁగఁ బెట్టి, చూప లోనాదు రెటువంటి•సుదతులైన.

తే. జాజికాయలు జాపత్రి • చారపప్పు, సెనగ లనుములు గసగసల్ • మునుగపువ్వు
మదనవిత్తులు కొబ్బెర • మందపాల, నూరి త్రాగిన మద ముబ్బుఁ • జేరువేళ. 131

క. అనుచు నిజరచితవితరణ, జనితామోదమున వైద్య•జనములు దెలుపన్
వనితావశ్యౌషధములు, విని య ట్లొనరించి యింతి • వెస వలపింతున్. 132

క. అని నిశ్చయించి యాబోటి, గనుపమమణి హేమఘటిత • మై సిరి లోలయర్
దనరు రతిసేన మందిర, మునుగా పెట్టుకొనియుండు • మోహము కల్మిన్. 133

సీ. పంచాంగమయ్యకుఁ • బాగ సమర్పించు, నట్టువకానికిఁ • బెట్టు మురువు
భరతంపుటొజ్జకుఁ • బచ్చడం బొగిఁ గప్పుఁ, బాగడుబట్టుకుఁ జేర్చుఁ • బోఁగుజోడు
కథఁ జెప్పు భూసురా • గ్రణికి ధోవతొసంగు, ననువుకానికి బ త్తె • మొనయ నడుపుఁ
బూల్గట్టు సాతాని • బోడి కుంగర మిచ్చు, గందొడివానికి • విందు సేయు
తే. జతురికకు జీరదూతికి • సందిబొందె, కడెము పరిచారికకు సారి • కకును రవిక
తాపికకు సొమ్ము వైశ్యమా • తకును గాన్క, లిచ్చి చెప్పించు రతిసేన • కెచ్చుతనమును.

వ. మఱియును. 135

ఉ. గుండనికిం బసిండిపని • గోరడిబండకు వెండితాయెతుల్
లండికిఁ జేకడెంబు పది • లంబుగ గుమ్మెతకాని కందెలుం
బెండెము బాడుగోలునకు • భృత్యునకు న్మెడనూలు చాటుకో
దండున కుంగరాలు మొల • త్రాడులు గుంటెనకాని కియ్యగన్. 136

క. వారందఱు తమచాతురి, మీరి మహాసంపదా ప్తి • మించినవాఁ డీ
జారాగ్రణి యని చెప్పిన, నారతిసే నపుడు మంచి • దని యియ్యకొనెన్. 137

క. పడతుక నతఁ డీగతిలో, బడఁ జేసుక మురిపె మట్టి • పడఁ గడుదమి దుం
దుడు కొనరింపఁగఁ గోరిక, లడరఁగ రతిసేన రతుల • కాయత్తం బై. 138

క. పన్నీట జలక మొనరిఁచి, కస్నూరి రాసున్న మిన్న • గన్నన్నకు మర్
మున్నొనఁగి సన్నబియ్యపు, టన్నము మితభుక్తి చేసి • యమితోత్సుకుఁడై. 139

తే. చాదు శ్రీగంధ మగరు కే • సరి కదంబ, మత్తిరు పునుంగు జవ్వాది • హరిణ మదము
బుక్క యత్తరు గోవగం • బూర బోలు, చట్ట కలపంబు పన్నీటఁ • జాది పూసి.

క. సిగ నరవిరిసరములు పొం, దుగ వేసి గుమాలు గట్టి • దుప్పటివలె వా
టుగ వైచి విడెము సేయుచు, సొగ సుట్టిపడంగ నతఁడు • సొంపు జనింపన్. 141

సీ. సకినెలపట్టెమం • చము పాన్పు తలగడ, బిల్లలు చందువ • మల్లె విరులు
కరడ సురటిగిండి • గద్దె సన్నపుఁగాయ, గా జద్ద మడపము • కలపము చిటి
చాప తబుకుసాన • జాలవల్లిక దీప, ములు గందవడి దట్ట • పునుఁగు బరణి
యాకుసంబెళతంబు • రగురుధూపము పాదు, కలు తమ్మపడిగము • కప్పురంబు
తే. క్రోవి కస్తూరి వీణె కుం • కుమసుమంబు, పొట్లములు రుద్రవీణె మే • లక్కట్లు భాగ
ములకరండంబు రతిబంధ • కలితచిత్ర, ములు గలుగు కేళినిలయ మిం • పలరఁ జేరి.

తే. బలసి కోకిలు నొడ్డీలు • పల్లటీలు, పావురాయులు బకదార్లు • బట్టిగాండ్రు
నంచలు నెమళ్లు కేర్జము • ల్పంచవన్నె, చిలుకలు పికాదిశకునము • ల్గలసి పలుక. 143

తే. చంద్రకావి ఖురాళంబు • సరిగె చెరఁగు, జిలుగు కెందమ్మి దోదమ్మి • చీనికమ్మి
పైఠిణీకమ్మి తెరచాటు • పాన్పుమీఁద, బదటుతమి నుండునంత న • ప్పణ్యకాంత. 144

వ. మజ్జనభోజనాదివిధుల సంతుష్టహృదయయై భావసూచక బిబ్బోక హావభావ లలితకుతూహలకిలికించిత విహృతవిచ్ఛిత్తి విభ్రమ ధైర్య లీలాహాసమాధుర్య హేలావిలాస చకితాది శృంగారచేష్టల కనువైన యాలింగనంబు సరసాలింగనంబు దృఢాలింగనంబు సర్వాలింగనంబు స్పృష్టక పృథక యను రూపగూహన జఘనోపరిగూహన కుచాలింగన లలాటిక నిరూపణ లతావేష్టిత వృక్షాధిరూఢ తండులక క్షీరకంబులను చతుర్దశాలింగనంబులు గావించి యుప్పొంగుతమకంబున నతండు. 145

తే. చుంబనంబును బీలత • నంబుఁ గబళి, తంబు తూషణ మను పేళ్ల • దనరు నాల్గు
గతుల ముఖరతిభేదము • ల్గలయఁజేసి, ద్రవముఁ బుట్టించు తాన కాం • త్తడవి చూచి.

తే. సఖియ యంగుష్ఠపదగుల్భ • జానుజఘన, నాభ్యుర స్తనకక్షకం • ఠసుకపోల
దంతగల్లాక్షిఫాలమ • స్తకశిరోజ, ములు ప్రతిపదాదిగలకళాం • స్థలము లంటి. 147

సీ. చెవులనిమిత్తంబు • చెక్కులస్ఫుటితంబు, నధరోష్ఠమున భ్రాంత • మడరఁ గన్ను
గవదిర్యగంబును • గక్షదేశంబులఁ, బ్రథితంబు చనుదోయి • నధరకంబు
చిత్తజుగృహమున • నుత్తరస్ఫుటితంబు, పొక్కిట సంపుటం • బును శిరోధి
ననుపదం బూరుల • నన్వితం బన నొప్పు, దశచుంబనములు ద • త్తస్థలములఁ

తే. బొదలు ముదమునఁ బర్యాయ • మున ఘటించి, కలయశశకప్రతమయూర • ఫలకరంజి
సుచ్ఛురికమండలికగండ • సుత్రిభాగ, ముఖముఖనఖక్షతంబులు • మొనయఁ జేసి. 148

తే. క్షతరహోచ్ఛ్వాసఖండాభ్ర • కప్రవాళ, మణికమాఢకరుచిబిందు • గుణకబిందు
మాలికాగోళచర్చితా • ఖ్యాలివెలయు, పదిరదక్షతముల వేడ్కఁ • గదియ నొక్కి. 149

క. స్థితమును దిర్యగముక్తా, న్వితమును నాభిసిత మనఁగ • నిపుణజనులు ప్ర
స్తుతిగొనఁ దనరు చతుర్విధ, రతుల గతుల నతుల నబ్బు • రము గావించెన్. 150

వ. వెండియు నఖండసురతపాండిత్యంబున విటుండును నయ్యండజయానయు మదవేదండంబులరీతి జృంభక కూర్మక రణాస్కంధయుగ గర్భపీడిత సాధుక దృఢలావుక కర్కట సముద్గక వేణుదారిత సంయమకృత కోపరతి ధృతోరువక నాగర ప్రేమాభిరామ చక్రభ్రమణ ప్రసాదిత శూలాంచిత పాదవేష్టిత బాణరంజన మదనరంజన పార్శ్వఘట్టన భావికోల్బణ మండూకకరణ గ్రామ్యకరణ సర్వతోభద్ర మండల ప్రభ మధురకంపితాంగ సంపుటార్ధసంపుట పద్మక అర్ధపద్మక అంబురుహ భారచరణ

పాదపదక పాదబంధ పాదాశ్లేషణ మదనడోలన చంద్రార్ధ మండలార్ధ యూరు చరణ కక్షపాద విష్టిక హరిక కరణ నాగపాశాంగ చక్రగుహ్యక ద్విరదావలంబన చిత్రలాఘవ మదనకుంచిత గగనకరణోర్ధ్వబాహూచ్ఛ్రుత మర్కట విమర్దన వేణు కోద్వేగ పదావృత్త గజాంగ దృఢాంగ సింహావలోకన పాదారోహణ ప్రియాంగ బాడబబాణ కృత్తమదన రాజహస్త లాఘవ బాహుచరణ చక్రపాద మదన సంఘట్టన పాదమేళన గోముఖాంగ సంవేష్యకరణ సమితాంగకరణంబులను చౌశీతిబంధంబులను జమత్కారంబులఁ బెనంగుచుండి రయ్యవసరంబున. 151

సీ. గంబూరమును జాజి • కాయ లుస్మెత్తవి, త్తులు మర్ల మాతంగి • కలువగడ్డ
పచ్చయెన్నులు కోష్టు • పచ్చిక మంచేనుఁ, గమదము గుల్లసు • న్నమును రుద్ర
జడవేరు వస ఖురా • సాని వామము పుతు, కలపోలుఁగాడు మై • గారు చెమట
నీరావు గజ్జుల • చేరిన మష్టును, గాల్మడి రాతంటు • గాసు నూరి
తే. కలయ గురిగింజలం తేసి • గుళిక లమరఁ, జేసి నీడ నెయారించి • తీసి దాచి
యున్నమం దింతమశుపుతో • నొసఁగెనతని, కధికతరమోహ మూన నా • హంసయాన.
క. ఈబాలిమందు మసగొని, యాబిడ తనకండ్లు గట్టి • నట్లుండ నతం
డేబుద్ధిలేక నచ్చెలి, సోబెల కెదఁ జిక్కి చిక్కి • చొక్కుచుఁ దిరుగున్. 153
తే. వాఁ డటుల మీరి భోగము • వారిఁ గేరి, చేరి రతిసేన రతితానఁ • జెలఁగు మదిని
దానిసొమ్మైన యస్మైన • దట్టమైన, వయసు మరుబారిఁ బడఁజేయ • వానిజాయ.
సీ. బొమ్మల పెండ్లిండ్లు • బువ్వఁపుబంతులు, పుణికిళ్లు నిట్టుక్కి • బొమ్మరిండ్లు
గుజగుజరేకులు • గొబ్బిళ్లు నీగగే, బుడిగిన్నె జాబిల్లి • పుక్కటిల్లు
గుజ్జెనగూడులు • కోలుకో లన్నలు, గీరనగింజలు • పాలుపట్లు
పీప్పిళ్లు త్రొక్కుళ్లు • బేడిసె తిరుగుళ్లు, నచ్చనగండ్లు దా • యాలు పొళ్లు
తే. లడరు వామనగుంట లా • డైనయట్టి, యాటపాటలఁ బ్రొద్దుపో • ననుగుఁ జెలులఁ
బాయకచరించు బాలకీ • ప్రాయ మేల, వచ్చె విరహాగ్ని యిటులేల • హెచ్చె ననుచు.
క. నెరవయసు పిక్కటిల్లఁగ, సురతం బొకవేళ నైనఁ • జొప్పడమి మదిన్
బరపురుషవాంఛ వొడమిన, విరహంబున రేయిపవలు • వేగుచు నుండున్. 156
చ. ఉదు టగువానిఁ బ్రాయమున • నుండెడువాని మనోజ్ఞలీలనం
పద గడిదేరువాని గుణ • పాటవ మొందెడువాని నేపుచేఁ
బొదలెడువాని గీతముల • పొల్పు లెఱింగినవాని సంగమో
న్మదమునమించువాని గని • నన్ మరుబారికి నగ్గమై పడున్. 157

తే. ఇరుగుపొరుగులదంపతు ♦ లేపురేఁగి, సంగమక్రీడ లోలాడి ♦ సరసమాడు
సొవసొవలు విన్నమాత్ర ను♦స్సురు మటంచు,మన్మథుని బారి గొఱ్ఱెయై ♦ మగువ దలఁకు.

వ. అంత నక్కాంత వేఱొక్కవాసరంబున. 159

చ. అటువలె వేఁగుచుండి మగ ♦ డత్తయు మామయు నింటలేమి వె
ల్పటికి హుశారునం జని గు♦బాఁడెబవీథులవెంట జంటలై
చిటిలినపూఁతగంధముల ♦ సిస్తగుపాగల సిందుచల్వదు
ప్పటుల విభూషణావళుల ♦ బాగుగ నేగెదు దుండెకాండ్రలోన్. 160

సీ. పసిడికుప్పెలతీవి♦పొరుకుచ్చులు నింద్ర, గోపంపుజగజంపు♦గుంపువారి
కుచ్చుకుక్క సిగ్గెము ♦ ల్గొల్పెల్లు మునవాభు, చెక్కడపుంబచ్చ♦చిలుకచెండ్లు
పట్టుపట్టంచుతా♦ప్తాలేపు జీవదం, తపుగోడియలు పట్టు♦త్రాళ్లు దిండ్లు
నేనుంగుకొమ్ము కా♦ఱేరికిఁ బేటాకు, విలికెలమ్ములు సెల్లు ♦ వెండవీటి

తే. కేను లీవంగి సోఁక పొ♦క్కిలులవోలు, పుప్పిచిమతిండియును లేఁత♦ముందు నిడుద
గణపుసదులావుసీలర♦క్తములపన్ని, కొమ్ము పున్నాగ మమరంద♦లమ్ములందు. 161

క. పగ లుట్టిపడఁగఁ దమతమ, సొగసులతో విఱ్ఱవీఁగు♦సొంపుల మీసాల్
పగలున పడిద్రేయుచుఁ జిఱు, నగవులఁ బద మనుచు జార♦నాయకు లలరన్. 162

సీ. పైచరనోరడి♦బలిమికం బొద్దిక, ముల్లడితొకుడు ♦ జల్లికట్టు
మైసల్లు మెడగుడు ♦ మారువెంబడిబిట్టు, జతుకు సమాధాన♦జతన మడుగు
లోదాటు నడ్డకా♦లువపాదబెళకుని, బ్బరము నీరడికందు ♦ బలిమిదిఱుగు
నుమ్మలిసెలవు పొ♦దొత్తుకలు ధుతాళి, తోడిగట్టయుఁ గాల♦జడుపులావు

తే. హొయలు బూరుగ వన్నాగ♦హొయలు బిగువు, బొట్టు డేగురురేకప్పు♦బెట్టుడిసుము
పటము తాకుడుమొగవొయ♦ల్పదిల మదిగొ, హెచ్చరికటంచు వడిబోయ♦లేగుచుండ.

ఉ. సంచపురేకు దుప్పటులు ♦ జారుసీగ ల్బిగిచల్లడాలు వా
సించెడిగంధపట్టియలు ♦ బిల్లురుమాలలు సందితాయెతు
ల్మెంచుగ సానచిమ్ము నును♦మీసలు దీటుచు మీఱి కేరి ధి
క్కించు పటంచు గుంపుగొని ♦ కేకలు వేయుచు వచ్చువారిలోన్. 164

తే. మంతుఁ డన నొప్పు నెరవింత♦హొంతకారి, సొగసుబయకారిచానను ♦ జూచి దగ్గి
కేకరించిన నాతఁడు ♦ కెరలి కాంచి, యిదియు పగలాడిరా యని ♦ కదియఁ జనఁగ.

ఉ. గేఁదగిరేకుటత్తమునఁ ♦ గీల్కొనుచూతదళంబు నాళ మిం
పూఁదినజాజిమొగ్గగజ ♦ ముత్పలపుర్ జలికట్టు సంపగిం

బాదురుగా నొనర్చినతుపాకిని బుప్పొడి మందు కప్రపుం
బూదియగుండు నుంచి మసుబోయడ మీఁదున నేసె నిర్వరన్. 166

వ. అప్పు డామంతుఁ డయ్యింతి చెంతకు సంతసంబున వచ్చుచు నిజాంతర్గతంబున. 167

ఉ. ఆరయ నేరకేటిసి యసలందులవెన్నెలతేటనించి తొ
లార్కరు మెఱుంగురంగు లిడి కమ్మసుధ న్పద నిచ్చి మేటిశృం
గారరసంబుతోడఁ బొసఁగంగ ననంగ విధాతచేసెఁ గా
కీరమణి న్విధాత సృజియించుచు నంటినఁ గందకుండునే. 168

సీ. దీర్ఘమై విలసిల్లు దేటవాల్గనుదోయి, గుడుసైన నాభియుఁ గుల్కుచుండుఁ
గ్రొమ్మించుగతి హెచ్చుఁ గొమెరచేతులరీతు, లుత్వంబుచందాన నొప్పు జఘన
మాత్వంబుభాతిని నమరు గర్ణద్వయం, బేత్వమై జడపొంక మెసఁగుచుండు
నైత్వంబువిధమున నలయూరు లలరారుఁ, డలకట్టువలెమించుఁ దళుకునొసలు

తే. సున్న నడుము విసర్గలు చన్నులారు, బొసఁగు వలపలిగిలక యాభుజము లనఁగ
నలరు గుణితంబువైఖరిఁ జెలగు నంగ, సౌష్ఠవముతోడ నున్నది సకియ యనుచు.

వ. కదియం జేరి యప్పుడు. 170

చ. చెలియరో యేపురం బెటకుఁ జేరఁగ వచ్చిట నిల్చినావు వీ
తొలరవ మొప్ప దగ్గితివి నెమ్మదిలోఁ గలపూన్కి దెల్పు మా
యలు పచరింపఁ బోకనిన నమ్మక చెల్లరో యాతఁ డెందు కం
దులకురు లొగ్గె నేచి కడుదొమ్మికి రాఁ దలచెె సెబాసుపో. 171

తే. అనుచుఁ జిఱునవ్వు మోముపై నంకురింప, భయము సిగ్గును దనునుంపఁ బలుకు నెడల
గద్గదరవంబు జనియింపఁ గన్నెదాన, మేలు పడినాను జాణ నీ స్నేలుకొనర.

క. అనినవిని మంచి దని యొ, క్కనివాసస్థలముఁ జేరఁగా రమ్మని వ
చ్చినఁ జేరి ముద్దులిడి మె, ల్లనఁ జేష్టల నుబుసుపుచ్చి లాలిత్యమునన్. 173

క. కళలంటి ముద్దు వెట్టుక, వెలసినతమి మోవి నొక్కి వీపునఁ జను ము
క్కులు వెల్లఁ గాగిలింపుచుఁ, బలుతీతుల రతులఁ గలసి భ్రమ నొందించెన్. 174

క. ఈచక్కి నీవు నిచ్చలు, రాచిలుక సిపాయి రౌతు రణమున వలపుల్
పీచణుచు మనిన వాఁ యని, యాచిగురుంబోడి కాతఁ డభయం బిచ్చెన్. 175

తే. ఇచ్చి సంకైనయపుడెల్ల వచ్చి సైగ, చేసి విటుఁ డేగఁ దానేగి చెలియ యింట
సురతకేళుల నలరింప సుఖము మరిగి, తిరిగెఁ దనయత్తకన్నఁ గావరముపట్టి. 176

ఆ. అత్తకన్నకోడ లయ్యత్తకోడలి, కన్న నేపు రేగి యాప్తజార
జనులఁగూడి పాడి చరియింప సాగిరి, యొంటిపాటు దొరకి యున్నయెడల. 177

తే. అత్త యేమఱి యుండెడు • నంతలోనఁ, గోడలు చరించి వచ్చును • గొంతదడవు
కలయఁగఁ గుణాలు వచ్చునా • క్షణ మెబుద్ధి, కోడలికిఁ జెప్పియత్తరం • కాడఁ బోవుశా.

క. ఈమాడ్కి నన్యోన్యం, బేమాత్రము తెలియకుండ • నిచ్ఛావృత్తిన్
గామించుచు నొకదినమున, లేమాపునఁ గోడ లింట • లేకుండు నెడన్. 179

క. వలవనిసతి పురుషులకును, వలపులు పుట్టించు మందు • వగ నెఱిఁగి రతిన్
వలపులు మరపంజాలిన, బలియుం డగు హాంతకారి • పథమున రాఁగన్. 180

ఉ. అత్తలహాంతకారిని ర • యంబునఁ దోడ్కొని మూలయింటిలో
హత్తుక కేళి సల్పునెడ • నంతటఁ గోడలు వచ్చి యింట మా
మ త్తవిభుండు లే రనుచు • మంతునిఁ దోడ్కొని యిల్లుచేరినన్
ద త్తర మారఁ గోడలిని • దద్విటునిం గని యత్త కిట్లనెన్. 181

తే. అపుడు గృహమధ్యమునసుండు • న త్త నంత, విటునిఁ గోడలు గాంచె న • వ్వేళయందు
నేర మొక్కింత రాకుండ • నేర్పు మెఱసి, వార లిరువురు బొంకఁ గా • వలయుఁ జెపుమ.

క. అనవిని హేమావతియే, యను వమరఁగ నితరశంక • లందక యుండన్
ఘనకచలు బొంకి తమవిట, జనముల నిల్వెడల నంపఁ • జాలిరో యెఱుఁగన్. 183

క. నీ వెఱిఁగించిన వినియెద, నా విని హేమావతీ వి • నం గడువేడ్కన్
భావమున నున్న విను మని, ధీవిభవము హంసవంశ • తిలకం బనియెన్. 184

తే. అటుల విటయుక్తయై యింటి • కరుగుదెంచు, కోడలినిజూచి యత్త సం • క్రోధయగుచు
వీఁ డెవఁడు వీనిఁ దోడ్కొని • వేశ్మమునకు, నంజకడ రాఁ బనేమని • జడియ నడుగ.

క. దిటచెడక దిగులుగొని సట, సాట వోవక వెనుకముందు • చూడక బొంకే
దెటు లని చింతింపక యా, ఘటకుచ తడఁబడక యత్తఁ • గన్గొని పల్కెన్. 186

తే. తల్లిదండ్రులు మీరు బాం • ధవులు మఱియుఁ, జిక్కి తక్కినవారలు • చెప్పినపుడు
వినక నాపతి నన్నిట్లు • విడిచిపెట్టి, తిరుగుచున్నది మీకెల్లఁ • దేటగాదె. 187

క. వనితాపురుషుల కీయన, యనువున నన్యోన్యమోహ • మందగఁ జేయున్
ఘనుఁ డని కొందఱు చెప్పఁగ, విని తోడ్కొని తెచ్చినాను • విభుననుఁ గూర్పన్.

క. ఇది యేక్రియ నీయనచే, ముదమునఁ జేయింపవలెనొ • ముగ్ధను బ్రాయం
బొదవినదానను మోహము, మది సైపఁగఁ జాల ననుచు • మమతఘటిల్లన్. 189

ఉ. కోడలుపల్కు పల్కు విని • కొంకక నిక్కముగాఁ దలంచి యీ
చేడియ నాదుజారుఁ గని • చిత్తములో నెటులం దలంచునో
దూడెల నమ్మరా దని వి • ధుంతుదవేణిత నందు సత్యపుం
జాడఁ గనంబడన్ స్వతను • జాతలతాంగిని జూచి యిట్లనున్. 190

క. నీ వింత యడుగ నేటికి, నీవిభుఁడు పరేచ్ఛఁ బూని • నిను విడిచి చరిం
చేవిధము తెలిసికొ నే, యీవైద్యుని తోడితెచ్చి • తింటికిఁ దరుణీ. 191

ఐ. అని యజ్జగజంత నిశాంతంబున నున్న తనయుపకాంతునిఁ జూపి వెండియుఁ గోడలి
కి ట్లనియె. 192

క. నీపతి నిన్ను బరీక్షక్, బ్రాపగు యత్నంబు నితఁడు • భవ్యస్థలిలో
నేపున నొనర్చినాఁ డిఁక, రేపట మట్నాట నీదు•క్షేమ ఘటిల్లున్. 193

తే. అనుచుఁ దనయందుఁ జెలియ సం•దియముఁ జెంద
కుండ నెఱిఁగించి యత్త యో•యుత్పలాక్షి
యతని నంపించు మిప్పటి • కితనిచేతఁ
గాకయుండినఁ జూతము•గాక యనిన. 194

క. విని కోడలు నాయుంపలి, నెనరున నీయత్త యతని • నిక్కము తోడ్తె
చ్చినయది పతి ననుఁ గూర్చుట, కని తలఁ చటు సందుగామి • ననిచెకొ విటునిన్.

ఆ. అంత దానియత్త • యాత్మోపపతిఁ జూచి
సైగసేయఁ దెలిసి • జారుఁ డపుడు
తత్ప్రియత్న మపుడె • తగఁ జేసి తని వార
లిరవు లెఱుఁగఁ బలికి • యింటి కరిగె. 19·

చ. అని కలహంస వంశమణి•సాంగముగా వినుపించె వీనుదో
యినిఁ గడుసమ్మదమ్ము జని•యింపఁగఁ దత్కథ యాలకించి కాం
చనసుమగంధి యాసతుల•చాతురికాత్మ నెబా సటంచు మే
లనుచు గణించికొంచు నిల•యంబున కేగె నినుండుదోఁచినన్. 197

క. ఈరీతిఁ బడకయింటికిఁ, జేరం జని మఱునాఁడు • చీకటి జేజే
రారా కళరా రాఁగల, యారజనీవేళవిరహ • మగ్గల మైనన్. 198

సీ. విరిదండ నెత్తావి • నెఱిఁగుంపుగండుతు, మ్మెదపిండునకు మోద • మొదవఁజేయఁ
గాశ్మీరతిలకంబు • కాంతులు వదనేందు, బింబంబునకు సంజ•డంబు గూర్పఁ
గస్తూరిపత్రభం•గములనిగ్గు కపోల, శశిఖండములకు లాం•ఛనము లీన
వాసించు నెఱిగంధ•వడివ్రాఁత చనుగుబ్బ, పువ్వుగుత్తులకుఁ బు•ప్పొడులఁ గురియ
తే. నీలమణికాంచి ఘృణులు వి•శాలజఘన, ధరణి కంబుధిమేఖలా•త్వము ఘటింప
నృపతిమణిఁ జేరకోర్కె నె•న్నీరజాక్షి, వచ్చి రాయంచకడ నిల్చె• మెచ్చులొలుక. 200

వ. అప్పుడు హేమావతికి హంసం బి ట్లనియె.

## పందొమ్మిదవకథ.

క. శ్రీకర మను నొకపురము సు, ధాకరబింబభ్రమప్రదస్వర్ణమణి
ప్రాకారగోపురవర, ప్రాకారసువజ్ర కలశ మై సిరు లొందున్. 201

శా. సాలాగ్రస్థలకేళితత్పరమహీ స్వామ్యర్భకవ్యూహదో
హాళీక్రీడితరత్నకందుకమహా బాధవ్రణావాప్తిచే
నాళీకప్రియు ధీరసారథికి ము న్నాటిల్లి యీనాఁటికిన్
బోలే దయ్యెననూరునామ మది వో మూలంబు తత్సంజ్ఞకున్. 202

మ. పరిఘాంభోపరిదృశ్యమానవిలస త్ప్రాతాళసంచారబం
ధురదర్పోత్కరభోగరత్నఘృణిసం దోహంబు కెందమ్మిమొ
గ్గరహిన్ గుల్క హరించుచూని యది రా కన్ దక్కినన్ బల్మఱున్
గరముల్ సాఁచఁగ బోండ్లు నవ్వుదురు వీఁ కన్ వారికేళిన్ సతుల్. 203

తే. ఆపురంబున ఫణిహారుఁ డనెడు పేరఁ, గాఁపురము సేయు నొకతిల ఘాతకుండు
సంభ్రమంబున నాకార సౌష్ఠవమున, వాఁడు కందర్పునకుఁ జీటి వ్రాయఁ గలఁడు.

తే. గానిగె కడెంబు మోకులు గడ్డపార, కాడి సిద్దెలు గూటంబు కడవ జల్లి
గంప కనుగంత తక్కడి గట్టిమెద్దు, చుట్టు చవికెయు సర్వవస్తువులు దనరు. 205

తే. వెల్లగిసెనూనె కుసుమనూనె వెట్టినూనె, నల్లనూ నిప్పనూనెయుఁ దెల్లనూనె
కుసుమగానుగ దుండుగ కొబ్బెరయును, నూనె పొగనూనె తగిరెస నూనె మరియు.

క. పరిపాటికల్మి చేతను, గరగరిక వహించి మించి కమనాగరిక
స్ఫురణం దమవంశంబున, కరయంగాఁ బిన్న పెద్ద యై యతఁ డుండున్. 207

చ. అతనికి నొక్కయింతిగల దంగజుపట్టపుదంతిజారిణీ
సతులకు మేలుబంతి విట జాలము లాడెడు పూలబంతి యా
యతమతి జారచిత్తజమ హావిరహాగ్నికి శాంతిచేహని
ర్జితచపలాసుకాంతిమణి చిత్రిణి నాఁ దనరారుఁ జేరసన్. 208

నిరోష్ఠ్యకందము. దరగళఘనరసధరకచ, ధరసదృశస్తనసురదన తరళనయన సుం
దరకంఠకకరయుగ, సరసనయన యనగ తరుణి సరసతఁ దనరున్. 209

సీ. నీలధారాధర నిర్మలకాంతుల, గడియలో మాయించుఁ గలికివేణి
సంపూర్ణపూర్ణిమా చంద్రబింబస్ఫూర్తి, దినము కుందగఁ జేయుఁ దెలిపముఖము
నిద్దంపురుచు లొల్కు నద్దమ్ము లీక్షించి, గవిసెనల్ పెట్టించు కాంతచెక్కు
లలరారు జిగిదేఱు నలచకోరంబులఁ, బుట్టుగ్రుడ్లనిపల్కుఁ బొలఁతికనులు

తే. నెట్టుకొని గట్టు వగపట్టు • పుట్టచెండ్లఁ, బట్టి కొట్టించు వీఁపునఁ • గొట్టుఁ బాటిఁ
గొమిరె సిబ్బెంపుగబ్బిచ•న్గుబ్బదోయి, వినుమదారంభగంభీర•వేదిగమన. 210

క. తనుకాంతి మెఱుఁగుమినుకా, మినుకావర మణఁచుఁ గొను • మేలిమి గనకా
కనకాద్రితోడ సరి చనుఁ, జనుకాంతిన్యమ్ము పొగడ • సన్నుతితునకా. 211

తే. నీరజేక్షణసిబ్బెంపు • నిబ్బరంపు, గబ్బిగుబ్బల నెఱయూపు • గాంచి తొడవు
కాంతిఁ బొంగారు బంగారు•కలశములకుఁ, గనలు బిబ్బోక నీరాక • గలుగఁజేసి.

మ. వనజాతాక్షిపయోధరంబు లలక•వ్రాతంబు కంఠంబు మో
హనలీలం దగు పాలభాగమును నూ•గారున్ నవల్లిలచే
ఘననీలాబ్జకళాకలాపజయకాం•క్షన్ మించుటే యభ్రమల్
ఘననీలాబ్జకళాకలాపజయకాం•క్షన్ వేణి రాణించఁగన్. 213

ఆ. దానిజవ్వనంబు • దనువు నిరీక్షింప, మానికైన నెనయ • మనసుపుట్టు
నితరజనులు చూచి • యేణాక్షి రతిఁ జెంద, నిచ్ఛయింతు రనుట • కేమి యరుదు.

తే. తుప్పుడుల్లిన నొప్పారు • తోయజాస్త్రి, చికిలినిద్దంపుఁగై దువు • చెలువుతోఁప
నూనె మెఱుఁగున నునుచాయ • మేనుదనర, నది విటాళుల కన్నాస•యై మెలంగు.

ఉ. నడవడిగల్గు వాఁడు కడు•నాణెము చేఁగలవాఁడు రూపునన్
బెడఁ గగువాఁడు బల్రతుల•బేరజమై తగువాఁడు నిర్ధరన్
జెడుఁ గల బ్రహ్మ దీనిని ని•నీ మగనాలుగఁ జేసె నంచు లో
మిడుకుచు దానియింటికడ • మీసలు దీటుచు నుందు రెప్పుడున్. 216

సీ. పనిలేనిపని పూను•కొని వచ్చి ముంగిటి, నెళవుగ దిరుగని•నీటుకాఁడు
వేబ్రొక్కకడ కేగు•వేళల నటుతొంగి, చూచి పోఁదలఁచని • సొగసుకాఁడు
సంగడికాఁ డిందుఁ • జనుదెంచెనా యని, వాకిలిఁద్రొక్కని • వన్నెకాఁడు
గానుగ యీప్రొద్దు • కట్టలేదా యంచుఁ, గూర్చి యింటికి రాని • కోడెకాఁడు

తే. మందునకు నైనఁ బ్రాయంపు•మనుజులందు, వెదకి చూచిన నొకఁడైన • వీఁటిలోనఁ
గలుగఁ డటువంటిమహిమ గ•ల్గంగ దాని, కేమి జనవశ్యమున్నదో• యెఱుఁగరాదు.

ఉ. ఆమణి చిత్రిణీసుదతి • యన్యజనోత్కరసంగమంబుపైఁ
బ్రేమ జనింప నాత్మపితు•బీకలు పెట్టఁగ వీఁటిలో విట
స్వాములు గారవించు గృక•వాకుభుజంగమ ధేనుకేభము
ఖ్యామితబంధకేళులక•శాదు లెఱింగి కరంగఁ జేయుచున్. 218

తే. ప్రేమఁ గన్పట్టి వీధిలో • బెళుకువగల, నరసి కనుసైగ చేసెడి • యంద మంత
లోనె లోఁబడఁ జేయంగఁ • జాననేర్చు, దానికేకాక కలుగ దే•చానకైన. 219

తే. ఇరుగుపొరుగింతవినకుండ • నింటిమగఁడు, తెలియకుండఁగ బరరతిఁ • దేలి నంగ
నాచివలె నుండుగాని యా • నాతిగుట్టు, బ్రహ్మదేవునకైనను • బయలుపడదు. 220
వ. వెండియు నయ్యండజయాన విటకాండంబులఁ గూడి యఖండమోహంబునఁ బలు
దెఱంగులఁ జరింపుచుండె నివ్విధంబున. 221
ఉ. అంత వసంతవేళఁ జెలు • వంతట నెంతయు సంతసిల్లె న
త్యంతలతాంతకుంతదళ • పత్రనిశాంతదురంతతాంతతా
శాంతికరంబు కంతుశర • సంతతసంతతికాంతతాసమా
క్రాంతవనాంతరంబు కలి • కాతతిదంతురితద్రుమాంతమై. 222
తే. కలయఁ గొమ్మలతోఁ గూడి • కాననమున, నుండు విటపుల ననిలచో • రుండు పట్టు
కొని దళాంబరముల దోచు • కొనియె ననఁగఁ, బండుటాకులు గాడ్పులు • పర్వ రాలె.
క. వనలక్ష్మీమాధవశో, భన మగు నత్తరిని బాద • పలతాపురుషాం
గన లన్యోన్యముఁ గ్రీడిం, చిన నెఱయ వసంత మనఁగఁ • జివురులు మొలిచెన్. 224
చ. వనకమలారుణాంబర మ • వారితకుంజపికౌఘశోణలో
చనఘృణిమండలంబు తరు • సంఘదిగంబరపంక్తిమస్తకో
కనదభసజ్జపావృతము • కాననమేఘతటిల్లతోత్కరం
బనఁగ నవీనపల్లవచ • యంబు రహించె నరణ్యభూములన్. 225
చ. అళితతిదక్కయెల్ల కుసు • మావళిచుక్కలనామముల్లస
త్కళికలు పూసపేరు నన • దట్టము పట్టుగఁ బూని మావిజా
జులకు శుభాశుభాలు పిక • సూక్తులఁ దెల్పుచు జైత్రకుండనే
యల బుడబుక్కవాఁడు కల • యం జరియించె వనాలయంబునన్. 226
చ. అళికులగాన వైభవము • హర్ష మొనర్పఁ బరాగపూగము
ల్చలువపుతావి గందవడి • సమ్మద మూనఁగఁ గల్కి చిల్కప
ల్కులు నలరింప గ్రొత్తవిరి • గుత్తిచనుంగవ లింపు నింపఁ బొ
ల్పలరు లతాలతాంగులను • బాయుట లెట్లగుఁ బల్లవాళికిన్. 227
ఉ. చారుతరాతపత్రములు • చామరము ల్సురటీలు పావడ
ల్సారసరోత్తరీయములు • చల్వపువల్వెపుదుప్పటంబు లిం
పారు సుగంధలేపనము • లందముఁ జెందు వితానఁబంక్తులై
మీరె వనీరమాస్థలికి • మెల్లనిగాడ్పులరేగు పుష్పాళుల్. 228
వ. ఇత్తెఱంగున జగన్మోహనంబైనవసంతసమయంబున నవనీసురు లగ్నిష్టోమంబును షోడ
శాప్తోర్యామంబు ద్వాదశాహస్సు వాజిపేయంబు పౌండరీకం బతిరాత్రంబు చయ

నంబు గరుడచయనంబు శ్యేనచయనం బశ్వమేధంబు గవాలంబనంబు ప్రతిపస్తోమంబు మహావ్రతంబు విశ్వజిత్తు రాజసూయంబు సర్వతోముఖి విశ్వతోముఖి సత్రయాగంబు బృహస్పతిసవనంబు ప్రాతస్సవనంబు మాధ్యందినంబు సౌత్రామియు నాక్షేయంబు పస్యం బశ్వినంబు హేమంతప్రత్యవరోహణంబు వృషభయజ్ఞంబును మొదలగు సకలక్రతువు లొనరింపం దొడంగి రట్టిసమయంబున. 229

క. హరిశర్మ యనెడుపేరునఁ, బరఁగిన యొకసోమయాజి • పనిచిన నొకభూ
సురసుతుఁ డొకదిక్కున న, ధ్వరపశువును బట్టుకొని ముందంబున రాఁగన్. 230

క. కంతువసంతజయంతులఁ, బంతంబున గెల్చు నతని • భవ్యాకృతి న
త్యంతముదంబునఁ గన్గొని, కంతుశరాహతులకళికి • గానుగుదాత్మన్. 231

చ. కలికిచకోరకాటపుర్క సాగసు • కాయము కాయజుఁ గేరి మీఱు నీ
కలికివయోవిలాసు బిగి • కౌఁగిట సొక్కుచు నుండలేని యా
కులుకుటొయారగబ్బినసు • గూటమిటారుల యంద మేల యె
మ్మెలపసయేల యం చతని • మీఁదను గాంత దృఢానురాగయై. 232

ఉ. చెంతకుఁ జేర నేగి ముఖ • నీమదరస్మిత మొప్ప వారసీ
మంతిని కీయనో వెలసు • మార్చనో యేటికిఁ గొంచుఁ బోయె ద
త్యంతరయానభాగము న • టంచును మాటలు దీసి పల్కు న
క్రాంతముదంబు గైకొని ధ • రాసురసూనుఁడు విచ్చుఁగన్నులన్. 233

మ. అనవద్యాకృతి యాననంబు దగు న • య్యబ్జాక్షి వీక్షించి హా
వనజాతాసను సృష్టికౌశలము తే • వక్ దీని న్నిర్మించినం
తనె కానంబడె నేర్పు రా ననుచుఁ ద • ద్వాణీశుఁ గీర్తించి మె
ల్లనె చేరం జని దానిచెంగటను మే • లం బాడుచుక్ నిల్చినన్. 234

తే. అలరు కన్నులఁ దేలించి • హర్ష మొదవ, సరస మాడుచుఁ గనుసైగ • నెఱపి వేగ
నింటి కేగిన నచ్చెలి • వెంట నేగి, క్రతుపశువు నాతఁ డొకచోట • గట్టివైచి. 235

వ. అప్పుడు. 236

క. మోహంబుమీర గంద, ర్వాహవమున వార లిరువు • రతులప్రౌఢిక్
బాహాబాహికచాకచి, దేహాదేహిని బెనంగి • ధృతి నున్నంతన్. 237

ఆ. దానివిభుఁడు వచ్చి • తలుపుదీయు మటంచుఁ, దనదుసతిని బిల్వ • విని విటుండు
కడుభయంబు వొడమఁ • గంపితదేహుఁడై, యింక నెట్టు లనుచు • నింతి కనియె.

ఉ. అత్తఱి నెట్లు బొంకి వసు • ధామరశేఖరుఁ డైనయాభుజం
గోత్తము వెళ్ల నంపవలె • నుత్పలగంధసుగంధి లెస్సఁగాఁ

జిత్తములోన యోజనలు • చేసుక తెల్పు మటన్న హంసతో
చిత్తరి నే నెఱుంగనిది • పెంపుగ నీవె వచింపు నావుడున్. 239

క. మంచి దిది విను మటంచున్, గాంచనగర్భాళ్వ మబలఁ • గనుఁగొని పలికెన్
బ్రాంచన్మధురసుధారస, చంచన్మకరందబృంద•సదృశమృదూక్తిన్. 240

ఆ. లలన నటుల భర్త • పిలిచినఁ దా విని, వసుమతీసురుండు • వడఁకుచుండ
వెఱవవల దటంచు • వీఁపు దట్టి లతాంగి, వేగ మేకపోతు • విడిచిపెట్టి. 241

తే. పొదువు పోనీకపట్టుము • భూమిదేవ, వర్య యనుకొంచు వచ్చి క•వాటము గడె
యొడపినంతనె తద్భర్త • యింతితోడ, నెవ్వఁ డీతండు గజిబిజి • యేమి యనుచు.

చ. గదిమిన నావఘనాటి కల•గన్ బడ కాత్మభయంబు లేక భూ
మిదివిజుఁ డీతఁ డీసవన•మేషముఁ బట్టుకపోవఁ ద్రాడువే
వదలిన వేగ వచ్చి మన•వాసముఁ జొచ్చుక చిక్కకుండినన్
బదపడి తల్పు మూసికొనఁ • బల్మరు మేషము ద్రిప్పలాడెడిన్. 243

క. చూడు మని చూపి పాపినఁ, బోఁడు కడు స్నిగ్ధ మేక•పోతునుఁ బట్టి
మ్మేడకుఁ బోవలెనో యని, చేడియ చెప్పిన నతండు • చిఱున వ్వొలయన్. 244

తే. తరిమి మేషంబు పట్టిచ్చి • తరలు మయ్య
బ్రాహ్మణోత్తమ యని పంపి • భార్యమీఁద
సందియము లేక యెప్పటి•చందమునను
వేడ్క లిగురొత్తఁగా నుండె • వెలఁదిమగఁడు. 245

క. ఈమర్యాదఁ జరింపం, గా సుహిమ యొకింత నీకుఁ • గల్గినభూమి
స్వామినిఁ జేరఁగఁ బొమ్మని, హేమావతితో మరాళ • మి ట్లనువేళన్. 246

సీ. కృకవాకుకంఠకీ•చకనివృత్తకదంబ, కములకుఁ బడమటి•కడమరుత్తు
బహుళనిద్రాముద్ర•పద్మకాననపద్మ, భవ నను మేల్కొల్పు • పాఠకుండు
చక్రవాకద్వంద్వ•సంబంధసంధాన, శేముషీభూషణ•చేటకుండు
సురమార్గదీర్ఘికాం•తరతీరబిసఖండ, భక్షణాయాతవ•లక్షపక్షి
తే. భూరికైరవవనరమా•ముఖవివర్ణ, భాజసంపత్కరం బైన • పగలువత్తి
కలటలెదస్రుక్కఁ జోరులు • గుట్టలెక్క, వేగ జనియించె జిగినిక్క • వేగుచుక్క.

చ. అపుడు కథాచమత్కృతికి • నద్భుతయై తలఁ ద్రిప్పి యద్దిరా
నిపుణత తద్ద మెచ్చఁగల • నేర్పరి వౌ దని పల్కి యంత న
చ్చపలమృగాక్షి దివ్యమణి• సౌధములో విరిదమ్మిపాన్పుపై
విపులనృపాలమోహపరి•వేదనచే శయనించెఁ బొక్కుచున్. 248

వ. ఇట్లు శయనించి కొంతదడవు నిద్రించి హేమావతి రాజదూతి యగు హేలతో ముదంబున ని ట్లనియె. 249

చ. కలయొక యేనుగంటిఁ గల•కంఠసుకంఠిఘకాశ్వకేళికా
కలితకశాకలాపపతి•గాఢభుజాపరిరంభణక్రియా
సలలితపారవశ్యసుఖ•సంభ్రమగుంభనజృంభమాణపుం
గలనల మేలుకొంటి రవి•గంటి నకుంతతరోదయోపరిన్. 250

వ. అనిన హేమావతిం గాంచి నీయిష్టంబు శీఘ్రంబునన యీడేరు నని దూతి చెప్పిన విని సంతోషించి యమ్మగువ క్రమ్మర దినాంతంబున. 251

తే. నీల కాకోల కాకోల • నీలనీల, కంఠ శ్రీకంఠ శ్రీకంఠ • ఘనఘనాఘ
ఘనఘ నాఘ ఘటాఘట•ఘటనరుచుల, పెంపు గనిపించు చీఁకటి• పేర్చువేళ. 252

క. నలుగిడి కుంకుమపిండిని, దల సంపెఁగనూనె నంటి • తావులగంధా
మలక మొసఁగి పన్నీటం, జలకం బొనరించి చల్వఁ • దడి యొత్తి వెసన్. 253

సీ. చీనికలంకారి • చీట్రికుచ్చులమీఁద, సిరిమించు సరిగంచు•చీరగట్టి
కొదమరాచిల్కలఁ • గూర్చి తీర్చినసీమ, సవుతు మేల్పని చల్వ•రవికె దొడిగి
తళుకుమానికపుని•ద్దాచెక్కడపుపైడి, సొమ్ములు నెమ్మేన • నెమ్మిఁ దాల్చి
కమ్మనెత్తావి చొ•కాటంపుకలపంబు, నెరనీటుగా మెడ•నిండ బూసి

తే. తురుములోపల నరవిరి•సరులు దురిమి, వేడ్కఁ గపురపుబాగాలు • వేసికొనుచు
గులుకుజిగిబిగివగవింత • గొలుపవచ్చె, బోఁటిలావణ్యమదనవ•ఘూటిఁ బోలి. 254

క. వచ్చి తనమ్రోల నిలిచిన, యచ్చపలమృగాక్షిఁ జూచి • హంసము భళి ని
న్మెచ్చితి నీసొగసువరుస్, మెచ్చుము కథ విని యటంచు • మేలఁతకు ననియెన్. 255

## ఇరువదియవకథ.

క. ఉజ్జయిని యనఁగ నొకపుర, మిజ్జగతిఁ బ్రసిద్ధికెక్కు • నిద్ధవిభాసం
పజ్జలజరాగహర్మ్యచ, రజ్జారాలింగితాప్స•రఃస్త్రీగణమై. 256

మ. నెలరాలోవలుచిల్కపల్కుపనిప•న్నె ల్వన్నెచుత్తెంపుతా
పలకప్రంపుటనంటి మొగ్గమగరా•బల్జోచిదిదంతంపుసి
స్తులు గుల్కం బవడంపుచాపులు రహిం•చున్ గెంపురాయోడుబి
ళ్లల నిద్దం బగు నిల్వుటద్దములమేఁడ ల్వేన వే లప్పురిన్. 257

చ. పురవనభూజపుష్పఫల•ముల్ గొనువేడుకఁ బూని తద్రుమో
త్కరములమీఁది కెక్కి సత•తంబును దండల నుండు నందన

స్ఫురదురువృక్షపంక్తి సుమ•ము ల్వెసఁ గైకొని కొప్పులం దలం
కరణ మొనర్తు రాపురిని • గల్గినభిల్లసుపల్లవాధరల్. 258

వ. ఇట్టిపురంబున. 259

మ. చతురోపాయసమర్థుఁ డప్రతికళా•చాతుర్యధుర్యుండు వి
శ్రుతకార్యజ్ఞుఁడు రాజనీతిపథద•క్షుం డింగితజ్ఞానుఁ డ
ద్భుతశక్తిత్రయపారగుండు గుణసం•పూర్ణప్రభావుండు సం
తతభూపాదరణీయుఁ డొక్కరుఁ డమా•త్యశ్రేష్ఠుఁ డుండుం బురిన్. 260

తే. అతనినామంబు బహుమానుఁ • డంద్రు జనులు, మానినీరత్నమ పరాకు•మాని వినుము
భర్తృహరిచెంగటను గీర్తిఁ • బరగునట్టి, మంత్రిజనులందు మేటి యా•మంత్రిబోఁటి.

సీ. నిర్ణయం బాబ్రహ్మ•నిర్ణయంబు స్వమాయ, విష్ణుమాయయు జర్య•కృష్ణచర్య
వాక్యంబు శ్రీరామ•వాక్యంబు దృష్టి యీ, శ్వరదృష్టి దీప్తిభా•స్వంతుదీప్తి
బల్మి భీమునిబల్మి • సద వింద్రపదవి స, త్యము హరిశ్చంద్రుస•త్యము ప్రతిజ్ఞ
రాముప్రతిజ్ఞ ధైర్యము మేరునగధైర్య, మాజ్ఞ సుగ్రీవాజ్ఞ • ప్రజ్ఞ గురుని

తే. ప్రజ్ఞ బలము సుయోధను•బలము కట్ట, డన భరతుకట్టడి కలిమి • ధనదుకలిమి
గాఁగఁ బతి మెచ్చ నఘటన•ఘటనపటిమ, నమ్మహామంత్రి రాజ్యభా•రమ్ము దీర్చు.

వ. మరియు గురుమహాప్రధాన సామంత సేనాపతి ద్వారపాల కావసరిక ఘటి కానిర్ధారి క గణక లేఖక పౌరాణిక పురోహిత జ్యోతిష్క కార్యజ్ఞ విద్వాంసక దేవతార్చక మాలాకారక పరిమళకారక చేష్టాధికార గజాధికా రాశ్వాధికార భాండాగా రాధికార ధాన్యాధికా రాంగరక్షక సూత సూద భేతాళ మత తాంబూలిక తాళవృంతక నరవాహక చ్ఛాత్రిక దామరిక కళాంచిక శరశారిక కీరమాలిక పాదు కాధార నర్తక గాయక వైణిక శాకునిక మాగధ వైతాళిక స్తుతిపాఠక పరిహాసక క్షౌరక రజక సౌచిక చర్మకారక ముద్రాధికార పురపాలక వనపాలక గజవైద్య అశ్వవైద్య పశువైద్య భేరివాదక మురజవాదక కారక కుంభకారక చిత్రకారక వ్యవహారిక మృగయారి పక్షివాహిక ఫణిహారి కోగ్రాణాధికార వైశ్యజనంబు లాదిగాయైన డెబ్బదిరెండు వినియోగంబులవారు సేవింప నతండు వెలయుచుండు. 263

ఉ. వానికిఁ గొన్నినాళ్ల కిల • వార్తకు నెక్కినవాఁడు రూపరే
ఖానవపంచబాణుఁ డన•గాఁ దగు చక్కనివాఁ డొకండు స
న్మానవిభూషణుండు సుకు•మారుఁడు దైవకటాక్షవీక్షణా
నూనకృపాప్తిచే గలుగ • నుత్సవ మొప్పఁగ బెంచి రెంతయున్. 264

తే. పెంచియెలప్రాయ మొదవఁగాఁ•గాంచియతని, పెండ్లి సేయుదమనుచుసం•ప్రీతినొందు
తల్లిదండ్రులతో బంధు•తతులతోడఁ, బరిణయము నొల్ల నే నని • పలుకుచుండు.

ఉ. వారలు పెండ్లి యేమిటికి • వల్లనటంటి పటంచుఁ బల్కినన్
వారలకాతఁ డిట్లనియె • వారిజనేత్రల నమ్మరాదు మా
యావచనాప్రవీణలు ప•రానుగతేచ్ఛ లొకింత యే మనన్
వారక నాఁడురూపములు • వ్రాసినయింటను నిల్తురే బుధుల్. 266
క. కుల మెంచ రాడికోళ్లకుఁ, దలకరు సడి వావివరుస • దలచరు నీతిన్
దలకొనరు సత్యమాడరు, కలకంఠులు వారి నమ్మఁ•గా నెటు వచ్చున్. 267
ఉ. చన్నులకన్న మున్పొడము • సాహసము ల్పెళికించు దృష్టికిన్
మున్నుగఁ బుట్టుఁ బెద్దలను • మోసము పుచ్చు మనీషయాపనా
సన్నతకన్న మున్నె యగు • సత్య మసత్య మసత్య మెన్నఁగాఁ
దిన్నఁగ సత్య మంచు ధృతి • డీకొను ధీరత పువ్వుబోండ్లకున్. 268
ఉ. టెక్కులు నెమ్మెలున్ సొగసు • తీవియు నాగరికంబు నిద్దపుం
జక్కఁదనంబు జవ్వనము • సంపద సొంపు వినోదపున్వగల్
చొక్కపువైఖరు ల్సతుల • కూడిదె చాతురి గల్గువారికిన్
దక్కినయట్లు భర్తలకు • దక్కరు నిక్కువ మింతు లెంతయున్. 269
తే. గరగరిక నుండు మోహనా•కారవిభవ, శుభవయః పాకపురుషులఁ • జూచినపుడె
దృష్టి వారలపై నిల్పి • తెవులు లేని, దళలఁ గృశియింతు రింతుల • దర మెతెలియ.
క. అని పల్కెడు తత్పుత్రునిఁ, గనుఁగొని తలిదండ్రు లాప్త•గణములు బంధుల్
వనితాభిముఖునిఁ గాఁ దమ, యనుపమచాతురి నొనర్చి • రతిసంప్రీతిన్. 271
క. కులగుణరూపప్రజ్ఞా, దులు గల కన్యకలమాన•ధూర్వహసంజ్ఞన్
జెలఁగిన యతనికిఁ బరిణయ, మలరఁగఁ గావించి రంత • నతఁడు నిజాత్మన్. 272
తే. నెలతలను నమ్మరా దని • నిశ్చయించి, పోఁతుటీఁగెకు నైనను • బోవరాని
యొంటికంబపుమేడలం • దునిచెఁ దత్స, తీద్వయంబును హితసఖు • లైలిసి ప్రోవ.
వ. ఇత్తెఱంగున నన్యులఁ బొంద శక్యంబు గానిసౌధంబుల నిజభార్యాద్వయంబును వే
ర్వేరఁ గాఁపురం బుంచి తత్పరిపాలనార్థంబు పెద్ద లగుహితవయస్యల నియమించిన
నచ్చెలికత్తె లత్తీఱున నన్నపానాద్యుపచారంబులఁ బోషించు చుండు నెడ భువన
మోహనాకారం బైన యవ్వనోదయంబు సంభవించిన. 274
సీ. కంధర కమలారి • కార్ముక సంజాత, కాంచనకంబుల • గర్వ మణఁచి
పద్మరాగ పటీర • పద్మారి ఖండప, ల్లవ పద్మముల సము•ల్లాస మెంచి
వజ్రవల్లీ ద్వయ • వసుమతీ ధర వార, ణారి వారణ వసు•ధాళిఁ గేరి
కదళికా కాహళ • కచ్ఛప కలకంఠ, కనక కర్పూర సం•ఘముల మీటి

తే. కచముఖ భ్రూనయన నాసి•కాగళోష్ఠ, పరిమళ కపోల కోమల•పాణిదంత
బాహుకుచమధ్యగతినితం•బాంకజాను, పదపచోంగ స్థితము లొప్పు • భామినులకు.

చ. తరుణులగౌను లాకృతులు • తళుకుమొగంబులు చన్గవ లువ్వా
క్సరణులు పాణులున్ మెడలు • సారనితంబము లారుకేఖలున్
దరళవిలోచనంబులు ప•దంబులు మేలు మిణుంగు లారయన్
హరికమలాబ్జచక్రనివ•హంబు నయంబు రయంబున న్నగున్. 276

సీ. ధరజయోన్నతి మించెఁ • దనరు చన్నులు కృష్ణ, వర్ణఘనాకృతి • వఱలె నెరులు
కనుబొమల్ ధర్మవి•ఖ్యాతిఁ గైకొనె ముఖం, బులు నిశాకరకళా•కలనఁ గనియె
జలవరసంభ్రమం•బుల గేరె నాభులు, కటులు మహాబలో•త్కటతఁ దనరె
నీలకంఠప్రియ•శ్రీ లందె నారులు, గజరాజగతిఁ దాల్చె • గమనగరిమ
తే. యమరకాంతల లీలల • నవయువములె, పరిహసింపఁగ మెఱయు న•ప్పద్మపత్ర
సదృశనేత్రల కిఁక ధరా•స్థలిఁ జెలంగు, చెలువ లన నెంతహాసని•ర్జితలతాంత. 277

సీ. మెఱుఁగుమోములు ప్రభా•కరబలంబు వహించె, లపనము ల్చంద్రబ•లంబుగాంచె
జఘనము ల్వసుమతీ•జాతబలం బందె, గలితబుద్ధులు సౌమ్య•బలము జెందె
గురుబలంబు భరించె • గుబ్బచన్గవలు న, ఖంబులు శుక్రబ•లంబుఁ బూనె
మందబలంబు స•మ్యగ్యానములు దాల్చె, స్వర్భానుబలము క•చంబు లొందె
తే. నతను కేతుబలం బూనె • నలరు కన్ను, లిట్లు సకలగ్రహబలా ప్తి • నెనసియు సుమ
నోజబలవేధఁ దత్సతుల్ • నైజనాథ, బలము చాలక కోరిరి • పరబలంబు. 278

వ. ఇవ్విధంబున నివ్వటిల్లి యౌవనగర్వాతిరేకంబున నిర్మానుష్యంబు లగుసౌధాంతరంబుల నుండుటం జేసి పంజరబద్ధకీరంబులదారిని నపారజారవిహారవిచారపూరితమానస లైన యామానసకాసారగభీరనాభులు స్వాత్మగతంబున. 279

క. పతిరతిఁ దీఱదు తమి పర, పతి రతి యేరీతి దొరకు • భావంబునసం
గత మగు నీ వెత దీర్చెడి, హితవరు లెవ రని తలంచి • రెంతయు వంతన్. 280

సీ. అమరతిర్యగ్జాతు•లందైన వేయక, నరజన్మ మేల యం•దఁగ నొనర్చె
నొనరించుఁ గాక నిం • పొదవంగఁ బురుషులఁ, జేయక మమ్మేల • స్త్రీలఁ జేసెఁ
జేయుఁగాక రతిచ్ఛఁ • జెందువానికిఁ గూర్ప, కీరీతి నిర్మోహి • కేల కూర్చెఁ
గూర్చెఁ గాక యథేచ్ఛ • గొని జరింపఁగ నుంచ, కీదుర్గమస్థలి • నేల యుంచెఁ
తే. గటకటా మాయె డాపాప•కఠినహృదయుఁ, డాయెఁ గాఁబోలు వాణీశుఁ•డటులగాక
యున్న ని ట్లేలచేయు నం•చువిద లాత్మఁ, బరితపింతురు మరుబారి•విరహ మొదవ.

వ. ఇట్లు తమకు వలయునెడఁ బడఁతుల గొడవ తడవని తమయొడయఁడు తమ్ము మిగులఁ గూడి యాడి యుండమికి దుర్గమస్థలసంస్థిత లగుట జారక్రీడకుఁ బొసఁగమికి గంతు శర సంతత సంతాపంబునకు సంతపించుచుఁ జిన్ననాఁటనుండియును దమ్ము నెత్తి పెంచిన దాదులకుసైతము నెఱుంగనీయక నొండొక తెఱంగున నయ్యంగనలు మెలంగు చుండి రయ్యెడ సువర్ణయను తదగ్రభార్యమోహంబున మదనాదుల నుద్దేశించి తన మనంబున. 282

సీ. నీసుమశరములు నీసునుసమహాస, నీసుమతిని నేయ నేల మదన
నీరాక కులుకున నీ్నిరాక విడకపో, నీరాక శాకల నీరజారి
ఘనమార్గ ముడిగించి ఘనమావఘావధ, ఘనమావిషాపాది వనుచు నిన్నుఁ
బవమానకరుణనిం పవమానగతిఁ జరిం, పవమానమున కల్కు పడవు నీవు
తే. మధురధర్ముఁడు సర్వజ్ఞమాళి సురప, థానువర్తి మహాబలుం డనెడు నిజమ
హాత్మ్యసులు మాని యిట్లు స్త్రీహత్యఁ జేయు, చున్నమీరీతి యెవరైన విన్ననగరె.
క. తారాధిప రజనీకర, కైరవభేదన విచక్ష గారీశ శిరో
దూర కమలానురంజన, కారణ వారాశి భంగ కారాభ్యుదయా. 284
వ. పరిధిమిషంబు మూలికల బంతి కలంకపుకావుబొట్టు భీ
కరకిరణంబులర్ జడలు కాముపిభూతియుఁ దాల్చి మంత్రివై
విరహులఁ జంప సాగితివి వే యన నేమిటి కూరుమొక్కుచేఁ
బరఁగిన తోడుబోఁతులరపం బనుమాట నిజంబె పో శశీ. 285
క. కీరమణీ నీకోడక, కీరమణీ రత్న మిదియ కిల్బిషమతివే
కీరమణీయపుచనువు ఞ, కీరమణా కాని వారె కీరాలాపల్. 286
తే. మాటిమాటికి వేడు నీమాటిమెడలఁ, జాటి దప్పినవార లేపాటివారు
గావున దయార్ద్రబుద్ధి న న్గావు నీకుఁ, దేటి నామీఁదఁ గోప మింతేటి కరయ.
క. పికమా ఘోరాకృతి చూ, పిక మాదృశవిరహిణుల రతీశ మహోద్దీ
పకమార్గము చూపఁగ నో, పికమానస మాని యేచ బింక మె నీకున్. 288
వ. అని వెండియు నయ్యండజయాన పెక్కుతెఱంగుల నయ్యనంగుని సైన్యసమేతంబుగ బలుకుచున్నసమయంబున దైవయోగంబున. 289
ఆ. ఆసువర్ణమందిరాంగణమున నొక్క, పాదుకాద్వయంబు పడియె నంత
దానివెంబడిన మహీనిర్ఝరం డొకఁ, డతిరయమునఁ బడియె నంగమద్రువ. 290
వ. ఇట్లు పడిన యప్పుడమితెరగంటి కొమరు నత్యనుపమమోహనాకారు నిరీక్షించి భయవిస్మయహర్షాదులు ముప్పిరిగొను చిత్తంబున డాయం జని యొంటిపాటగుట విభి

ఘోపచారంబుల సేద దీర్చి నీ వెవ్వండ వి ట్లిందుఁ బడుటకు నిమిత్తం బేమి యనిన
నాసువర్ణకు నతం డిట్లనియె. 291

మ. హిమవత్పర్వతమందు మండుఁ డనుమా•నీంద్రుం డొకం డుండు సం
యమిచంద్రుండు తపఃప్రభావుఁ డల స•న్యాసిక్ వేసక్ మోసపు
చ్చి మహాభ్రష్టలివాయువేగమున వేం•చేయుక్ సమర్థంబులై
యమరం బావలు తాను బూని చనుచో • నాకాశమార్గంబునన్. 292

ఉ. మున్నలవాటులేమిఁ బద•ముక్తములై పడె నిందు పావలే
నున్నిలు పోపలేక దివి•నుం డిట వ్రాలితి నట్టిపావలెం
దున్నవొ చూపు మం చనిన • నుగ్మలియుం దొకచోటఁ గాంచె మేల్
సొన్నపుసన్నపుం బనుల•సొంపు ఘటింపఁగఁ జాలు పాదుకల్. 293

వ. వాని గ్రహించి యచ్చంచలాక్షి యాహారాదివిధులసంతుష్టుం జేసి యాబ్రాహ్మణకుమా
రు నెత్తుకొని తత్పాదుకాసామర్థ్యంబున నిలయనికటనిజపతికేళికారామంబు చేరి
తదనంతరంబ. 294

ఆ. తగినప్రహరిగోడ • దక్షిణోత్తరముల, నలరు వెడఁద కూట • మంద మొందు
మందిరంబు గాంచి • యం దొక్కయుఱఁ దన, పడకటిల్లు చేరెఁ • బద్మనయన. 295

ఉ. అం దొకకొంతసేపు వసు•ధామరపుత్రునితోడ వేడుకక్
గెందలిరాకువిల్తు రణ•కేళులఁ దేలి యజస్ర మిట్లు పొ
ల్పొందిన యిప్పురంబున శు•భోన్నతిచే వసియించినక్ రతిక్
జెంది సుఖించు నీ వితర•చింతలు మానుము భూసురాగ్రణీ. 296

క. నీ కితరభయంబులు రా, నీక మెలంగుదు నటంచు • హితవు గరపి బి
బ్బోకిని యతనికి ప్రియమున, కై కొంతపదార్థ మిచ్చి • యనిచెక్ బురికిన్. 297

వ. ఇ ట్లతని బ్రియపూర్వకంబుగా నాదరించి సెలవొసంగి క్రమ్మర దనయిల్లు చేరె నివ్విధం
బునఁ దత్పాదుకాసామర్థ్యంబున. 298

క. కేళీవనమున సముచిత, కాలంబున నతనితోడ • గంతురణక్రీ
డాలలితసౌఖ్యవారిధి, నాలోలమృగాక్షి యోల • లాడుచు నుండెన్. 299

వ. ఇవ్విధంబునఁ బ్రథమభార్య సుఖించె నంత ద్వితీయభార్య యగు సుప్రభయు సప
త్నిరీతినుండియుఁ బరపురుషవాంఛ వొడమి కడుమిడుకుటం జేసి యేచందంబునం
బ్రొద్దువోక యొక్కనాఁడు సౌధాగ్రంబున. 300

క. ఆసుప్రభ సంగీతక, ళాసరసత గలది యాట • లలితముగ నము
ల్లాసమున వీణ మీటుచుఁ, జేసెక్ గానంబు సౌధ • శిలలు స్రవించన్. 301

క. సురపథమున నపు డొకముని, యరుగుచు నిజగాననిస్వ•నాకర్ణనవి
స్ఫురితానందంబున నట, కరుదెంచిన లేచి చూచి • యతనికి మ్రొక్కెన్. 302

తే. మ్రొక్కి నిలిచి వనిత • మునితో స్వవృత్తాంత, మంత మనము గరఁగు•నటులఁ దెలిపి
దేవ నీవు రతులఁ • దేలించి ననుఁ బ్రోవు, మనుచు వేడుకొనిన • నబలఁ జూచి. 303

తే. నేను విజితేంద్రియుండను•గాన సతులఁ, జెందఁ గారాదు నాకుఁ బూ•ర్ణేందువదన
యైన నీయిష్ట మీడేరు • నట్టి నేర్పు, తెలియఁ జెప్పెద విను మని • తెరవ కపుడు.

వ. కారుణికాగ్రేసరుండై యొక్కసిద్ధమంత్రంబు చెప్పి యీమంత్రస్మరణంబున వలయు
నెడకుం బోయి రావచ్చుఁ గావున నీవాంఛితంబు దీనఁ దీర్చుకొ మ్మని యానతిచ్చి
మౌని విచ్చేయుడు నంత నాకాంత యత్యంతసంతోషంబున నొంటిపాటైన సమ
యంబున. 305

క. ఆరాజన్మంత్రస్మృతి, నారామము చేరి యున్న•యపు డచ్చటికై
చేరినఁ దద్వనపాలుని, మారసమాకారుఁ జూచి • మది ముద మొదవన్. 306

తే. ఓరచూపులఁ జిన్నెల • బేరజముల, మనసు గరఁగించి తనమీఁద • మరులు కొలిపి
వాని దోడ్కొనిపోయి యా•వాలుగంటి, కడమయరలోన రతికేళిఁ • గలసి చనియె.

క. అదిమొదలు వానిఁ గవగొని, మదవతి యారామమధ్య•మందిరమున నిం
పొదవఁగ రమింపఁ దొడఁగెను, మదనుఁడు విల్లెక్కుడించి•మరలి చనంగన్. 308

ఉ. అంతట నొక్కనాఁటినిశి•యందు శశిగ్రహణంబు గానఁ ద
చ్ఛాంతికి స్నానదానములు • సల్పను వేఁపజాము వచ్చుప
ర్యంతము పట్టునం దనుక • రాఁ డిపు డింటికి నాథుఁ డంచుఁ దా
దెంతయు వచ్చి చెప్పిన మృ•గేక్షణ లాత్మలవేడ్క లూనుచున్. 309

వ. ఒంటిపాటై యున్నసమయంబున. 310

తే. జలక మొనరించి జిలుగువ•ల్వలు ధరించి, కమ్మనెత్తావి కలపంబు • కలయ నలఁది
యలవిరులఁగొప్ప లమరించి • యారగించి, తమసమర్థతఁ దద్వనాం•తరముఁ జేరి.

క. ఒకరి నొక రెఱుఁగనీయక, సకియలు పడకిండ్లు చేరి • చాశీతిసుబం
ధకళానైపుణి నుపనా, యకులతో రతికేళిఁ బెనఁగు•లాడిడివేళన్. 312

సీ. ఫణిరాజతల్పంబు•పైఁ బద్మనాభుండు, తిన్నగా శయనించు • వన్నె దెగడి
తనరు శ్వేతద్వీప•మున గాఢతమి నొక్క, దెసనుండి పర్వెడు • పస నాసించి
క్రమమునఁ బుష్పగు•చ్ఛముమీఁద మగతేఁటి, మొత్తంబు వ్రాలెడు • దత్తుమీఱి
హిమశైలతుంగశృం•గమున నీలాభ్రంబు, పర్యాయమునఁ గప్పు•భాతి మెఱసి

తే. సార కర్పూర డిండీర • హారహీర, తారకోదార ధవళాంశు•వారకలిత
నీరజారాతిబింబము • న్నిద్రరౌద్ర, గతిఁ గ్రసించెను రాహు వ•క్త్రాలమునను.

సీ. మంత్రికుమారుఁ డా•మానధూర్వహుఁడు ది, వ్యౌషధం బవ్వనం • బందుఁ గలుగు
కెఱిఁగి యుండుటఁ జేసి • హితమిత్రపరిజనా, న్వితముగ దివ్వటీ • ల్వెలుఁగ నేగి
బదనిక గలపాద•పము జూచి యది తీసి, కొని రండు పొం డని • కొందఱ హిత
వరుల నంపించి వా • రరుదెంచునందాఁకఁ, దా విశ్రమింపఁగాఁ • దలఁచి తనదు

తే. సతుల కెప్పుడు సంకేత•సదన మైన, తద్వనీమధ్యసద్మంబు • దండ కరుగఁ
బ్రస్ఫురత్కరదీపికా•ప్రభలు సూచి, పరు లెవరొ వచ్చి రని యుప•పతులు వడఁక.

తే. వెరవకుఁ డటంచు వెరవుచే•వెన్నుఁ జఱచి, యుపపతుల నిండ్లలోన నె•యుండఁ జేసి
నిలయములనుండి వెలువడి•నెలఁతలు తన, కెదురుగా రాఁగ మది కోప•మొదవఁ జూచి.

తే. పరుల కటు తొంగిచూడను • బాటుగాని, దుర్గమస్థలి నుండెడి • తోయజాక్షు
లివ్వనంబున కేరీతి • నెమ్మె మెఱసి, వచ్చినా రనుసందియం • బిచ్చ బూని. 316

తే. ఇమ్మహానిశి నిచ్చోటి • కేమిపనికి, వచ్చితి రటంచు గద్దించి • హెచ్చరించు
తోడవల్లభుని నవ్వేళ • వనిత లెట్లు, బొంకి పోవలె నెఱిఁగింపు • పంకజాక్షి. 317

క. అని యడిగిన హేమావతి, తనతల గదలించి తెలిసి • తా నిది వివరిం
పను జాల నీవె తెల్పుము, వినియెద నన హంస మపుడు • వెలఁదికి ననియెన్. 318

తే మానధూర్వహుఁ డప్పు డా•మానవతులఁ, గాంచి వీరలు మత్కల•కాంత లనుచు
నిశ్చయించుక రౌద్రని•ర్ణిద్రబుద్ధి, మీర లివ్వేళ నిట కేల • చేరినారు. 319

ఉ. చెప్పడు చెప్పకున్న మిముఁ • జిత్రముగా వధియింతు నంచు తేఁ
డప్పుడు తమ్ము రొప్పిన భ•యంబు వహించక యాసుపర్ణసాం
పొప్పఁగ భర్త కి ట్లను సు•ఖోన్నతలీలల నివ్వనంబునన్
దప్పక సంచరించు వన•దైవతకాంతల మమ్ముఁ జుల్కఁగన్. 320

క. నీమనమున మద్భామిను, లీమగువ లటంచు మమ్ము • నెంచితి వాదిన్
మేము భవదీయసతులము, గా మస్మత్కళలు నీదు • కామిను లనఘా. 321

వ. అదియునుంగాక. 322

క. ఈయెడ మేము చరింపను, మాయంశమ్ముల జనించు • మదిరేక్షణలన్
నాయిల్లాం డ్రని పల్కితి, వే యేమి నిమిత్త మనిన • నెఱిఁగింతు మొగిన్. 323

తే. చైత్రరథమున మును మేము • సరసగతుల, సంచరించగ నవ్వేళఁ • జైత్రుఁ డచటి
కరుగుదెంచినఁ గాంచి యు•నాదరమున, లేవకుండిన సక్రోధ•లీలఁ జూచి. 324

తే. సాపరాధుల మమ్మా♦సంతుఁ డరసి, మర్త్యసేవను నూఱేండ్లు ♦ మహిని మెలఁగు
డని శపించినఁ బ్రత్యక్ష♦మటుల నుండఁ, జాలమని మేము ప్రార్థింప♦సదయుఁడగుచు.

సీ. ఆరీతి మీరు ప్ర♦త్యక్షంబున మెలంగ, కున్న నేరం బేమి ♦ యువిదలార
మీయంశములఁ బుట్టు ♦ మెలఁతల మానభూ, ర్వహుఁడను బహుమాన♦షరకుమారుఁ
డగువిప్రునకు భార్య♦లై యుండ నియమింపుఁ, డని తెల్పి యావేల్పు ♦ చనిన నచటఁ
గూర్మితో నీకు మే ♦ ల్గోరుచు నున్నవా, రము సువర్ణ యన సు♦ప్రభ యనంగ

తే. మామకాంశముల జనించు ♦ మనుజసతులు, నీకుఁ గులకాంత లైనారు ♦ నిక్కమిదియ
రూపయౌవనసంపదా♦రూఢి నీదు, చానలకు మాకు భేద మిం♦తైనలేదు. 326

తే. ఇట్టిచుట్టరికం బుండు ♦ టెఱిఁగి కాదె, నిను సహించితి మితరభూ♦జనులు మేము
మెలఁగుచోటికి నివ్వేళఁ ♦ బొలసినపుడె, చెడ శపింతుము నీ వింక ♦ సుడియరాకు.

క. చుట్టరిక మెంతగలిగిన, రట్టున రారానియెడకు ♦ రా వారలపై
నెట్టిసుబుద్ధులకైనను, బుట్టును రోషంబు దానఁ ♦ బుట్టుం జెట్టల్. 328

క. కావున నీ విచటికి నిఁక, రావలదు వసంతశాప♦రహితలమై మా
దేవవని కేగినంతట, నీ విట నెమ్మదిఁ జరింపు ♦ నీయాప్తులతోన్. 329

క. అని సంతోషము భీతియు, జనియింప సువర్ణ పలుకు ♦ జాడనె పలికెన్
వనితామణి సుప్రభయును, విని తద్వాక్యములు మాని ♦ విభుఁ డపుడాత్మన్. 330

ఆ. ఏపు జవ్వనంబు ♦ రూ పొక్కటై యుండు, టాత్మసతులు వీర ♦ లనుచు నుంటి
నేము నీసతులము ♦ గా మన్మదంశజ, లీలతాంగు లనిరి ♦ దేమొ సతులు. 331

క. ఇంటికిఁ జని కనఁదగు వా, ల్గంటుల నీపలుకు లాత్మ♦కామిను లింటం
దొంటిగతి నున్న సత్యా, బింటను లేకున్నఁ గలయ ♦ యిది దృఢ మరయన్. 332

ఆ. అనుచు నిశ్చయించి ♦ యతఁ డింటి కేగెను, వానికన్న మున్నె ♦ వనజముఖులు
నిజసమర్థతాప్త♦నిలయంబులకుఁ బోయి, పవ్వళించి యుండి ♦ రవ్విభుండు. 333

చ. వెసఁ జనుదెంచి యింట నలి♦వేణులఁ గన్గొని తద్వధూవచో
విసరము సత్యమా యనుచు ♦ వేడుకఁ గైకొని తప్పునిద్రలుం
బసగల హంసతూలికల♦పాన్పులపై శయనించి యున్న యా
త్మసతుల లేపి తొంటివని♦తావిముఖత్వము మానె మానినీ. 334

తే. అరమరలు లేనికూటమి ♦ నధిపుఁ డపుడు, కులవధూటుల నెంతయుఁ ♦ గుస్తరించి
పచ్చి పగదేరు రతులతో♦నిచ్చ నిచ్చ, లిచ్చకము పుట్టఁ జేయుచు ♦ నెనసి యుండె.

క. ఈమహిమ నీకుఁ గల్గిన, భూమివిభుర్ రతులఁ గలయఁ ♦ బొమ్మని హంస
గ్రామణి వినిపించిన విని, హేమావతి మెచ్చుకొని ఖ♦గేంద్రుని కనియెన్. 336

తే. జనపతిని జేరఁ బోనీక ◆ దినము దినము, కతలు చెప్పఁగ సాగి తో ◆ కతలకారి
చిన్ని రాయంచ యీఁకనైన ◆ సెల వొసంగు, పోయి వచ్చెద నన హంస ◆ పాలఁతికనియె.
క. ఇరువదిదినముల కింట్రికిఁ, బరతెంతు నటంచు నీదు ◆ పతి చనుచో నా
కెఱిఁగించె రే పవశ్యముఁ, బరతెంచును గాన నీకుఁ ◆ బరవం దగునే. 338
చ. నరపతిఁ జేర దర్పకర ◆ ణక్రియలన్ దగఁ బ్రొద్దువుచ్చి ని
ద్దురగొని యైనరాజు నినుఁ ◆ దోడనె పాయఁగ లేఁకఋర్తిమం
దిరమున కేగుమం దనక ◆ నిల్చిన నిల్చుటనైన నింటిలోఁ
దెఱవరొ నీవు లేమి నరు ◆ దెంచిన నీపతి కేమి దోఁచునో. 339
క. కావున భూవిభుఁ జేరన్, బోవుట కార్యంబు గాదు ◆ హమ్మింటి కటం
చావనజాక్షికి హంసధ, రావరమణి దెల్ప నపుడు ◆ రవి యుదయించెన్. 340
తే. అంత హేమావతియుహృద ◆ యాంతరమున, భూమివిభుమీఁది మోహంబు ◆ పొంగిపొరలఁ
బడకయిలు సేరి వేఱొక్క ◆ పగిది నుండె, నపుడు తత్పతిసహచరుం ◆ డరుగుదెంచె.
క. అదిగో నీపతి వచ్చెన్, ముదమున నగరోపకంఠ ◆ భూమిని విడిసెన్
సుదతి ననుజూచి రమ్మని, పదరక ముందుగను నన్నుఁ ◆ బనిచెన్ నేడ్కన్. 342
క. అని చెప్పినఁ దద్వాక్యం, బనలశిఖాకీలతప్త ◆ మై చెవి నాటన్
ఘనభయవిస్మయలజ్జా, తనుహర్షభరాదు లాత్మ ◆ దగిలినవగతోన్. 343
ఉ. దిగ్గున లేచి నిల్చి సుద ◆ తీమణి భూవిభుమీఁదిబుద్ధితోఁ
దగ్గుచు ప్రగ్గ నిగ్గు సిరి ◆ తగ్గని తామర మొగ్గదోయి బల్
జగ్గుల కెగ్గు నిం పెసఁగు ◆ చక్కనిచిక్కనిగబ్బిగుబ్బలున్
నుగ్గడితంబు పయ్యెదయు ◆ నొప్పగుఁ గ్రొమ్ముడి చక్క దిద్దుచున్. 344
ఆ. ఓడబేరమాడ ◆ వేడుక నే నేగి, నదియు మొదలు శుభమె ◆ యందఱకును
ననుచు బాంధవాది ◆ జనులయోగక్షేమ, మడుగ భద్ర మఖిల ◆ మనియె నతఁడు.
క. వెండియు నిట్లను మదవే, దండలసద్గమనతో సు ◆ ధారసధారా
పాండిత్యమండితోక్తులఁ, బండితమండలికిఁ జెవుల ◆ పండువుగాగన్. 346
క. జనపదములు పురగిరులున్, గనులు వను ల్నదులు నిధులు ◆ కట్టల్మిట్టల్
కనుమలు పేటలు తోఁటలు, మునుకొని కనుగొనుచుఁ బోయి ◆ ప్రోలన్ లీలన్.
సీ. ముజ్జగంబును బూత ◆ ముగఁ జేయ నగుధాత, వనభంగగంగ యె ◆ వ్వనికి భార్య
దేవాహనోత్సాహ ◆ దృఢకళాసందోహ, మున మించు చంద్రుఁ డె ◆ వ్వనికి సుతుఁడు
కడలేని సిరులీనఁ ◆ గలరమాగజయాన, యలరారు నెవ్వాని ◆ యనుఁగుకన్య
బహుళపద్మభవాండ ◆ పరిపాలనాఖండ, వాత్సల్యకారి యె ◆ వ్వనికి నల్లుఁ

తే. డట్టినక్రథులీకులీ॰రాళివాళ్ళ, రావనీయానకేళీమ॰హాబహూర్తి
మాలికాడోలికాపాళి॰కోల్లసన్మ, రాళికొల్లానికలశవా॰రాశిడాసి. 348

వ. సభయభక్తినమస్కారంబు గావించి తదుత్కటతటంబున. 349

సీ. జాతిలీలాయతి ॰ సకలాతి మేల్కట్లు, కాబలపసకిము॰ఖాబులోనఁ
బైతిణీజరబాబు॰పసలగోడసరాలు, మేలరబ్బీబమెఁక॰మాలుదిండ్లు
గోవబూర్నీసుని॰గ్గులబిల్లసంతన, బలుచీనిహొంబట్టు॰ప్రగ్గములును
దగుటుకమ్మీతాపు॰తానవాసు కనీదు, నేస్తు బందరుచీటి ॰ లస్తరీలు

తే. ఖాతువా జంబుఖాన మ॰ఖాతివాసు, లరల సుకదాసులబనాతు ॰ లమర దిండ్లు
కాంచనస్తంభములు రత్న॰కలశతతులు, వాళ్లులును గుజ్జుగుండాగు॰త్రాళ్లు మఱియు.

క. హితవరులతోడ యుష్మ, త్పతివేడుక విడిసి సకల॰పరిమళవస్తు
ప్రతతులు మౌక్తికవిద్రుమ, వితతులు మొదలైన రస్తు ॰ వెలఁ దీకొనియెన్. 351

సీ. తళుకుటద్దంపుని॰ద్దపునిల్వుటద్దము, ల్దంతంపుచువ్వన ॰ ల్తావులొలుక
నత్తరుఁ బునుఁగును ॰ నంబరు గాళిక, చ్చూరము ల్నఖము గం॰బూరచోవ
జల్లిసవరములు ॰ జిల్లరసము కదం, బము గోవ జవ్వాజి ॰ పచ్చిపునుఁగు
కుసువేరు పచ్చక॰ప్పూరము పన్నీరుబే, డెము మలాకెలు కుంకు॰మమును మంచి

తే. బుక్కకస్తూరివీణెలు ॰ చొక్కటంపు, టగరు సంపెంగనూనెలు ॰ నాదియైన
మెచ్చుగల దీవులందుండి ॰ తెచ్చినట్టి, వివిధపరిమళవస్తువు ॰ ల్వెలకుఁ దీసి. 352

సీ. ఖర్జురకలును బీం॰గాండ్లు తాబాణాలు, గిన్నెలు తబుకులు ॰ గిండ్లు స్తపన
పాత్రలు చట్లును ॰ బానపాత్రలు మేలు, చట్టువంబులు మంచి॰మట్టుగిండ్లు
సంపుటంబులు గొప్ప॰స్థాలీలు తబుకులు, కంచము ల్తట్లు ॰ గంగాళములును
చెంబులు పడిగముల్ ॰ చిప్పలు హస్తావ, ఘులు కంకణములు ఘం॰టలును గజ్జె

తే. లాదిగాఁగల్గు దీవుల॰యుంచు వెలయు, కంచరపుజాతివగవగ ॰ ల్మించఁజేసి
నట్టిసామగ్రి బహువెల ॰ ల్వెట్టికొనియెఁ, గాంతభూకాంతమణులకు॰గానుకఁ జేయ.

తే. వేఁడికొదమలవింతయా ॰ యేటిపునుఁగు, పిల్లుల జవాజిపిల్లుల ॰ బెట్టు రురుల
మ్రుంగిస సివంగి జోణంగి ॰ యింగిలీషు, కుక్కగుంపుల గోఁతులఁ ॰ గొన్ని గొనియె.

సీ. సంపంగికావులుఁ ॰ జంఘురుకావులు, వెలిపట్టు పుట్టముల్ ॰ వేఁటచాళ్లు
జిలుగుబొమ్మంచుల॰చీరలు నాచులు, నుదయరాగంబులు ॰ నురుతవన్నె
లొప్పుముయ్యంచుల॰పుష్పాళ్లు హొన్నంచు, పలువలుఁ గరకంచు॰వస్త్రతతులు
ముత్యాలపందిళ్లు ॰ నుత్తరగోగ్రహ, ణములు నిగమగోచ॰రములుఁ బద్మ

తే. పుతిలకలు నిండువన్నెలు • బొడలు బచ్చ, లును హారిణవళ్లు హంసవ•ల్లులును రంగ
వల్లు బొదలును సామంత•వదులు ననఁగఁ, దనరెడు పసందుపటములు•గొనియెవెలకు.

రగడ. చౌకట్లు నొంట్లు చే•సరులునర్క్ మొలకట్లు
రాకట్టుచుట్టుంగ•రములు బల్చేకట్లు
మురువు లొప్ప కిరీట•ములు మేటితాళీలు
నరిపణలు మించులును • సాటిలేనితురాలు
రంగుగల ముంగాము•రాలు నాభరణములు
నంగదంబులు మంచి•హంవీరతాయతులు
కంఠమాలికలు జిగి•గల్గు చేకడియములు
కంఠసరములు బిరుదు • గండపెండేరములు
నద్దంపుటుత్తిరిగె • లలరు చిరుగజ్జియలు
కుందనపుచెక్కడము • గుల్కు మణిఘంటలను
మితిలేనివెల తిడిన • మేఖలా లందియలు
చకచక ల్గలజాతి • సకలమణినికరములు
నకలంకవర్ణప•ట్టాంబరప్రకరములు
పీతాంబరంబులును • జేర్పడిన బురుసాలు
జాతినీలాదులును • శాలువులు చీనీలు
పచ్చపట్టులు తగటు•పాగలును నంగీలు
నచ్చపుమెఱుంగు గల • యవురంగజేబీలు
బుడుతకానీలు మహ•ముదులు నిరానీలు
సరి సేయరాని హం•సావళులు లాకీలు
మాదళంబులు వెన్న•మఱుగులు మునజ్జీలు
చాదరలు పైడిణిలు • చక్కనికబాయీలు
నడరు చిల్లానితేం • ట్లమరు బుర్నీసులును
నడికట్లు మేఘవ•ర్ణంబులును ద్రోపులును
మొకమాలులును సూర్య•పుటములు బనాతులును
నకళాతులం దెలుపు • చలికప్పడంబులును
హొంబట్టు లోడీలు • హొనకాదుకూలాలు
కబ్బాయితలుడాలు • గల్గుజిరబాబీలు
వింతవింతలుగాగ • వెలసినభవంతీలు

కాంతితతి వెదచల్లఁ • గల్గినసరంతీలు
దుద్దుకంబళ్లు చం•దువలు తివాచీలు
పద్దులకుఁ గైకొన్న • బలుజంబుఖానాలు
ప్రతిలేనిపట్టంచు • పలురత్నకంబళ్లు
నతులితము లైన చతు•రంగములబల్ల్బలము
తళుకుపగడపుకోళ్లఁ • దగు పట్టెమంచములు
కులుకునెత్తావికుం•కుమపువ్వుతల్పములు
ఏకరంగితలాట • లిడుగోర లేజీలు
ఢాకచూపట్టు సుర•తాణి సింగాణీలు
కళలుదేరు పిరంగి • కత్తులును జారీలు
పొలుపొందు నందలపు • బొంగులును గేడీలు
ఏరి కైకొనిన హార•బ్బీకెలును పన్నియలు
పేరైన సూరత్తు • పీంగాణిగిన్నియలు
రాయంచ లైదువ•ర్ణము లైనకీరములు
మాయురే యని యెంచ • మరుపట్టు జీనీలు
చీర్ణంపుపసులమిం•చినపిరగిపీతములు
నిర్ణయింపఁగరాని • నిజలసద్వస్తువులు 356
క. స్వరమండలములు కిన్నెర, లురబాబు లుదండవీణ • లుకుజారుతరా
ల్వరరావణహస్తంబులు, మరితంత్రులు తంబురలు స•మస్తము గొనియెన్. 357
వ. అయ్యవసరంబున. 358
సీసమాలిక. రాయదుర్గము గుత్తి • రాయవేలూ రాన్నెగొంది మాహురి కాసి • గోలకొండ
ముంగిపైఠిణి డిల్లి • ముళువాయజాబురా, బాదుమశ్బా మహా•మూరు మచిలి
బందరు సూరతు • చెందెరు గోవేరు, శ్రీరంగపట్టంబు • చెంజి కాంచి
బాదయు నౌరంగ•బాదు దౌల్తాబాదు, కప్పర గాగర • గదుగు బిదిలి
కోట కళ్యాణము • గొందానమహాముదా, నగరంబు బంగాళ • నరసగోన
పన్నాళ చదరంగ•పట్నంబు గలగల, గజరాజధాని బం•గాపురంబు
కాంబాగర ప్రయా•గ ద్వార కాయోధ్య, లక్ష్మీశ్వరంబు సో•లాపురంబు
మధుర కొల్లాపురి • మగధ మా యావంతి, కాపురాణపురముల్ • కాబలగయు
నాదవేని కళింగ • మానూరు వినుకొండ, కొండవీడును నేల•కొండపల్లి
పొడిలె తంజాపురం • బుదయగిరి కైసూరు, మైసూరు పెనుగొండ • మంగళగిరి

బసువపట్నము సీర్పి ♦ భద్రాచలము పాల, పంచ నిజాంపురి ♦ వందవాసి
కుందిర్పి బెల్లము♦కొండ దేవరకొండ, రాచర్ల మునిమడుగు ♦ రాయపురము
సైదాపురము గోవ ♦ సాళ్వాక దూపాడు, రాపత్రి మాచెర్ల ♦ రాచవీడు
భనగానిపల్లె కం♦భము పోరు మామిళ్ల, ధారాపురము చీని ♦ తాడిపత్రి
నంద్యాల చిరువల్లి ♦ నందవరము కందు, కూరు రామయపట్న ♦ మారుజండ
హంపి విరూపాక్ష ♦ మారణి వెంపలి, కాంపిల్యనగరంబు ♦ కందనూరు
కడప సిద్ధవటంబు ♦ గండికోట కనూరు, సింహాద్రి పుట్లూరు ♦ చింతగుంట
గయ చెన్నపట్నంబు ♦ గండవరం బోరు, గల్లు దా మెనచెర్వు ♦ వెల్లటూరు
కల్లూరు కలువాయి ♦ నెల్లూరు వేలూరు, రాచూరు చదుమూరు ♦ రాచకొండ
కదిరికూటాగుళ్ల ♦ గంగేరు శృంగేరు, రామళ్లకోట వ♦జ్రగిరి నుసుము
నూగూరు చోళాడ ♦ బాగూరు కొళ్లాల, గుడిబండ బళ్లారి ♦ కొత్తకోట
గుమిలేనిపాళెంబు ♦ గొబ్బూరు బళ్లాపు, రము పుంగనూ రాను♦రామటెంకి
మానవ కాతాళ ♦ మానుకొం డైనూరు, జలపూరు పెదవలి ♦ జల్లికోట
కుంభకోణము కోట♦కొండ తంజావూరు, పెరవలి దువ్వూరు ♦ బెంగుళూరు
వొత్తూరు చిత్తూరు ♦ హాణి చిత్రనాపల్లి, రాజవో ల్గద్వాలు ♦ రాచనగరు
చిరుతని కాళహ♦స్తి సినూరు మధ్యార్జు, నము తిరునామల ♦ నామకొండ
పాకల కావేరి♦పాక మోహనగిరి, చదుకూరు మల్లూరు ♦ చాదుకొండ
పాగొండ వావిలి ♦ నాగోలు తాళ్లూరు, మైలాపురము బెద్ద♦పంగళంబు
రామసముద్రంబు ♦ రామాపురము జట, పోలూరు వెల్లాల ♦ భువనగిరియు
హరిపనల్లీ బేద ♦ నరవారి గొండాపు, రము గౌరి మాయూర ♦ మమర వీడు
నడిగల్లు కొక్కల్లు ♦ కడపకోలను రత్న, గిరి వెలిగోడు తం♦గెళ్లదర్శి
కంగొంది తనుగొండ ♦ గడవ నెత్తము దూస్తి, సివనగాళ్ల వళంది ♦ సింగళంబు
మన్నారుకోవెల ♦ సొన్నగలు చిదంబ, రము వాగెనగరి పు♦రాణపురము
వడియాసపాళెంబు ♦ నుడిపి సుబ్రహ్మణ్య, ముజ్జంగి మండువా ♦ మోసవగలు
రామనాధపురంబు ♦ మాముగోళ్ల బెడంద, ధర్మవరంబును ♦ దాడిగోళ్ల
మవణికె మందము ♦ మారకపురి కుంభి, హారంగ ముజ్జారి ♦ హాళికె హాల్లి
రెట్టిహాళి కురంజి ♦ రేవణి సన్నకి, బాగూరు గుజ్జరి ♦ పాలువాయి
రామచంద్రాపుర ♦ మామూరు బెజవాడ, కొండేరు కాందూరు ♦ కోటకొండ

తే. మొదలుగా గల్గు జనపద♦ములను దుర్గ
ముళను చేట్లలఁ బ్రాళీలఁ ♦ బురుల వెలయు

వర్తకులు వచ్చి రచ్చటి • వస్తుతతులు
జేఁటసారంబు లాడెడు • పేర్మి మెరసి. 359

క. ఆరీతి వచ్చువారల, కారయఁ దాఁ జిన్నపెద్ద • యై నీవిభుఁ డిం
పారగ వస్తువు లన్నియు, బేరము పొసగించి చేసి • వెల కిప్పించెన్. 360

ఉ. అంచితబుద్ధివర్తకజ • నావళి కిట్లు సమస్తవస్తు లి
ప్పించి తదీయభూషములను • వేడ్కఁ జనుం డని వారి నెల్ల నం
పించి వృషోష్ట్రవాజిరథ • బృందముపైఁ దనకొన్న రస్తుబొం
దించి సమిత్రుఁడై యరుగు • దెంచెను నీవిభుఁ డూరు చేరఁగన్. 361

వ. అనివవిని హేమావతీకాంతసంతోషంబున భోజనాదుల సంతుష్టుం జేసి తనయోగక్షే
మంబుల పతి కెఱింగింపు మని యతని నంపి తదనంతరంబ. 362

తే. కథలు రేత్రెల్లుపట యెకాదు • కరుణఁ బ్రొద్దు
పోనియపుడెల్ల రాయంచ • పూని చెప్పి
నట్టినయవాక్యములచేత • నైన సన్మ
నీష హేమావతీమంజు • భాష యపుడు. 363

క. పరపురుషసంగమం బిహ, పరసుఖదూరంబు గానఁ • బాతివ్రత్యే
సుర్షణ గలసతులు మదిగో, ర రటంచును నిశ్చయించి • ప్రమదం బెసఁగన్. 364

తే. చిత్రభోగునిపైఁ బ్రేమ • చిందఁ జేసి
నిజవిభునిరాక కలరి య • న్నీరజాక్షి
తనదు గృహకృత్యములు దీర్చు • కొనుచు నుండె
నంత దత్పతి యింటికి • నరుగుదేర. 365

క. వందనపుబిందియలహరి, చందనతరుఖండవహ్ని • సంసప్తంబై
క్రొందావు లొల్కు పన్నీ, టం దగ జలకం బొనర్చి • తడయక యంతన్. 366

ఉ. ఆజవరాలు కీలుజడ • నంబురుహోత్పలకేసరాలు వ
క్షోజధరాలు గప్పుకొని • క్రొమ్మగరాలసరాలు నంగుళీ
రాజవినూత్నరత్నముల • రంగు చెలంగెడి యుంగరాలు వి
భ్రాజితనూపురాలు పద • పద్మములన్ సవరించి వెండియున్. 367

సీ. వనచరంబులు గాన • వచ్చె మైత్రికి నన, వేణికాళిశ్రేణి • విరులు దురిమి
నీటబుట్టినవాట • నెమ్మి డాసె ననఁగ, గళశంఖమున హార • ములు ధరించి

జలజంబు లౌటనె • చెలిమిఁ జెందె ననంగఁ, గలవారిజములఁ గం•కణము లుంచి
సారంగజము లౌట • సఖిత నొందిన సువ, త్తికోజకుంభముల క•స్తూరిఁ బూని
తే. కనకరుచు లౌట మిత్రత • ననఁగి పెనఁగె
ననఁగఁ దనుహేమలతను మి • న్నగు పదారు
వన్నె బంగారుపువ్వుల • వలుసఁ దాల్చి
పతికి నెదురుగ నేగె సం•పద్మగంధి. 368
వ. అనమయంబున. 369
సీ. మిసమిసచూపులు • మిసమిట్లు గొలుపంగఁ, గిలకిలనవ్వులు • చెలు వొనర్ప
ఘలుఘల్లు మని చిరు•గజ్జెలు రొదసేయ, ధళధళద్యుతుల క•మ్మలు చలింప
ఝుణఝుణంకృతుల కం•కణములు మెరయంగ, ఘనఘనధ్వనుల మే•ఖల నటింప
ధగధగద్దీప్తిరం•త్నపుసొమ్ము లలరార, నిగనిగ బావిలీ • లీన్నటుచూప
తే. భుగభుగలు గుల్కు మైపూఁత • సొగసు గుల్కు
గమగమల కప్రపువిడెంబు • గంధ మొలయ
మిసమిస ల్కుంకుమపురేఖ • మించు లొల్కు
ఖణిఖణి ల్లని మెట్టియ • ల్కడు రహింప. 370
క. తన కెదురుగ వచ్చిన తన, వనితామణి నపుడు చూచి • వదనాంభోజం
బునఁ జిరున వ్వొలయఁగ నె, మ్మనమున నానంద మొందె • మానిని యంతన్. 371
తే. విభునిపదములు పన్నీట • వేడ్కఁ గడిగి
నెచ్చెలులతోడ వెన నివా•ళిచ్చి వైచి
యింటిలోనికిఁ దోడ్తెచ్చి • యింతులెంచ
భర్తతోఁగూడ నతిసుఖ•ప్రాప్తి నుండె. 372
వ. అంత హేమవతీకాంతవృత్తాంత మంతయు నాత్మీయదూతి విన్నవించిన విని కంపితశి రస్కుండై కొంతదడవు చింతించి మహారాజచంద్రుండును నీతిజ్ఞుండును నకళంకుం డును వివేకధురంధరుండును గావునఁ జిత్రభోగనృపాలుండు దనమనంబున. 373
ఉ. మున్నల రావణాదులు సం•ముద్ధతిసాధ్వుల గోరి యేమి సౌ
ఖ్యోన్నతిఁ జెంది రి ట్లగుట • నుర్విజనావళు లన్యకాంతలన్
బన్నుగఁ గోరరాదు కడుఁ • బాతక మంచుఁ దలంచి యింతిపై
నున్నమనంబు ద్రిక్కొని య•థోచితపద్ధతి నుండె భూవరా. 374
క. అనుచుఁ బురోహితుఁ డెఱిఁగిం, చిన నల రాజన్యమౌళి • చిత్తాంభోజం
బున నద్భుతప్రమోదము, లెనయఁగ మెచ్చుకొని రాజ్య • మేలుచు నుండెన్. 375

మ. నలసంజీవనజీవనేశభయకృ•న్నారాచనారాచర
వ్రతబృందారకదారకత్యనపదా•రక్షోభిరక్షోభట
శ్రుతసంధారణధారణార్హమణిభా•సుగ్రీవసుగ్రీవము
ద్ధతలాలాపనలాపనద్యుతిచితా•తారాపతారాపహా. 376

క. అక్షద్విడ్లక్షక్షి, ప్తక్షేమకటాక్షదక్ష•దక్షతనూజా
ధ్యక్షనుతపక్షపక్షి, ప్రక్షుణ్ణోర్క్ష్యమవిపక్ష•రక్షాశిక్షా. 377

స్రగ్విణి. పద్మపత్రేక్షణా • భక్తసంరక్షణా
పద్మగర్భస్తుతా • భానుబింబస్థితా
పద్మబాణాకృతీ • భవ్యశౌర్యోన్నతీ
పద్మసర్వేశ్వరా • పాలితోర్వీశ్వరా. 378

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యగోత్ర.పవిత్రాయ్యలరాజాన్వయ సుధావార్ధి పూర్ణిమాచంద్ర నిస్పృహాయకవిత్వ నిర్మాణచాతుర్యనిస్తంద్ర శ్రీరామనామ పారాయణ నారాయణామాత్యప్రణీతం బైన హంసవింశతి యను మహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము సంపూర్ణము.



